అపరాధ పరిశోధన అనుబంధం—36

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## రెండు వేలిముద్రలు!!

రచన : డాక్టరు పెందుర్తి మాస్టర్జీ

## కనిపించే శవాలు?

రచన : టెంపోరావ్

## వెంటాడిన దొంగలు

రచన : రంకిరెడ్డి రాము

## మేడం దయానా!

రచన : శశిభూషణ్

'శాన్యోరా' సీరియల్-మొదటిభాగము

అపరాధ పరిశోధన సప్లిమెంట్—36
డిసెంబర్, 1976
వెల : 3_00 రూపాయలు
ఏడాది చందా 39 రూపాయలు
జీవిత చందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
కంచర్ల రమణ

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు_29
ఫోన్_36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు_1.

గెడా రంగారావు

# రెండు వేలిముద్రలు!

డాక్టర్ పెందుర్తి మాస్టర్జీ

ఆ ఇల్లు రెండంతస్తుల మేడ.

బజారు నానుకొని ఒక కాంపౌండ్ వాల్ వుంది. దానికి పెద్ద ఐరన్ గేటు. గేటుకు చిన్న తలుపు వుంది. గేటునుండి ఇరవై గజాల దూరం అందమైన పూలచెట్లు వున్నాయి.

లోపల అంతకంటె అందమైన అమ్మాయిలు వుంటారని కొందరికే తెలుసు.

పల్లవి గేటు తెరచి లోపలకు నడిచింది. చేతిలో అందమైన పూలబుట్ట, ఎరుపురంగు లంగా, నీలంరంగు పరికిణీ, పచ్చరంగు రవిక, కురచగా వేసుకున్న జడ, మువ్వల పట్టాలు. విశాలమైన నేత్రాలు, ఊటి టమాటారంగు పెదవులు.

"అమ్మగారూ! పూలు తెచ్చాను."

ఎదురుగా సోఫాలో కూర్చున్న నలభై ఏళ్ళ స్త్రీ నవ్వింది.

"ఏమే నిన్న రాలేదు?"

"మా అమ్మకు సుస్తీగా వుందమ్మా! అందుకే రాలేదు."

"సరేలే ఇచ్చి వెళ్ళు" అంది కామాక్షి.

అప్పుడే బయట కారాగింది. సోఫాలో సాఫీగా కూర్చున్న కామాక్షమ్మ ఆతృతగా లేచింది.

ఓ నలభై ఏళ్ళ వ్యక్తి పంచె, లాల్చీ ధరించి వున్నాడు. గుంభనగా, గంభీరంగా లోపలకు వచ్చాడు. వస్తూనే అతని కళ్ళు పల్లవిపై పడ్డాయి.

"ఏమిటి అలా చూస్తున్నారు?"

"కొత్త పిట్టా?"

"మాకు పువ్వులిచ్చే అమ్మాయి. అలా అనకండి. ఆ పిల్ల అలాంటిది కాదు" అంది కామాక్షమ్మ అనునయంగా.

"ఓఁ!" అంటూ నెమ్మదిగా లక్ష్మీపతి ఆ అమ్మాయి దగ్గరకు నడిచాడు. పల్లవి భయంగా చూస్తుంది. లక్ష్మీపతి ముఖం రంగు మారింది. "కథలు చెప్పక ఇది చాలా పెద్ద కేసు."

"ఏమిటండీ మీర నేది?"

"బొంబాయిలో ఒక రాత్రి ఈ అమ్మాయితో గడిపాను."

కామాక్షి ఉలిక్కిపడింది. పల్లవి భయాందోళనలతో ఆశ్చర్యంగా చూసింది.

"మీరు పొరపాటు పడివుంటారు. ఎప్పుడు?"

“సరిగ్గా డిసెంబరు నెల.”

“భలేవారు. సరిగ్గా రెండు సంవత్సరాలనుండి రోజూ తప్పకుండా పూలు వేస్తుంది. మనిషిలాంటి మనిషి వుండ వచ్చు.”

లక్ష్మీపతి పెదవులు బిగించాడు.

పల్లవి వెళ్ళిపోయింది. పల్లవి వెళుతున్నవైపే ఆలో చిస్తూ చూస్తుండిపోయాడు లక్ష్మీపతి.

## 2

“హాలో డాలీ!” అన్నాడు ప్రక్కనే కారు నడుపుతూ.

పల్లవి చటుక్కున వెనుతిరిగి చూసింది.

“మీరా?”

“ఓ రూపాయి పువ్వులివ్వు.”

“రూపాయి పువ్వులు మీ ఆవిడ పెట్టుకుంటుం దాండీ?”

“ఏం, పెట్టుకోకూడదా? ఇదిగో అమ్మాయ్! ఈ పువ్వులు నావి కాదు.”

“మరి?” పువ్వులు అందించింది.

“నా కారుకి.” రూపాయి ఇచ్చాడు.

“కారుకి పువ్వులు పెట్టబట్టే ఇలా మండుతున్నాయి.”

“ఏమిటి, కార్లా?”

“కాదండి. పువ్వులు.”

“ఏది? చల్లగా వున్నాయే!”

పల్లవి నవ్వింది. “మీరు తమాషాగా మాట్లాడతారు.”

“కాని ఏం లాభం?” నా మాటలు వినటానికి నా పెళ్ళాం లేదు.”

6

"పెళ్ళాం ఎంతసేపండి. ఈ కారులో యిలా వెళ్ళి అలా వచ్చేలోపు ఎవరో ఒకరు దొరుకుతారు."

"ఎవరు? పిల్ల తల్లులా?"

పల్లవి మళ్ళీ నవ్వింది. "భలేవారే! అమ్మాయిలండి."

"ఏం దొరకటమో ఏమో నాది ఒకే ఐడియా. అమ్మాయి అచ్చు ఆంధ్రయువతిలా వుండాలి. నీలాగ నవ్వుతూ మాట్లాడాలి. అప్పుడప్పుడు కోపంగా వుండాలి కూడా. నీలాగే పేదరాలై వుండాలి. నీలాగే నుదుటన దోసగింజలాంటి బొట్టు వుండాలి."

"నాకు తెలిసి అమ్మాయిలు అలా ఎవరూ లేరండి. అయినా ప్రయత్నిస్తాను" అంది పల్లవి.

మధుకి నవ్వొచ్చింది. ఇంత అమాయకురాలేమిటి అనుకున్నాడు మనసులో. "సరే, రేపు యిదే వేళకు ఇక్కడే వుంటాను."

"మంచి పువ్వులు తెస్తానులెండి."

"పువ్వులు తెస్తావో, పువ్వులాంటి పిల్లని తెస్తావో!"

కారు కదిలింది. మధు వెళ్ళినవైపే పల్లవి చూస్తోంది.

3

లక్ష్మీపతి సాక్షీగా సోఫాలో కూర్చున్నాడు. ప్రక్కనే కూర్చున్న వ్యక్తి అన్నాడు. "పల్లవి మధుని ప్రేమిస్తున్నట్లుంది." లక్ష్మీపతి సిగర్ వెలిగించాడు.

"అవును. పల్లవిని ఇంకా ఎందరు ప్రేమిస్తారో?"

"అదేమిటి బాస్!"

"నీకు తెలీదు మూర్తీ!" అంటుండగా పల్లవి వచ్చింది.

"రామ్మా! పల్లవీ!" అన్నాడు లక్ష్మీపతి.

"పిలిచారట. ఎందుకు?"

"ఏం లేదు. చనిపోయిన మా అమ్మాయి పుట్టిన రోజు ఈ వేళ. నా సంతోషం కొరకు ఈ బట్టలు కట్టుకొని పాట కచేరికి వెళ్ళమ్మా!"

పల్లవి ఆశ్చర్యంగా చూసింది. లక్ష్మీపతి ముఖం విషాదంగా వుంది. పల్లవి మాట్లాడకుండా ఆ దుస్తులు ధరించి పాటకచేరికి వెళ్ళింది.

"బాస్! ఏమిటిది?"

"అంతా ప్లాను. పల్లవిని ఎందరు వెంబడిస్తారో ఇప్పుడే తెలుస్తుంది. పల్లవిని వాచ్ చెయ్యి."

"అలాగే బాస్!"

## 4

మాలినీ పాటకచేరి.

ఆమె సంగీతకచేరికి దేశవిదేశాలలో పేరుప్రఖ్యాతులున్నాయి. హైదరాబాద్ రవీంద్ర భారతిలో జరిగే ఆ కచేరికి పురప్రముఖులు, ప్రజానాయకులు, ఇంకా ఎందరో సామాన్యులు వచ్చారు.

పోర్టికోలో చెవర్లీ, ఇంపాలా ఎన్నో రకాల కార్లు, మోటార్ సైకిళ్ళు వున్నాయి.

పల్లవి భయంగా డ్రైవర్ చెప్పిన చోట కూర్చుంది. క్రొత్తగా, క్రొత్త మనుషుల మధ్య పెద్ద శ్రీమంతురాలులా వుంది.

డయాస్ మీద లైట్ మ్యూజిక్ వినిపిస్తోంది.

మధు పోర్టికోలో కారాపాడు. లోపలికి ప్రవేశించి పల్లవిని చూసి చకితుడయ్యాడు.

తన కళ్ళను తనే నమ్మలేకపోయాడు.

మాలినీ సంగీతం ప్రారంభమైంది.

డ్రెస్ సర్కిల్‌లో ప్రక్కనే కూర్చున్న పల్లవి మునపటి పల్లవిలా లేదు. ఏ కోటీశ్వరుడి భార్యలాగానో వుంది.

ఆమె కట్టుకున్న షిఫాన్ చీర ఆకుపచ్చగా వుండి, అదే రంగుతో వున్న రవికలో అవయవాల పొందిక, అధరాల అందం ప్రత్యక్షంగా కనిపిస్తోంది. మెడలో లాకెట్టు, చెవులకు రింగులు, జ్యోతిలా పెట్టిన బొట్టు. పల్లవి అవునా? కాదా? అన్న ప్రశ్న మనసులో మెదిలింది మధుకు.

"పల్లవీ!" ప్రయత్నంగా పిలిచాడు.

ఆమె తనవైపు తిరిగి "ఎవరు మీరు?" అంది. మతి పోయినట్లయింది మధుకి. "సారీ! మా పల్లవి ఏమో అనుకున్నాను."

"నేనలా వున్నానా?"

"అఫ్‌కోర్స్!" అన్నాడు నవ్వి.

నీలిమా మాలిని వేదికపైకి వచ్చి అందరికి నమస్కరించింది. కరతాళధ్వనులతో హాలు ప్రతిధ్వనించింది.

కర్ణాటక సంగీతంతో ప్రారంభమైన గానం కొంతసేపు ప్రేక్షకుల మనసు రజింపజేశాక కాస్త విశ్రాంతిసమయమైంది. అప్పటివరకు మధు చూస్తూనే వున్నాడు.

"నేను బావున్నానా?" అంది పల్లవి నవ్వి.

"ఎవరు నువ్వు?" మధు అడిగాడు.

"నేను పల్లవిని" అంది వింతగా నవ్వి.

"పల్లవి ఎవరో నాకు తెలీదు" అన్నాడు మధు.

పల్లవి బుంగమూతి పెట్టింది.

మధు నవ్వి "ఏమిటి యీ అవతారం?"

"లక్ష్మీపతిగారు యిలా పంపించారు. ఆయన చాలా మంచివారండి" అంది పల్లవి.

ప్రేక్షకుల్లోనుండి ఒక వ్యక్తి బైనాక్యులర్‌తో చూస్తు న్నాడు. అతన్ని గమనించినా మధు గమనించనట్లు వూరు కున్నాడు. ట్వీడ్ సూట్‌లో వున్న ఆ మనిషి ఎవరై వుంటారు? ఈమెనే ప్రత్యేకంగా చూడటంలో అభి ప్రాయం ఏమైవుంటుంది?

త్యాగరాజు గీతిక ప్రారంభించింది నీలిమ.

కొన్ని నిమిషాలలో సంగీతం ముగిసింది.

# 5

పల్లవి గబగబ బయటకు వచ్చేసింది. కాస్త వెనుకగా మధు వచ్చాడు. రోడ్డంతా కార్లతో, రిక్షాలతో, ఆటో లతో కోలాహలంగా వుంది.

బయట కారిడార్‌లో నిలబడ్డాడు మధు. పల్లవి కారులో వెళ్ళిపోయింది. వెళ్ళిపోతున్న కారువైపు చూస్తూండి పోయాడు.

మధుకు ఆమె గురించి ఓ రకంగా అర్థంకాలేదు. ఆమె నిజంగా పూలమ్మే అమ్మాయా? లేక అలా నటిస్తోందా? ఆలోచిస్తూ నిలబడ్డాడు. ఎంత వూహించినా ఆమె తన కళ్ళకు పూలమ్మే సామాన్యమైన యువతిలానే కనిపి స్తోంది.

"హల్లో మధూ!" భుజంపై చేయివేసింది లిలియా.

"నువ్వా?" భుజంపై చేయి తొలిగించాడు.

"ఎవరు అనుకున్నావ్?" అడిగింది.

మధు వింతగా నవ్వాడు. "నువ్వే అనుకున్నాను. ఈ ఆంధ్రదేశంలో ఇంత తేలిగ్గా నా భుజంపై చేయి వేయగల యువతి మరొకరు లేరు."

"కరెక్ట్. కాని ఆ స్థానం మరో యువతి అందుకుం టూంది" శాస్త్ర బాధగా అంది.

మధు ఆమె కళ్ళలోనికి చూశాడు. ఆమె మధు ముఖంలో ఏదో వెదుకుతూ అంది. "డియర్ మధూ! నన్ను ప్రేమించలేవా?" కళ్ళలో కాంతు నింపుకొని అంది.

"సారీ లిలియా! ప్రేమ స్వవిషయం. నీలాంటి యువతి ప్రేమించు అన్నంతమాత్రంలో హఠాత్తుగా పొంగేది కాదు. నాలో ఒకేఒక సద్గుణముంది. విపరీతంగా త్రాగు తాను, డబ్బు లెక్కలేకుండా ఖర్చుపెడతాను, కాని స్త్రీ విషయంలో నా శీలం నిలుపుకుంటాను."

"అందుకే నీవంటే ఇష్టం!"

"ఇష్టంగానే వుంచు. ప్రేమించక. ప్రమాదం" అంటూ కారు దగ్గరకు నడిచి డోర్ తెరిచి లోపల కూర్చొని డ్రైవ్ చేశాడు. కారు సాగిపోయింది, లిలియా చూస్తుండి పోయింది.

# 6

ఫుట్ పాత్ మీద గబగబ నడుస్తోంది పల్లవి. వెనుకగా కారులో వచ్చి సడన్ బ్రేక్ వేశాడు.

"మీరా?" అంది మధుని చూసి.

"అవును. మళ్ళీ అవతారం ధరించావ్! చూడు పల్లవీ! నీవు ఆ వేశ్యల ఇంటికి వెళ్ళవద్దు. నీ పువ్వులన్నీ నాకే అమ్ము. అన్నీ నేనే కొంటాను."

"ఎందుకని?"

"కొన్ని రోజులకు నీవు కూడా వేశ్యవంటారు."

పిడుగుపడ్డట్లయింది పల్లవికి.

"ఏమిటండీ మీరనేది?"

"నీకు తెలీదు పల్లవీ! నీకు తెలియకుండానే నీవు ఒక భయంకరమైన విషవలయంలో ఇరుక్కుంటున్నావు. లక్ష్మీపతి గురించి నీకు తెలీదు" మధు అన్నాడు.

"ఆయన చాలా మంచివారండి. ఆయన కూతురు నాలాగే వుండట. ఆమె చనిపోయిందట. అందుకే అప్పుడప్పుడు నన్ను అలంకరించుకోమంటారు."

మధు పెదవులు బిగించాడు. "నీ యిష్టం. నేను చెప్పగలిగింది నేను చెప్పాను." కాస్త చిరాకుగా మధు ముందుకు సాగాడు.

పల్లవి కాస్త సందిగ్ధంలో పడింది.

## 7

లిలియా యాష్ట్రేలో సిగరెట్ ఆర్పి లేచి టెలిఫోన్ దగ్గరకు నడిచింది. హోటల్ కౌంటర్‌లోనికి ఫోన్ చేసింది. "ట్రంక్ కాల్ టు బొంబాయ్" అంటూ నెంబర్ చెప్పింది.

కొన్ని క్షణాలలో అవతలినుండి ఫోను. "హలో!"

"హలో! లిలియాను మాట్లాడుతున్నాను."

"ఏమిటి?"

"మీకో గుడ్ న్యూస్. మీ ఫణి బ్రతికే వుంది."

"వాట్?" అవతలనుండి గొంతు.

"ఆశ్చర్యపోకండి. పైగా మిమ్మల్ని యీ లిలియా చీట్ చేయదు. ఫణి మైండ్ ఎఫెక్ట్ యిచ్చి అలా ప్రవర్తిస్తోందో, లేక నటిస్తోందో తెలియటంలేదు."

"ఫణి బ్రతికే వుందన్నమాట. ప్రస్తుతం ఎవరి స్వాధీనంలో వుంది?" అవతలనుండి.

"ఇంకా ఫలానా అని తెలీదు. కారు బ్రోకర్ మధు

అనే వ్యక్తి పెళ్ళిచేసుకోవాలని తాపత్రయపడుతున్నాడు. వైదిబైలక్ష్మీపతి అనే వ్యక్తి ట్రాప్ చేస్తున్నాడు. లక్ష్మీపతి ఎవరు ఏమిటి? అని నాకు తెలీదు.'''

"ఓ.కే. నీకు సహాయంగా రూబెన్‌ను పంపుతున్నాను. రూబెన్‌తో ఫణి వేలిముద్రలు పంపుతున్నాను. మొదట ఆమె ఫణి అవునా? కాదా? వేలిముద్రలతో తెలిసి పోతుంది. ఈలోపు కొంత డబ్బుకు లక్ష్మీపతి ఆమెను మనకు అప్పగిస్తాడేమో తెలుసుకో!"

"ఓ.కే. బాస్!"

"విష్ యూ బెస్ట్ ఆఫ్ లక్!"

"థాంక్యూ."

# 8

పెద్ద బంగళా. కాస్త భయపడుతూనే గేటు తెరిచింది. ఎదురుగా స్తంభానికి కట్టిన అల్సెషన్ కుక్క అరుస్తుంది.

"ఇంట్లో ఎవరైనా వున్నారండీ?" పిలిచింది.

"టామీ! ఏమిటీ గోల?" అంటూ వచ్చాడు లక్ష్మీపతి.

లక్ష్మీపతి కళ్ళు జిగేల్‌మనేలా వుంది లిలియా అందం. నవ్వుతూ వినయంగా సమీపించాడు. "ఎవరు కావాలండీ?" అడిగాడు నవ్వుతూ.

"లక్ష్మీపతిగారు కావాలి."

"నేనే లక్ష్మీపతిని."

"నేను చాలా అదృష్టవంతురాల్ని. మీరే వచ్చారు."

"లోపలకు రండి." ఇద్దరూ లోపలకు నడిచారు.

పెద్ద సోఫాలు, వాటికెదురుగా సోఫా కమ్ బెడ్,

గా(డేజ్ కుర్చీలు, అందమైన చిన్న టేబుల్స్, వాటి మీద వాడని పువ్వులు వున్నాయి.

"మీతో ఒక విషయం మాట్లాడాలి అని వచ్చాను."

"చెప్పండి."

"పల్లవి గురించి మీ అభిప్రాయం ఏమిటి?"

"అంటే?"

"అర్థం కాలేదా? పల్లవి మీద్వారా మా చేతికి చిక్కాలి. పల్లవిని మాకు ఆరు నెలలు అప్పగిస్తే మీకు రెండు లక్షలు యిస్తాం." అంటూ కళ్ళలోనికి చూసింది.

"రెండు లక్షలా?"

"ఏం ఆశ్చర్యంగా వుందా? అయితే పల్లవిని ఓ రకంగా ట్రాప్ చెయ్యాలి. అది యిక్కడే సాధ్యం."

"ఎలా?"

"ఎలాగో నేను చెపుతాను. నీవు మాతో సహకరించాలి. నీకు రెండు లక్షలతోపాటు కావాలంటే నేను కూడా."

"అబ్బో! భగవంతుడు యీవేళ చాలా గొప్ప వరం యిచ్చాడు. అయితే ఒక్క మాట. నాకు లక్ష చాలు. నా శత్రువు ఒకడ్ని చంపాలి!"

"ఇంతే కదా!" చిటిక వేసింది.

"క్రిమ్‌వాళ్ళ ద్వారా?"

"నీకా భయం అవసరంలేదు. లిలియా ఎప్పుడూ మీకు తోడుగా వుంటుంది."

"మరెప్పుడో?"

లిలియా నవ్వింది. "నిదానమే ప్రధానం. ముందు కర్తవ్యం. ఈలోపు పల్లవితో చాలా చనువుగా వుండాలి."

"అది మీరు చెప్పాలా?"

బయట కుక్క మొరుగుతుంది. లక్ష్మీపతి కిటికీలోనుండి చూశాడు. "అరె, పల్లవి వచ్చింది."

"వెరీ గుడ్! చిన్న పని. ఒక గ్లాసు శుభ్రంగా తుడిచి మంచినీళ్ళు యివ్వు."

"ఎందుకు?"

"ఆమె వేలిముద్రలు కావాలి. ఈలోపు నేను లోపల వుంటాను." లిలియా గబగబ లోపల రూంలోనికి వెళ్ళింది. లక్ష్మీపతి బయటకు నడిచాడు.

లక్ష్మీపతి పల్లవిని లోపలకు పిలిచాడు.

పల్లవి ముఖంలో విషాదచ్ఛాయలు.

"ఏమిటమ్మా!" అతి ప్రేమగా అడిగాడు.

"మా అమ్మ చనిపోయిందండి. ఉన్న డబ్బులు మందులకై పోయాయి."

"చెప్పొద్దు. ఎంత కావాలి? ఐదువందలు చాలా?"

పల్లవికి మతిపోయినట్లయింది.

"చూడమ్మా! కూతురులాంటిదానివి. నీకు ఆపద వస్తే ఒకటీ, నాకు వస్తే ఒకటా?"

"వంద చాలండి."

"నీ యిష్టం. మిగిలినవి తీసుకువచ్చి యిచ్చెయ్. లేదా నీ యిష్టం" అంటూ బీరువాలోనుండి ఐదువందలు తీసి యిచ్చాడు.

"మంచినీళ్ళు త్రాగమ్మా!"

"వద్దండి" అంది పల్లవి.

"ఏడ్చి ఏడ్చి గొంతు ఆరిపోయివుంటుంది త్రాగమ్మా!"

పల్లవి మంచినీళ్ళ గ్లాసు అందుకుంది. నీళ్ళు త్రాగి గ్లాసు అక్కడే పెట్టింది. "వెళ్ళివస్తానండి."

"అలాగే! దహనసంస్కారాలు అయ్యాక కలువు."

పల్లవి తలూపి వెళ్ళిపోయింది.

లోపల గదిలోనుండి లిలియా వచ్చింది. "పథకం భలే పారింది. పల్లవి వేలిముద్రలు యింత తొందరగా దొరుకుతాయనుకోలేదు." అంది లిలియా.

లక్ష్మీపతి నవ్వాడు.

"గుడ్. వస్తాను. ఈసారి పల్లవిని మన గ్రిప్‌లో ఎలా వుంచుకోవాలో ఆలోచించి వస్తాను" లిలియా వెళ్ళిపోయింది.

లక్ష్మీపతి చూస్తూండిపోయాడు.

## 9

"సారీ పల్లవి. మీ అమ్మ చనిపోయేటప్పుడు నేను లేను."

"శవాన్ని వల్లకాడు చేర్చటానికి లక్ష్మీపతిగారిచ్చారు" మధు యెదురుగా కూర్చుంది పల్లవి.

టాంక్ బండ్ మీద కార్లు, ఆటోలు రద్దీగా వుంది.

సాయంకాలం చల్లగా, మనోహరంగా వుంది. కొన్ని నిమిషాలు యిద్దరి మధ్య మౌనం. "పల్లవీ! ఒక్కమాట సూటిగా అడుగుతాను, సమాధానం చెప్పగలవా?" ఆమె కళ్ళలోనికి చూశాడు.

"అడగండి."

"నేను మంచివాడ్నా? దుర్మార్గుడ్నా?"

"మీరు చాలా మంచివారు."

"అయితే కొన్నాళ్ళు నా యింట్లో వుండు. ఇలాంటి పరిస్థితిలో నీవు ఒంటరిగా వుండటం మంచిదికాదు."

"ఎలాంటి పరిస్థితిలో."

"అదే నీకు తెలీదు. వివరంగా చెపుతాను పద."

ఇద్దరూ కారెక్కారు. కొన్ని నిమిషాలకు మధు ఇల్లు చేరారు. మధు తాళం తీసి లోపలకు నడిచాడు.

నగరానికి కాస్త దూరంగావున్న చిన్నసైజు మేడ. ఒకవైపు ప్రకృతి, ప్రకృతిని ఆనుకున్న ఆ గదిలోనికి చల్ల గాలులు తెరలుతెరలుగా వీస్తుంటాయి.

"ఎలా వుంది?"

"చాలా బావుంది" అంది పల్లవి.

మధు నవ్వాడు. ఇప్పుడామెకు తను మంచి మిత్రుడననుకున్నాడు.

# 10

"గ్లాడ్ టు సీ యు" రూబెన్ అన్నాడు.

"వెరీ గ్లాడ్ టు సీ యు" అంది లిలియా.

రూబెన్ దగ్గరగా వచ్చాడు. "లక్ష్మీపతి విషయం ఏమయింది?" అడిగాడు.

"లిలియా తలచుకున్న పని దిగ్విజయం కావలసిందే."

"వెరీ గుడ్. యు ఆర్ జీనియస్."

"ఫణి వేలిముద్రలు తెచ్చావా?"

రూబెన్ నవ్వాడు. "ఫణి వేలిముద్రలు తేవటం ముఖ్యం కాదు. పల్లవి వేలిముద్రలు సంపాదించటం ముఖ్యం."

"లిలియా గురించి బాస్ చెప్పలేదేమో" అంటూ వేలిముద్రల ప్రొఫార్మ తీసింది. "వెరి గుడ్" అన్నాడు రూబెన్.

లిలియా బ్రాంది గ్లాసుల్లో ఒంపింది "చీర్స్."

"ఇప్పుడు రెండు వేలిముద్రలు టాలి చెయ్యాలి. ఆమె

పల్లవియేనా? లేక పల్లవిగా నటిస్తున్న ఫణియా? తెలుస్తుంది."

"యు ఆర్ కరెక్ట్!"

స్లేడ్‌లో అరేంజ్ చేశారు. వేలిముద్రలు ప్రతి సెంటీమీటరు, పది సెంటీమీటర్లుగా ఎక్స్‌పోజ్ చేసి చూశారు. ఇద్దరు ముఖాలు రంగులు మారాయి.

"అయితే?" అంది లిలియా.

"ఫణియే యీ పల్లవిగా నటిస్తుంది. ఇద్దరి వేలిముద్రలు ఒక్కటే" అన్నాడు రూబెన్.

లిలియా తలూపింది.

# 11

"ఏమండీ, ఎక్కడకు వెళ్ళారు?" బుంగమూతి పెట్టి అంది పల్లవి. మధు నవ్వాడు. "సినిమాకి."

"మీ రొక్కరే వెళ్ళాలా? ఇప్పటివరకు ఒక్కదానినే ఎలా వుండను. నా కెంతో భయం వేసింది. నన్ను మీతో సినిమాకి తీసుకువెళ్ళకూడదూ?" అంది పల్లవి.

"మధు పల్లవి కళ్ళలోనికి చూశాడు.

పల్లవి విషయంలో తనపట్ల ఆమె చూపే శ్రద్ధాసక్తులు చూస్తే మధుకి విచిత్రమైన ఆలోచనలు కలుగుతున్నాయి. నిన్ను ప్రేమిస్తున్నానని అనలేదు. అంటే ఆమె యిల్లు వదిలి వెళ్ళిపోతుందనే భయం.

మరునాడు పాలిస్టర్ చీర తెచ్చాడు. "ఎలా వుంది యీ చీర?" అడిగాడు.

"చాలా బాగుంది. ఎవరికండీ?"

"నా కాబోయే భార్యకి."

పల్లవి ముఖంలో రంగు మారటం గమనించాడు.

బహుశా ఆమె తనను ప్రేమిస్తూ, తనలాగే చెప్పలేక బాధపడుతుందేమో అనుకున్నాడు. "ఎలా వుంది?"

"చాలా బావుంది."

"కట్టుకో మరి."

"అంటే?" విస్తుపోయింది.

"ఈ చీర నీ కోసమే."

"అయితే, మీ కాబోయే భార్య నేనన్నమాట."

"అవును."

పల్లవి గబాలున ప్రక్కగదిలోనికి వెళ్ళి తలుపు వేసుకుంది.

మధుకి మతిపోయినట్లయింది. లోపల ఏడుస్తున్న శబ్దం వినిపించింది. "పల్లవి...పల్లవి" పిలిచాడు.

పల్లవి తలుపు తెరిచింది. కన్నీరు నిండిన కళ్ళు. మధుకి బాధ కలిగింది. "ఏడుస్తున్నావా?"

తలూపింది.

"ఎందుకు?"

"ఈ సమయంలో మా అమ్మ వుంటే?" అంది. మధు, పల్లవిని గుండెలకు హత్తుకున్నాడు. పల్లవి అతని కౌగిలిలో ఒదిగిపోయింది.

# 12

మధు, పల్లవిల పెళ్ళి జరిగిపోయింది.

అచ్చట్లు, ముచ్చట్లు అన్నీ సాంప్రదాయం ప్రకారమే జరిగాయి. పెళ్ళికి లక్ష్మీపతి రావటం మధుకి యిష్టం లేకపోయినా, పల్లవి యిష్టప్రకారం పిలిచాడు.

ఆ రోజునుండి దాదాపు పదిహేనురోజులు పల్లవికి పండుగలా వుంది. మధు పడకపైనుండి ప్రక్కకు రానివ్వ

టంలేదు. ఎప్పుడూ అలాగే వుంటే అవతలివా రేమను కుంటారో అని సిగ్గుపడేది పల్లవి.

మరి కొన్నిరోజులు క్రొత్త జంట నగర సంచారం, సినిమాలు, షికార్లు, ఊరులోనికి వచ్చిన సర్కసుని, ఎగ్జిబిషన్ని అలసిపోయేలా చూస్తున్నారు.

ఆ రోజు—

పల్లవి గదిలో కూర్చొని పుస్తకం తిరగేస్తుంది.

బజర్ మ్రోగింది.

ఆతృతగా వచ్చింది పల్లవి. ఎదురుగా లక్ష్మీపతి యింటి నౌకరు నిలబడివున్నాడు.

"ఏమిటి?"

"లక్ష్మీపతికి యాక్సిడెంట్ అయింది. డాక్టర్ బ్రతకరని చెప్పాడు. ఆయన చివరసారిగా మిమ్మల్ని చూడాలంటున్నారు."

పల్లవికి బాధ కలిగింది.

"అయ్యో...యిప్పుడెలా?"

"ఒక్కసారి కనిపించి వెళ్ళండమ్మా."

"ఆయన యింట్లో లేరు."

"ఎంతలో వస్తారు? కారులో వెళ్ళి కారులో వచ్చేద్దురు. రండమ్మా" బ్రతిమిలాడాడు.

పల్లవికి ఏం చేయాలో తోచలేదు. తండ్రిలాంటి లక్ష్మీపతి, తన తల్లి అంత్యక్రియలకు డబ్బు యిచ్చిన మహానుభావుడు.

ఏం చెయ్యాలి?

"ఆలోచిస్తే లాభంలేదు. ఆయన చనిపోయాక ఆయన శవంమీద పువ్వులువేయటం తప్ప మీరేం చెయ్యలేరు."

పల్లవి ఆలోచించలేదు. మౌనంగా బయలుదేరింది.

# 13

లక్ష్మీపతి యింటిముందు కారాగింది. ఆత్రుతగా లోపలకు నడిచింది. లోపల అంతా నిశ్శబ్దంగా వుంది. అంతా కలయచూసింది. గడియారం టిక్ టిక్ మంటుంది.

ప్రక్కగదిలోనుండి ఎవరో వచ్చారు. "అయ్యగారు లోపల వున్నారమ్మా" అన్నాడు. పల్లవి ఆత్రుతగా లోపలకు నడిచింది.

లోపలకు ప్రవేశిస్తూనే స్తంభించిపోయింది.

లక్ష్మీపతి సోఫాలో సాఫీగా కూర్చున్నాడు. ఎదురుగా బ్రాంది సీసాలు, గ్లాసులు వున్నాయి. అంతలో వెనుక తలుపులు మూసుకుపోయాయి. కాదు లిలియా మూసి వేసింది.

పల్లవికి ఎందుకో భయం వేసింది.

"ఆగావేం? రా పల్లవీ" నిషా నిండిన కళ్ళు నిశితంగా చూస్తూ పిలుస్తున్నాయి. పల్లవికి కంగారుగా అయోమయంగా వుంది. చేతులు చల్లబడ్డాయి.

"మీకు యాక్సిడెంట్ అయిందట."

"నాకు కాదు, నా మనసుకి. నీలాంటి అందాలరాశిని అనుభవించాలని యీవేళ క్రొత్తగా కోరిక కలిగింది!" లక్ష్మీపతి లేచాడు.

"బాబుగారూ!"

"తప్పు, బావగారు అని పిలవాలి" దగ్గరకు వస్తున్నాడు. పల్లవి విస్తుపోయింది. చేతులు కాళ్ళు వణికిపోతున్నాయి. గభాలున తలుపు దగ్గరకు వెళ్ళబోయింది.

పులిలా లంఘించాడు. అతని చేతుల్లో ఇమిడిపోయింది. "వదలండి...మీ బిడ్డలాంటిదాన్ని" అంటూ వణికిపోతూ ఏడుస్తోంది.

లక్ష్మీపతి అదేమీ వినిపించుకోలేదు. ఆమె శరీరంమీద వున్న చీరె లాగాడు.

పల్లవి అరిచింది. బలంగా త్రోసి మూలకు పడింది. లక్ష్మీపతి వికృతంగా నవ్వాడు. టీపాయిపై వున్న ఫ్లవర్ వాజ్‌తో కొట్టింది. లక్ష్మీపతి తప్పుకున్నాడు. మళ్ళీ సమీపిస్తున్నాడు.

పల్లవి ఏం చేయాలి? అని వెదికింది.

ఎదురుగా రేడియోబల్లపై రివాల్వర్ వుంది.

ఆతృతగా రివాల్వర్ అందుకుంది. "దగ్గరకు వస్తే చంపుతాను."

లక్ష్మీపతి భయపడలేదు. దగ్గరకు వస్తూనేవున్నాడు.

పల్లవి చేతిలో రివాల్వర్ పేలింది. లక్ష్మీపతి అరుస్తూ నేల కూలాడు.

పల్లవి ఒక్కక్షణం కొయ్యబారిపోయింది. అంతలోనే తమాయించుకొని, కిటికీ తలుపులు తీసుకొని దొడ్డిదారి గుండా ఇంటివైపు పరుగుతీసింది.

మధు ఇంటిదగ్గరనే వున్నాడు. అంతా విని త్రాన్నడి పోయాడు.

పల్లవి ముఖానికి చేతులుపెట్టుకొని ఏడువసాగింది. మధు మతి చెడినట్లు గదిలో పచార్లు చేస్తున్నాడు.

"నేను హత్య చేశానండి" అంటుంది పల్లవి.

"నేను మొదట్నుండీ చెపుతున్నాను, నీవేదో విష వలయంలో చిక్కుకుంటావని. ఇప్పుడేం చెయ్యాలి?"

"ఎటైనా పారిపోదామండి."

"సరే. వెంటనే బట్టలన్నీ సర్దు. ఆగ్రాలో నా ఫ్రెండ్ వున్నాడు, వాడి దగ్గరికే పోదాం."

క్షణాలలో పెట్టి, బెడ్డింగ్‌తో బయటపడ్డారు.

## 14

రోజులు దొర్లిపోతూ ఏడాది గడిచింది.

ఏడాదిలో పల్లవి ఇంగ్లీషు బాగా నేర్చుకుంది. పల్లవికి నాలుగు నెలల పాప. ముచ్చటైన సంసారంగా గడిచి పోతుంది.

పల్లవి లక్ష్మీపతి హత్య గురించి దాదాపు మరచి పోయింది. మధుమాత్రం పోలీస్ డిపార్టుమెంట్ యీ హత్య మరచిపోదని ఆలోచిస్తూనే వున్నాడు.

డిటెక్టివ్‌ని నియమించాలంటే పల్లవి తనే యీ హత్య చేశానంటుంది. పల్లవి జైలుకు వెళ్ళితే తను బ్రతకగలడా అన్నది ప్రశ్నయింది. అ(గా మారుమూల యెంతకాలం యిలా తల దాచుకోవాలి. హత్య రహస్యం తాత్కాలి కంగా సద్దుమణగినా ప్రభుత్వపు దృష్టిలో సద్దు మణగదు.

ఆ రోజు సాయంకాలం ఆరుగంటల ప్రాంతంలో పల్లవి బయలుదేరింది. "ఎక్కడికి ప్రయాణం?"

"మధ్యాహ్నం చెప్పాను కదండి. బేగం, నేను సిని మాకి వెళుతున్నాం" అంది పల్లవి బాబుకి చొక్కా వేస్తూ.

మధు నవ్వాడు. పల్లవి అడిగింది, "ఎందుకు నవ్వు తున్నారు?"

"తెలుగు సినిమాలు మరచి, హిందీ సినిమాలు చూడ టానికి అలవాటు పడ్డావ్. ఒ. క. ప్రొసీడ్!"

"మీరు రాకూడదూ?"

"ఆడవాళ్ళ మధ్య మగవాడు రావటం ఆరోగ్యం కాదు, నీవు వెళ్ళిరా" అన్నాడు మధు.

పల్లవి, బేగం వెళ్ళిపోయారు.

# 15

టాక్సీ దిగాక టాక్సీకి డబ్బులు యిచ్చి బేగం వాళ్ళింటి నుంచి తన యింటికి వచ్చింది.

లోపల లైట్లు వెలుగుతున్నాయి గాని, యిల్లంతా నిశ్శబ్దంగా వుంది.

"ఏమండీ!" అని పిలిచింది.

అప్పటివరకు తలుపు చాటునున్న వ్యక్తి, "కూర్చోమ్మా, నీతో మాట్లాడాలి" అన్నాడు.

పల్లవి ఉలిక్కిపడింది, మరుక్షణంలో కంగారుపడింది. "ఎవరు మీరు?"

మరొక గదిలోనుండి మరొక వ్యక్తి వచ్చాడు. పల్లవి ముఖం భయంతో కంపిస్తుంది. "ఎవరు మీరు? నా భర్త ఎక్కడ?"

"నిన్ను మేమేదో చేయటానికి రాలేదు. నీ భర్త మధు లక్ష్మీపతిలా చంపబడలేదు. క్షేమంగా వున్నాడు."

పల్లవి గుండెల్లో రైళ్ళు పరుగెడుతున్నాయి.

"మరేం భయపడకు, నీతో మాట్లాడాలి."

బాబును సోఫాలో పడుకోబెట్టి కూర్చుంది. ముఖం నిండా చెమటలు పోశాయి.

"నీవల్ల ఒక సహాయం కావాలి. నీవు మామూలుగా అడిగినట్లయితే చెయ్యవు. అందుకే నీ భర్తను తీసుకు వెళ్ళిపోయాం."

"ఎక్కడికి?" కంగారుగా లేచింది.

"తొందరపడక. నీ భర్తకు యే ఆపదా రాదు. నీవు మాకీ సహాయం చేస్తే రెండు లక్షలతోపాటు అమెరికా పాస్‌పోర్టు యిచ్చి పంపగలం.

నే నెవరో నీకు తెలియకపోవచ్చు. నా పేరు చరణ్. నీవు మాత్రం చాలాకాలంగా నాకు తెలుసు. ఎలా? లక్ష్మీపతిని నీవు హత్య చేసింది మొదలు, అంతా తెలుసు. అయితే నిన్ను వెదకి పట్టుకోవటానికి మాకు యేడాది పట్టింది.

ఇంకా నీపై హత్యానేరం వుంది. సరే, ఆ విషయం వదిలేయ్. కొన్నాళ్ళుగా ఫణి అనే పేరుగల అమ్మాయి నీకు తెలుసా?"

"తెలీదు."

"అయితే, ఆ అద్దంముందు నిలబడి చూడు" అన్నాడు.

పల్లవి సంకోచంగా అద్దం ముందుకు నడిచింది. అందులో తన ప్రతిబింబమే కనిపించింది. పల్లవికి అర్థం కాలేదు.

"నీకు అర్థం కాలేదు. రెండు సంవత్సరాల క్రితం నీ మతి చెడిపోయింది. నీ అసలు పేరు ఫణి" చరణ్ అన్నాడు.

"నాకు మతిపోవటం ఏమిటి?"

"ఇప్పుడు మాకు కావలసింది ఆ ఫణి కాదు, అలాంటి నీవు. ఫణి అమెరికానుండి వస్తూ, కొన్ని లక్షల విలువ చేసే డైమండ్స్ తెచ్చింది. అవి సేఫ్ బాక్స్ నెంబరు 346 లో జాగ్రత్త చేసింది. అది టాప్ సీక్రెట్ సేఫ్ బాక్స్ కాబట్టి, ఉన్నతమైన ఒక బాంకి ఆధ్వర్యంలో వున్నాయి.

ఆ బ్యాంక్ లో నీ ఫొటో, అంటే ఫణి ఫొటో వుంటుంది. ఆ ఫొటో గల అమ్మాయి వచ్చినప్పుడే ఆ సేఫ్ బాక్స్ లాకర్ ఇస్తారు. ఏ మాత్రం అనుమానం తగిలినా వెంటనే అరెస్టు చేస్తారు.

ఎంతో ప్రయత్నంమీద బాంక్ కి సంబంధించిన ఫణి పాస్ బుక్ సంపాదించాం. ఆ బుక్ తో నీవు ఫణిగా వెళ్ళి ఆ వజ్రాలు తీసుకువచ్చి మాకు అప్పగించు. నీ భర్తతో పాటు కొన్ని వేల రూపాయలు నీ కివ్వబడతాయి. లేదా నీ భర్త శవంతోపాటు నీ శవం ట్రెయినేజిలో వేస్తాం. రేపే బొంబాయి ప్రయాణం రెడీగా వుండు.''

వివరించి మరోసారి చెప్పాడు చరణ్. పల్లవికి అంతా అర్థమైంది. తానేదో విషవలయంలో చిక్కుకున్నట్టు అర్థం చేసుకుంది పల్లవి,

## 16

హోటల్ గదిలో—

నిద్రనుండి కళ్ళు తెరచిన పల్లవి స్తంభించిపోయింది. ఎదురుగా మురారి. మురారి చేతిలో కత్తి, ఆ కత్తి బాబుకు దగ్గరగా వుంది. బాబు గుక్కపట్టి ఏడుస్తూన్నాడు.

''ఎవరు నీవు? ఏమిటి యిది?'' గబాలున లేచి బాబును అందుకోబోయింది.

''ఆగు.'' బాబు గుండెపై కత్తి పెట్టాడు మురారి. వికృతంగా నవ్వాడు.

''నా పేరు మురారి. చరణ్ లా నేను వజ్రాలకొరకు యిక్కడకు వచ్చాను. చరణ్ దగ్గర ఫణి పాస్ బుక్ వుంది. పాస్ బుక్ యిప్పుడు నీ చేతిలో వుంది.''

అయోమయంగా చూసింది పల్లవి.

''మరేం దిగులుపడక. భర్త పోతే రత్నగర్భయిన ఈ భారతదేశంలో భర్తలకు కొదువలేదు.''

పల్లవి మనసు చివుక్కుమంది.

"పోనీ నీకు బాధ కలిగిస్తే క్షమించు. నీవు ఫణివి కాదు, పల్లవివి అని నాకు తెలుసు"'

"ఎలా తెలుసు?"

"ఫణిని నేనే చంపాను కాబట్టి."

పల్లవికి శ్వాస ఆగిపోయినట్లయింది.

"నిన్ను మాత్రం చంపను. ఊరికే చంపేయటం నాకు అలవాటు కాదు కూడా. అందుకే చెపుతున్నాను, శ్రద్ధగా, బుద్ధిగా విను. ఆ వజ్రాలు నాకే చెందాలి" మురారి అన్నాడు.

పల్లవి నిశితంగా చూసింది.

"ఆ వజ్రాలు నాకు కాకుండా చరణ్‌కి యివ్వటం జరిగితే నీ బాబును..." అంటూ కత్తి బాబు గుండెపై పెట్టాడు.

"వద్దు...నా బాబును ఏం చేయవద్దు."

"సారీ! నేను ఏ పరిస్థితిలోనూ నీ బాబుకి కీడు చేయను. అలా చేయకూడదనుకుంటే రేపు తెచ్చే వజ్రాలు నా చేతికే యివ్వాలి. ఆలోచించుకో..."

బాబును తీసుకొని మురారి వెళ్ళిపోయాడు.

పల్లవి మిగిలిపోయింది,

ఒకవైపు భర్త, మరొకవైపు బిడ్డ, ఈ పరిస్థితిలో తనేం చెయ్యాలి? ఎవర్ని పోగొట్టుకోవాలి తను? వజ్రాలు కాజేసి ప్రభుత్వం దృష్టిలో నేరస్తురాలు అవ్వాలి. చాలా సామాన్యురాలైన తనకు ఏమిటి ఈ అగ్నిపరీక్ష?

మురారికి వజ్రాలు యిచ్చివేస్తే మధు చచ్చిపోతాడు. చరణ్‌కు యిస్తే బాబు చచ్చిపోతాడు. ఎవరు పోయినా తను బ్రతకలేదు. ఈ పరిస్థితిలో తనేం చెయ్యాలి? తననెవరు కాపాడలేరు.

కళ్ళలోనుండి ధారగా కన్నీరు స్రవిస్తుంది.
గుండెలవిసిపోయేలా దుఃఖించింది.

## 17

తెలతెలవారుతుంది.

ఎవరో గదిలోనికి వచ్చారు. కళ్ళు తెరిచింది. ఎదురుగా మురారి.

"చూడు పల్లవీ! నీకు మరొక పరీక్ష ఎదురైంది. వాళ్లు పాస్‌బుక్ యిచ్చారు. కాని తాళం యివ్వలేదు. అది వుంటే నీకు యిచ్చివుండేవాళ్ళు. ఎనీహవ్, నీవు ఆ తాళం పోగొట్టుకున్నానని చెప్పాలి."

పల్లవి ఆత్రంగా చూసింది.

"అవును. అప్పుడు నీ వేలిముద్రలు, క్రితంలో ఫణిగా వేసిన వేలిముద్రలు చూస్తారు. నీవే అని నమ్మకం కలిగితే ఆ తాళం పగలకొట్టించి నష్టపరిహారం నీపై వేస్తారు."

"వేలిముద్రలు ఒకటి కాకపోతే?"

మురారి సంకోచించాడు. "అందుకే నీ వేలిముద్రలు చెక్ చెయ్యాలి." అంటూ పల్లవి వేలిముద్రలు తీసుకున్నాడు. అతని ప్రక్కనే వున్న రంజిత్ వేలిముద్రలు అందించాడు. అవి ఫణి వేలిముద్రలు.

మురారి ముఖం రంగు మారింది. రంజిత్ అడిగాడు. "ఏమిటి బాస్?" మురారి, రంజిత్ ముఖంలోనికి చూశాడు.

"అదేమిటి బాస్! మీ చేతులతో చంపారు. శవాన్ని నేనే పాతిపెట్టాను."

"నమ్మలేకుండా వున్నాను."

"ఎందుకని బాస్?"

"మనిషిని పోలిన మనిషి వుండటంలో ఆశ్చర్యంలేదు. కాని వేలిముద్రలు పోలిన వేలిముద్రలు వుండటం ఇంపాసిబుల్. నాకు అయోమయంగా వుంది."

"అది ఒకందుకు మంచిదేగా బాస్!"

"మంచిది కాదని కాదు. చాలా మెరికల్ గా వుంది యీ ప్రశ్న. ఎనీహవ్ బాబును జాగ్రత్తగా వుంచు. పల్లవిని ఒక్కర్తినే టాక్సీలో పంపాలి."

"ఆ తరువాత."

"పల్లవి బాంక్ నుండి బయటకు రావటంతోనే వజ్రాలు మన చేతికి చిక్కించుకోవాలి. మనలా చరణ్ కూడా ప్రయత్నిస్తాడు. ఆ పథకం నేను చూస్తాను."

# 18

పల్లవి ఎక్కిన టాక్సీ మురారి ఇంటినుండి మలుపుతిరిగి హైరోడ్ మీద పోతుంది. పల్లవి చేతిరుమాలుతో ముఖంపై చెమటను అద్దుకుంది. రోడ్డుకు రెండువైపుల డాబాలు, షాపింగ్ లు చూస్తూంది.

వెనుకగా పోలీస్ జీపు.

తడబడి రెండుసార్లు చూసింది. పోలీస్ జీపు తనను వెంబడిస్తోంది. గుండెల్లో రైళ్ళు పరుగెడుతున్నాయి. తనను పోలీసులు ఎలా గమనించివుంటారు అనుకుంది.

పోలీస్ జీపు మెల్లగా సమీపించి ముందుకు సాగిపోయింది. బరువుగా నిట్టూర్చింది.

"అలా భయపడితే వజ్రాలు ఎలా తెస్తావ్ పల్లవీ!" టాక్సీ డ్రైవర్ అనటంతో ఉలిక్కిపడింది.

"ఎవరు నీవు?"

టాక్సీ ఒక ప్రక్కగా ఆపాడు. "ధీరజ్! ఐ మీన్

ఫణి భర్తను. నీవు మరచివుంటావు. చూడు ఫణీ! నీవు పల్లవిగా ఎంత నటించినా నాకు తెలుసు. ఇదిగో సేఫ్ బాక్స్ తాళం." అందించాడు.

"నీవు నాకు యిచ్చావ్. మరచిపోయివుంటావ్!"

పల్లవి అయోమయంగా చూసింది.

"ఇక పోతే అసలు విషయం. ఈ టాక్సీ బాంక్ బయట వుంచుతాను. నీవు వజ్రాలు తీసుకొని తిన్నగా నా దగ్గరకు రావాలి. నా టాక్సీలో ఎక్కాలి. లేదా నీ గురించి పోలీస్‌కి ఇన్ఫర్మేషన్ ఇస్తాను."

మతిపోయినట్లయింది పల్లవికి.

"మరి నా భర్త, నా బిడ్డ?"

"నాలాగా భర్త పోతే భర్త, బిడ్డ పోతే బిడ్డ దొరక వచ్చు. కాని నీవు జైలుపాలైతే యింకేముంది?"

పల్లవికి అతని మాటలు అసహ్యం కలిగించాయి. కోపంతో ముఖం ఎర్రనైంది. కాని ఏం చేయలేదు.

"అలాగే!" అంది పల్లవి.

ఈ పరిస్థితిలో తను ఆత్మహత్య చేసుకుంటే తన బాబు ఫలానాచోట వున్నాడని భర్తకు ఎలా తెలుస్తుంది? ఆలోచిస్తూవుండగానే టాక్సీ బాంక్ ముందాగింది.

## 10

బాంక్ లోపలకు వెళ్ళుతూ చూసింది పల్లవి.

ఒక ప్రక్క చెట్టుక్రింద మురారి కారు ఆగివుంది. రోడ్డు మలుపులో చరణ్ కారు ఆగివుంది. కొద్ది దూరంలో ధీరజ్ టాక్సీ ఆగివుంది. గుండెల్లో వణుకుపుట్టింది.

పల్లవి బాంక్ లోపలకు నడిచింది.

కౌంటర్ లోపలకు వెళ్ళి విత్‌డ్రాయల్ అన్న చిన్న బోర్డు దగ్గర ఆగి పాస్‌బుక్ యిచ్చింది. తలెత్తి చూశాడు.

"మిస్ ఫణీ! దాదాపు మూడేళ్ళయింది. మీ నెంబరు బాక్స్ అలాగే వుంచాం. ఇంకో ఏడాది దాటితే అది పగలగొట్టటం జరిగేది."

పల్లవి ఏం మాట్లాడలేదు. అతను సంతకం పెట్టి మరో కౌంటర్‌లోనికి పంపాడు. అక్కడకు నడిచింది.

"మీరు యింతకాలం ఎందువల్ల మీ మెటీరియల్ రిసీవ్ చేసుకోలేదు."

"ఫారిన్‌లో వున్నాను."

"ఐ.సి. ఏజెంట్ దగ్గరకు వెళ్ళండి" అంటూ సైన్ చేసి యిచ్చాడు. గొంతు తడారిపోయింది పల్లవికి. మెల్లగా ఏజెంట్ రూంలోనికి నడిచింది.

ఏజెంట్ గుంభనంగా, గంభీరంగా వున్నాడు. పాస్ బుక్ అందించింది. నిశితంగా చూశాడు. తను తొట్రుపడింది.

"మే ఐ సీ యువర్ ఫింగర్ ప్రింట్."

"వై నాట్" భయాన్ని కప్పి పుచ్చుకుంటూ అంది.

ఏజెంట్ బజర్ నొక్కాడు. వేలిముద్రలు తీసుకోటానికి వచ్చిన వ్యక్తి వేలిముద్రలు తీసుకొని వెళ్ళిపోయాడు.

"జెస్ట్ త్రీ మినిట్స్."

ముళ్ళపై కూర్చున్నట్లుంది పల్లవికి. ముఖంపై చెమట బిందువులు చేతిరుమాలుతో తుడుచుకుంది. ఏజెంట్ గమనిస్తూనే వున్నాడు. పల్లవికి అసహనంగా, ఆందోళనగా వుంది.

వేలిముద్రలతో అతను వచ్చాడు. "సర్."

తలెత్తి చూశాడు ఏజెంట్. "ఫణి వేలిముద్రలు, ఈమె వేలిముద్రలు ఒక్కటి కావు. వేరు వేరు వేలు ముద్రలు. ఈమె ఫణి కాదు."

గభాలున లేచింది పల్లవి.

"కూర్చోమ్మా" అన్నాడు లోపలకు వస్తూ లక్ష్మీపతి.

లక్ష్మీపతిని చూసి మతిపోయినట్లయింది.

"కూర్చో పల్లవీ" లక్ష్మీపతి అన్నాడు.

పల్లవి ఉపేక్షించకుండా ఏజెంట్ బల్లపై వున్న కత్తి తీసుకొని గభాలున పొడుచుకోబోయింది. లక్ష్మీపతి చటుక్కున చేయి పట్టుకున్నాడు.

"వదలండి, నేను చావాలి."

లక్ష్మీపతి నవ్వాడు. "నీవు చావకూడదు. నీవు ఏ పరిస్థితిలో చావాలనుకున్నావో నాకు తెలుసు."

పల్లవి ప్రశ్నార్థకంగా చూసింది.

"చూడమ్మా, నీవేమీ భయపడవద్దు. నిన్ను, నీ భర్తను, నీ బిడ్డను రక్షించటానికే లక్ష్మీపతి వచ్చారు. నిన్ను అరెస్టు చెయ్యం" అన్నాడు లక్ష్మీపతి వెంటనున్న మరో వ్యక్తి.

పల్లవికి అర్థం కాలేదు.

"లక్ష్మీపతి ఎవరో కాదు. ప్రఖ్యాత డిటెక్టివ్ పి.జె."

విస్తుపోయింది పల్లవి.

"అవునమ్మా. నీ భర్తను, నీ బిడ్డను రక్షిస్తాను. నిన్ను వెంటాడుతున్నవి మూడు గాంగులు. వాళ్ళను బయట పోలీసులు బంధించారు. విషయాలు తరువాత వివరిస్తాను. పద," అన్నాడు పి. జె.

పల్లవి కళ్ళలో నీరు నిండాయి.

## 20

మధు, పల్లవి, డిటెక్టివ్ పి. జె., ఇతర క్రైం బ్రాంచి ఆఫీసర్లు, కమీషనర్ ఆఫ్ పోలీస్ అందరూ కూర్చొని వున్నారు.

"నేను లక్ష్మీపతి నటన ప్రారంభించటానికి పల్లవి కారణం కాదు. అయితే మరొక కేసుగురించి దర్యాప్తు చేస్తుండగా పల్లవి కనిపించింది. పోలీస్ రికార్డులో ఫణిగా వున్న ఆమె ఫోటో చూసి అనుమానించాను.

అదృష్టవశాత్తు లిలియా నన్ను ఆశ్రయించింది. లిలియాను ఆ క్షణంలో బంధించవచ్చు. అయితే లిలియా వెనకవున్న గాంగ్ ని పట్టుకోవాలని తలాడించాను. లిలియాకు విధేయుడనయ్యాను. పల్లవి వచ్చినపుడు ముందే పల్లవికి పథకం గురించి చెపితే లాభంలేదని అలా నటించాను.

నేను ఊరిలో లేనప్పుడు మరొకరికి నాలాగా మేకప్ వేయించి, అతడిని పల్లవి చంపినట్లుగా నాటకమాడారు. అయితే పల్లవి భయపడి ఆగ్రా పారిపోయింది. దాంతో దుండగులకు ఆమెను వెదికి పట్టుకోవటానికి ఏడాది పట్టింది.

"పల్లవి నన్ను చంపలేదు. కాబట్టి ఆమె జీవితాన్ని కాపాడగలిగాను" పి. జె. ఆగాడు.

"మరి నా వేలిముద్రలు, ఫణి వేలిముద్రలు ఒకటే అన్నారు. అదెలా జరిగింది."

"అది క్రితంలో ఫణి నిన్ను చూసివుండాలి. నీకు తెలియకుండా నీ వేలిముద్రలు తీసి తనపై ఏదో నేరం వచ్చే పరిస్థితిలో నీ వేలిముద్రలు వినియోగించుకొని వుండాలి. అంటే నీ వేలిముద్రలు సింగర్ ప్రింట్ చేయించేసింది. నీకు ఫణి తెలియకపోయినా, ఫణికిమాత్రం నీవు తెలుసు. ఇది నా ఊహమాత్రమే" పి. జె. అన్నాడు.

"ఏమైనా మా జీవితాలు కాపాడారు" అంది పల్లవి కృతజ్ఞతాపూర్వకంగా.

—: ఐపోయింది :—

# కనిపించే శవాలు!

టెంపోరావ్

హోరున వర్షం కురుస్తోంది. ఒంటరిగా ఆమె మేడమీది గదిలో కూర్చుంది. ఫ్లోరసెంట్ లైట్ వెలుగుతోంది. కిటికీలోంచి ఆమె బయటకు చూస్తోంది. రోడ్డుమ్మట ఎవరో వెళ్తున్నారు.

మెరుపు ఆకాశంలో తళుక్కుమంది. భయంకరంగా ఉరిమింది! ఆమె కిటికీ దగ్గరనుంచి వెనక్కి పోదామనుకుంది కాని, అదే క్షణంలో ఎదుటింటి కింది గదిలోని లైటు వెల్గింది. ఆమె ఆ గదివైపు చూస్తూ కూర్చుంది.

కిటికీ తలుపులు తెరిచివున్నాయి. ఒకతను యెవర్నో మోసుకొచ్చి కుర్చీలో పడేశాడు. అతను వేగంగా వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు.

ఆమె కుర్చీవైపు తీక్షణంగా చూసింది. కుర్చీలో కూర్చున్న మనిషిని చూసి ఉలిక్కిపడింది!

లైటు కాంతిలో అతను స్పష్టంగా కనిపిస్తున్నాడు. అతని బట్టలనిండా రక్తం! అతని తల కాలివైపుకు వాలి వుంది! అతని అవయవాలు కదలడంలేదు. అతను మరణించి వుండాలి!

ఆమె ఎదుటి గదివైపే చూస్తోంది! అతడిని మోసుకొచ్చి నతను గదిలోకొచ్చాడు. అతను నలువైపూ చూశాడు. తెరిచివున్న కిటికీవైపు చూశాడతను. గబగబా కిటికీ ముందుకొచ్చాడు.

కిటికీలోంచి క్షణకాలం ఆమెకేసి చూశాడతను.

అతడిని చూసి ఆమె ఉలిక్కిపడింది. అతను చటుక్కున కిటికీ తలుపులు మూసేశాడు. ఆమెకు అటుపైన ఏమీ కనిపించలేదు!

అతను తనని చూశాడు. తనకోసం వస్తాడేమో! ఆమె కిందకు పరుగెత్తింది. వీధి తలుపు గడియ పెట్టివుందని ఆమె నిర్ధారణ చేసుకుని పైకి వెళ్ళింది.

కిటికీలోంచి మళ్ళా బయటకు చూసింది.

ఆకాశాన్ని మెరుపు చీల్చింది! ఒళ్ళు జలదరించేటట్లు ఉరిమింది. ఎక్కడో పిడుగు పడుండాలి!

చటుక్కున లైట్లు ఆరిపోయాయి. గదిలో చీకటి. నలువైపులా అంధకారం! మళ్ళా యెలక్ట్రిసిటీ యెప్పుడొస్తుందో?

కిటికీ ముందు చీకట్లో ఆమె అలాగే కూర్చుంది. వర్షం జోరుగా కురుస్తూనే వుంది. తన భర్త యింకా రాలేదు!

తన రేడియమ్ డైల్ వాచ్ ని చూసిందామె. టైము

పది దాటింది. ఆమె భర్త సివిల్ యింజనీర్. పొద్దుటే వర్క్ స్పాట్‌కి పోతాడతను. రాత్రి పది తర్వాత యింటికొస్తాడు! అంతవరకూ ఆమె ఒంటరిగా వుండవలసిందే!

ఆమెకు పెళ్ళయి మూడేళ్ళయింది. భర్త గోపీనాథ్ రెండునెలల క్రితం యీ మేడను కొన్నాడు. అంతకు ముందు వాళ్ళు ఒక అద్దె ఇంట్లో వుండేవాళ్ళు.

కారు హారన్ వినపడింది. హారన్ని ఆమె వెంటనే గుర్తుపట్టింది. భర్త వస్తున్నాడు. టార్చి కాంతిలో చూసుకుంటూ ఆమె కిందకు వెళ్ళింది. తలుపు దగ్గర నిలబడింది. తలుపు తీసే ధైర్యం లేదామెకు!

ఎవరో తలుపును తట్టారు. "రాధా, నేను!" అన్నాడు భర్త.

ఆమె తలుపు తెరిచింది. తటాలున అతను లోపలికొచ్చాడు. టార్చిలైటు పట్టుకొన్న ఆమెకేసి చూశాడు

"లైట్లు పోయి ఎంతసేపయింది?"

"అరగంట దాటింది," అందామె.

అతను లైట్ స్విచ్ నొక్కాడు. కాస్సేపట్లో లైట్ వెలిగింది.

గోపీనాథ్ ఆమెకేసి నవ్వుతూ చూశాడు. ఆమె సంతోషంగా లేదు. మొహంలో భయం గోచరిస్తోంది.

దగ్గరగా వెళ్ళి అతనామెను చేతుల్తో చుట్టేశాడు. "రాధా, ఏమిటలా వున్నావు?" అడిగాడతను.

"ఒంటరిగా నేనింత పెద్దింట్లో వుండలేను!" అందామె.

"మనకు పిల్లలు పుడితే యీ యిల్లు అంత పెద్దదిగా కనిపించదు!" అన్నాడతను.

ఆమె మాట్లాడలేదు. ముందు తలుపును లోపలనుంచి మూసింది. ఇద్దరూ మేడమీదున్న పడగ్గదిలోకి వెళ్ళారు.

ఆమె కిటికీలోంచి ఎదుటింటివైపు చూస్తూ వుండి పోయింది!

గోపీనాథ్ సూట్ తీసేశాడు. లుంగీ కట్టుకున్నాడు. సూట్‌ను బీరువాలో దాచేశాడు. ఆమెదగ్గరకు వెళ్ళాడు.

"రాధా, ఏమిటలా చూస్తున్నావు?" అడిగాడతను.

ఆమె త్రుళ్ళిపడింది. అతనామెను గట్టిగా పట్టుకున్నాడు. వర్షం ఆగింది. చినుకులు పడుతున్నాయి.

అతనామెను తీసుకెళ్ళి సోఫాలో కూర్చోబెట్టి, పక్కనే కూర్చున్నాడు.

ఆమెకేసి నవ్వుతూ చూశాడు.

"రాధా!" అన్నాడతను.

ఆమె భర్తవైపు సూటిగా చూసింది.

"ఎదుటింట్లో హత్య జరిగింది!" అందామె.

"నీకెలా తెలుసు?"

"నేను శవాన్ని చూశాను. అతని దుస్తుల నిండా రక్తం. అతని మెడ కుడివైపుకు వాలిపోయింది. అతనిలో జీవం లేదు. హంతకుడు నన్ను చూసి కిటికీతలుపులు మూసేశాడు," అందామె.

ఆమె చెప్పింది విని అతను ఆశ్చర్యపోయాడు.

"హంతకు డెవరు?" అడిగాడతను.

"ఎదుటింట్లో ఎవరుంటున్నారు?"

"కర్నల్ కామత్."

"అతనే హంతకుడు!" అందామె.

"రాధా, కామత్ చాలా మంచివాడని విన్నాను.

అతను ఆర్మీలో ఆఫీసర్. పిల్లా జల్లా లేరు. భార్య అతడిని వదిలేసింది. పూర్ మేన్, ఒంటరిగా జీవిస్తున్నాడు!" అన్నాడతను.

ఆమె మాట్లాడలేదు. భర్త వైపు సీరియస్‌గా చూసింది. "కామత్ ఎలా వుంటాడు?" అందామె.

"పొడుగ్గా, లావుగా వుంటాడు. కళ్ళజోడుంటుంది. ఎప్పుడూ టిప్‌టాప్‌గా సూట్‌లో వుంటాడు. అతడిని దూరంనుంచి చూశాను. అతనితో నాకు పరిచయంలేదు," అన్నాడతను.

"అతనే శవాన్ని మోసుకొచ్చి కుర్చీలో పడేశాడు. అతనే నావైపు చూసి కిటికీ తలుపులను మూసేశాడు," అందామె.

గోపీనాథ్ ఆశ్చర్యంతో విన్నాడు. సిగరెట్ వెలిగించి పొగ వదుల్తూ ఆమెకేసి చూశాడు. ఆమె పెదిమలు వణుకుతున్నాయి.

"అతను నన్ను చంపుతాడు!" అందామె.

"నాన్‌సెన్స్!" అన్నాడతను.

"హంతకుడు సాక్షుల్ని బతకనివ్వడు. నేనంతా చూశాను. నేను బతికుంటే అతనికి ప్రమాదం. అందువలన నన్ను చంపడానికి తప్పక ప్రయత్నిస్తాడు," అందామె.

"రాధా, నువ్వు భయపడకు. నీకేమీ అవదు!"

"మీరు పొద్దుట వెళ్ళి రాత్రి పది దాటిందాకా రారు! నేనీ మేడలో ఒంటరిగా వుంటాను. ఒంటరి స్త్రీని అతను సులువుగా చంపగలడు!"

గోపీనాథ్ ఆమెను కౌగలించుకున్నాడు. ఆమె పెదిమలను ముద్దెట్టుకున్నాడు.

"రాధా, నేను ఆఫీసుకు సెలవు పెట్టలేను. నేను సెలవుపెడ్తే అక్కడ పని సాగదు. డిటెక్టివ్ పరశురామ్ గారికి ఫోన్ చేసి మాట్లాడతాను. ఆయన నీకు ప్రమాదం లేకుండా చూస్తారు," అన్నాడతను.

## 2

టెలిఫోన్ మ్రోగింది. రిసీవరెత్తాను. "హలో, పరశురామ్!" అన్నాను.

"పరశురామ్‌గారూ, నేను గోపీనాథ్‌ని," అన్నాడతను.

"హలో మిస్టర్ గోపీనాథ్, ఏమిటి సంగతి?"

"మా యెదుటింట్లో ఏదో హత్య జరిగిందట. నా భార్య రాధ శవాన్ని చూసింది. హంతకుడు తనని చంపుతాడని ఆమె భయపడ్తోంది! హంతకుడు ఆమెను చూశాడట!" అన్నాడు గోపీనాథ్.

"మిస్టర్ గోపీనాథ్, నేనక్కడకు వచ్చి మాట్లాడతాను" అని రిసీవర్ని పెట్టేశాను.

టైమ్ చూశాను. పదిన్నర అయింది.

పక్కన కూర్చున్న పార్వతి నావైపు నవ్వుతూ చూసింది. "వడ్డించనా?" అందామె.

"అర్జంటు పనుంది. తిరిగొచ్చాక భోజనం చేస్తాను," అని బయటకు పరుగెత్తాను.

డాడ్జి కారును స్పీడుగా పోనిస్తున్నాను. చినుకులు పడ్తున్నాయి. నార్త్ యీస్ట్ మాన్‌సూన్ ప్రారంభమైంది. వర్షం కురుస్తూనే వుంటుంది!

ఆలివర్ స్ట్రీట్ వైపు కారును తిప్పాను. గోపీనాథ్ గృహప్రవేశానికి వెళ్ళాను. అతని మేడను పోల్చగల్గాను.

కారును లోపలకు పోనిచ్చి ఆపి, దిగాను.

గోపీనాథ్ నవ్వుతూ నన్ను ఆహ్వానించాడు. అతనితో హాల్లోకి వెళ్ళాను. సోఫాలో కూర్చున్నాను. నా యెదురుగా రాధ కూర్చునివుంది. ఆమె కేసి నవ్వుతూ చూశాను.

"ఏమైందో చెప్పండి!" అన్నాను.

గోపీనాథ్ ఆమెపక్కనే కూర్చున్నాడు. భయపడ్తూ ఆమె నాకంతా చెప్పింది.

"మీరు చెప్పింది నిజమైతే ఆ యింట్లో శవం వుండాలి!" అన్నాను.

"ఎడంవైపున్న కింద గదిలో వుంది. నేనా గదివైపు చూస్తూనే వున్నాను. శవాన్ని బయటకు తీసుకెళ్ళలేదు," అందామె.

"పరశురాంగారూ, రోజల్లా నేను ఇంట్లో వుండను. తనకు ప్రమాదం వస్తుందని నా భార్య భయపడ్తోంది. ఆమెకు ఏ ఆపదా రాకుండా చూడ్డానికి మీరెవరినేనా నియమించాలి," అన్నాడు గోపీనాథ్.

అతని వైపు చూశాను.

"ఆమె భయపడనక్కరలేదు. నానమ్మినబంటు కబీర్ని యింటి ముందు కాపలాగా ఉండమంటాను," అన్నాను.

"థాంక్స్, సార్. పరశురామ్‌గారు ఎదుటింట్లో వుండే కర్నల్ కామత్ తిక్క మనిషి. నా భార్య ఏదో శవాన్ని చూసినట్లు మీరతనితో చెపితే ప్రమాదం. అది నిజం కాకపోతే అతను మమ్మల్ని పీడిస్తాడు," అన్నాడు గోపీనాథ్.

నవ్వుతూ సోఫాలోంచి లేచాను.

"అతనితో నేను మాట్లాడుతాను. మీ పేర్లు నాసంభాషణలో రావు!" అన్నాను.

"మిస్టర్ పరశురామ్, స్కాచ్ విస్కీ తీసుకుందాం. కాస్సేపు కూర్చోండి," అన్నాడతను.

కుర్చీలో చతికిల బడ్డాను. గోపీనాథ్ చాలా కాలంగా నాకు తెలుసు! అతను పేరు గాంచిన సివిల్ యింజనీర్! రాధ లోపలకు వెళ్ళి తిరిగొచ్చింది. టీపాయి మీద స్కాచ్ విస్కీ బాటిల్నూ, రెండు గ్లాసులనూ పెట్టింది. రిఫ్రిజిరేటర్‌లోంచి చల్లటి సోడాలను అతను తెచ్చాడు.

రాధ మౌనంగా కూర్చుంది. రెండు గ్లాసుల్లో అతను విస్కీ పోసి, సోడా కలిపాడు. ఇద్దరం గ్లాసులను అందుకున్నాం. విస్కీ తాగి అతని వైపు చూశాను.

"ఫైన్ విస్కీ!" అన్నాను.

"ఇది మా దుబాయ్ బ్రాంచి నుంచి వచ్చింది," అన్నాడతను.

గోపీనాథ్ పెద్ద కంపెనీలో పని చేస్తున్నాడు. అతని కంపెనీ పెర్షియన్ గల్ఫ ప్రాంతంలో ఎన్నో కాంట్రాక్టులను నిర్వహిస్తోంది.

గ్లాసు ఖాళీ అయింది. అతను మళ్లా పోయబోయాడు. వద్దని సోఫాలోంచి లేచాను. అతను నాతో కారుదాకా వచ్చాడు. జేబులోంచి నోట్లకట్టతీసి నా కిచ్చాడు. "పరశురామ్‌గారూ, పదివేలు! నా భార్యకు ఏ అపదా రాకుండా చూడండి," అన్నాడతను.

"మీరు ఆమెకు ధైర్యాన్నివ్వండి. ఆమెకు ప్రమాదం రాదు. ఈ రాత్రే కబీర్ని ఇక్కడకు పంపుతాను," అని కారులో కూర్చుని తలుపులు మూశాను. అతనికి గుడ్ నైట్ చెప్పి కారును పోనిచ్చాను.

కారు గేటు దాటింది. ఎదురుగా వున్న యింటి ముందు

కారును ఆపి దిగాను. మెయిన్ గేటు మూసి వుంది. గేటుకి లోపల వైపు తాళం వేసివుంది.

గేటు ఎక్కి అటువైపుకు దూకాను. వరండా మీదకు వెళ్ళి ముందు తలుపుమీద తట్టాను.

చుట్టూ చీకటిగా వుంది. కొంతసేపయ్యాక తలుపు తెరవబడింది. హాల్లో లైట్ వెల్గుతోంది. వరండా లైటు కూడా వెల్గింది.

"హలో, ఎవరు మీరు?" అన్నాడతను.

కర్నల్ కామత్! అతని వైపు చూటిగా చూశాను. అతని వయస్సు అరవై ఏళ్ళుండొచ్చు! మనిషి వృద్ధుడిలా కనపడ్డంలేదు. అతను పాంటు, స్లాక్‌లో వున్నాడు. కాళ్ళకు బూట్లు వున్నాయి. పొడుగైన మనిషి. కళ్ళకు గ్లాసెస్ వున్నాయి.

నా పేరు చెప్పాను. అతను వులిక్కి పడ్డాడు.

"రండి, మిస్టర్ పరశురామ్," అన్నాడతను.

గదిలోకి వెళ్ళాను. విశాలమైన హాలు. గదిలో రెండు ఫ్లోరసెంట్ లైట్లు వెల్గుతున్నాయి. ఖరీదైన సోఫా లున్నాయి. అతను నన్ను కూర్చోమన్నాడు. శవం వున్న గది హాలుకు ఎడం వైపున వుండాలి.

సోఫాలో కూర్చుని సిగరెట్ వెలిగించాను. అతనికి సిగరెట్ యిస్తే తీసుకోలేదు. అతనివైపు పరీక్షగా చూశాను. కామత్‌ది బట్టతల. అతని కళ్ళు తాగుడులో ఎర్రబడినాయి.

"మీరు యీ యింట్లో ఒంటరిగా వున్నారా?" అడిగాడు.

"యస్," అన్నాడు క్లుప్తంగా.

"ఈ యిల్లు మీదేనా?"

"రిటైరైనాక కొన్నాను," అన్నాడతను.

"ఫైన్ హౌస్," అన్నాను, నలువైపులా చూస్తూ.

"మిస్టర్ పరశురామ్, ఇల్లు చూడండి," అని అతను లేచాడు.

అతనితో కూడా వెళ్లాను. కింద గదులన్నీ చూసి మెట్లెక్కి పైకి వెళ్ళాం. మేడ మీదున్న గదులన్నీ చూశాను. రాధ చూసిన శవం ఎక్కడా లేదు. మంచాల కిందకు వంగి చూశాను. రాధ భ్రమపడిందేమో!

ఇద్దరం కింద హాల్లోకి తిరిగొచ్చాం. కర్నల్ కామత్ తన బ్రాండ్ బ్రిస్టల్ సిగరెట్ వెలిగించాడు. అతను నావైపు సూటిగా చూశాడు.

"ఇంత రాత్రివేళ ప్రత్యేకమైన పని ఏదో వుంటేగాని మీరు రారు! ఏం పనిమీదొచ్చారో చెప్పండి," అన్నాడతను.

తీయగా నవ్వాను.

"కర్నల్, మీరు ఏదేనా ఉద్యోగంలో చేర్తారా?"

"ఏదేనా వుందా?"

"మీరు ఒప్పుకుంటే వుంటుంది!"

అతను భుజాలు ఎగరేశాడు. నావైపు కళ్ళు చిట్లించి చూశాడు.

"మిస్టర్ పరశురామ్, నాకెవ్వరూ లేరు. నా దగ్గర చాలా డబ్బుంది. ఇంకా గడించడం వృథా ఏమో!"

"అది మీరు నిర్ణయించుకోవాలి!" అన్నాను.

"జాబ్ ఏమిటో చెప్పండి."

"నా ఫ్రెండు ఫ్యాక్టరీ నడుపుతున్నాడు. అతనికి

సెక్యూరిటీ చీఫ్ కావాలి! రాత్రిళ్ళు మీరా ఫ్యాక్టరీలో వుండాలి!" అన్నాను.

"నో ప్లీజ్! రాత్రిళ్ళు నిద్రలేకుండా నేనుండదల్చుకో లేదు. పగలు పనైతే చేస్తాను," అన్నాడతను.

"నైట్ డ్యూటీ అన్నాడతను. ఫ్రెండ్ తో చెప్తాను," అని సోఫాలోంచి లేచాను.

చటుక్కున చెయ్యి చాచాను. అతనితో కరచాలనం చేశాను. అతని చెయ్యి చెమటతో తడిగావుంది!

కర్నల్ కామత్ ఎందుకో భయపడ్తున్నాడు! అతడి తడి చేతులు, మొహం నాలో అనుమానాన్ని పుట్టించాయి.

"వెళ్తున్నా, గుడ్ నైట్," అన్నాను.

"మీరు గేటుదాకి వచ్చినట్లున్నారు. అదే విధంగా వెళ్ళగలరనుకుంటాను" అన్నాడతను.

"ష్యూర్," అంటూ బయటకు కదిలాను.

అతను ముందు వరండా మీద కొచ్చి నిలబడ్డాడు. గేటెక్కి రోడ్డువైపు దూకాను. క్షణకాలం వెనుదిరిగి అతనివైపు చూశాను. అతను రాతి విగ్రహంలా నిల బడ్డాడు. కారులో కూర్చుని తలుపు మూశాను.

గోపీనాథ్ మేడవైపు చూశాను. పైన లైట్లు వెల్గు తున్నాయి. కిటికీల దగ్గర ఎవ్వరూ లేరు. కారును ముందుకు పోనిచ్చాను.

# 3

పార్వతి నాకోసం ఎదురు చూస్తూ కూర్చుంది. ఆమెను కౌగలించుకొని, పెదిమలను ముద్దెట్టుకున్నాను. "స్వీట్ గర్ల్, పద భోజనం చేద్దాం!" అన్నాను.

ఆమె కిందకు వెళ్ళింది, రిసీవరెత్తి కబీర్ నంబరు తిప్పాను.

"హలో కబీర్ స్పీకింగ్!" అన్నాడతను.

"పరశురామ్ హియర్," అన్నాను.

"చెప్పండి సార్."

"కబీర్, ఆలివర్ రోడ్డు, నెంబర్ 11 ఇల్లు. ఆయింట్లో ఇంజనీర్ గోపీనాథ్, అతని భార్య రాధ వుంటున్నారు. అతను పొద్దుటే పనికి పోయి రాత్రి ఆలస్యంగా యింటికొస్తాడు. రాధ ఒంటరిగా ఇంట్లో వుంటుంది. ఆమె ఇంటి ప్రాంతంలో నువ్వు కాపలా వుండాలి. ఆమెకు ఏ ప్రమాదం రాకుండా చూడాలి," అన్నాను.

"ఆమెకు ప్రమాదం ఎవరి నుంచి రావచ్చు సార్?" అడిగాడు కబీర్.

"ఇంటి కెదురుగా కర్నల్ కామత్ వుంటున్నాడు. వాచ్ హిమ్!" అన్నాను.

"అలాగే సార్! అతడిని వెంటాడమంటారా?"

"వద్దు! నీకు ముఖ్యమైనది రాధ! ఆ ప్రాంతంలో వుండి అతడిని గురించి వీలైనది తెల్సుకోవాలి. ఎప్పుడూ ఆమెను వదిలి పోవద్దు," అన్నాను.

"అలాగే సార్."

"ఏదేనా జరిగితే నాకు ఫోన్ చేయి!"

"యస్సార్," అన్నాడు కబీర్.

అతనికి గుడ్ లక్ చెప్పి రిసీవర్ని పెట్టేశాను.

డైనింగ్ హాల్లోకి వెళ్ళాను. ఏర్ కండిషండ్ డైనింగ్ హాలు. పార్వతి ఎదురుగా కూర్చున్నాను. ఫ్లోరసెంట్ లైట్లు వెల్గుతున్నాయి. పార్వతి వైపు నవ్వుతూ చూశాను.

"మీ ఫావరిట్ కూర! ధనియాల మసాలా బంగళా దుంపల కూర!" అందామె.

"భోజనం అనడానికి బదులు ఈ కూర పేరు మొదట చెప్పుంటే తొందరగా వచ్చేవాడిని," అన్నాను.

"కందిపప్పు పచ్చడండి. పప్పుపులుసు!" అందామె.

"రియల్ ఫీస్ట్!" అన్నాను, తినడం ప్రారంభిస్తూ.

కృష్ణయ్య లోపల కొచ్చాడు. మరి కొంతకూర నా కంచంలో వేశాడు. కూరని మెచ్చుకుంటూ కృష్ణయ్య వైపు నవ్వుతూ చూశాను. కృష్ణయ్య గ్రేట్ కుక్!!

## 4

మర్నాడు పొద్దుట గోపీనాథ్ ఇంటికి కారున్న పోని చ్చాను. కబీర్ ఇంటి ప్రాంతంలో నాకు కనిపించాడు. అతనిని చూచి నవ్వాను.

గేటు మూసివుంది. డ్రాడ్జి కారును ఆపి, దిగి లోపలకు వెళ్ళాను. వరండా మీదకు వెళ్ళి ముందు తలుపును తట్టాను. గోపీనాథ్ కారు లేదు.

తలుపు తెరిచి ఆమె నాకేసి చూచింది.

"ఆయన యివాళ ప్రొద్దుటే వెళ్ళిపోయారు!" అందామె.

ముందు గదిలోకి వెళ్ళి ఆమెను కూర్చోమన్నాను. "మీతో మాట్లాడాలి!" అన్నాను.

ఆమె సోఫాలో కూర్చుంది. రాత్రి ఆమె నిద్రపోలే దని కళ్ళు చూస్తే తెలుస్తోంది!

"నిన్న రాత్రి అతనింటికి వెళ్ళాను. కర్నల్ కామత్‌తో మాట్లాడాను. శవం వుందని మీరన్న గదీ, తతిమ్మా గదులు చూశాను. ఎక్కడా శవం లేదు!" అన్నాను.

"ఎక్కడో దాచేసి వుంటాడు!" అందామె.

"మంచాల కింద కూడా చూశాను!"

"పరశురామ్‌గారూ! అది పెద్ద ఇల్లు. దాచడానికి అనేక రహస్య స్థలాలుంటాయి."

"శవాల నెవరూ యింట్లో దాచుకోరు. కుళ్ళు వాసన నలువైపులా కొస్తుంది! ఎక్కడో వాటిని పాతేస్తారు!"

"పాతేశాడేమో!"

"నే వెళ్ళేముందు అతనంత పని చేసుండలేదు! రాత్రి పన్నెండు తర్వాత అతను చేసుండొచ్చు! మీరు ఏదేనా చూశారా?" అడిగాను.

"రాత్రంతా అతనింటి వైపు చూస్తూనే జాగారం చేశాను. కాని అతను బయటికి రాలేదు. ఇంటి వెనుక వైపు అతనేదేనా చేస్తే నాకు కనిపించదు!" అందామె.

ఇండియాకింగ్స్ సిగరెట్ వెలిగించాను. పొగ వదుల్తూ ఆమెకేసి చూశాను.

"మీరు కాపలా వుంచిన కబీర్ ఇంటి ముందు పచార్లు చేస్తూనే వున్నారు," అందామె.

"అతడిని చూశాక మీకు ధైర్యంగా వుందా?"

ఆమె తలాడించింది.

"పరశురామ్‌గారూ! అటువంటి దృశ్యాన్ని మళ్ళా చూడనని ఆశిస్తున్నాను! మరోసారి చూస్తే యీ ఇంట్లో వుండలేను!" అందామె.

"మీరీ ఇంటికొచ్చి నెల అయిందనుకుంటాను!"

"అవును!" అందామె.

"అంతకుముందు యీ ఇల్లెవరిది?"

"నరసింగరావుగారిది. వాళ్ళు జవహార్ నగర్ లో

కొ త్తిల్లు కట్టించుకుని అక్కడకు పోయారు!'' అందామె.

''ఫిలిం ప్రొడ్యూసర్ నరసింగరావా?'' ప్రశ్నించాను.

ఆమె తలాడించింది.

ఆమెవైపు సూటిగా చూశాను.

''కొంతకాలంపాటు మీ అమ్మనో, మరెవర్నో మీ ఇంట్లో వుంచుకోవడం మంచిది. ఒంటరిగా కూర్చుంటే చూసినదాన్ని గురించే మీరు ఆలోచిస్తూవుంటారు.'' అన్నాను.

''అమ్మకి రాస్తాను.'' అందామె.

సోఫాలోంచి లేచాను.

''అవుసరమైతే కబీర్ని పిలవండి. అతను చాలా మంచివాడు, ధైర్యం గలవాడు. అతడిని గురించి మీరు భయపడనక్కరలేదు.'' అన్నాను.

''అలాగే సార్!'' అందామె.

గదిలోనుంచి బయటకొచ్చాను. ఇంటి చుట్టూ తిరిగి చూశాను. పాత మేడ. చుట్టూ ప్రహరీ గోడుంది. వెనకవైపున నుయ్యి వుంది. నూతినీళ్లు మొక్కలకు వాడుతున్నారు.

నలువైపులా చెట్లూ, మొక్కలూ వున్నాయి. డజను అరటిచెట్లు నూతికి సమీపంలో కనిపించాయి.

గేటువైపు నడిచాను.

కారులో కూర్చుని తలుపు మూశాను. కబీర్ కారు పక్కకొచ్చాడు.

కబీర్తో మాట్లాడుతూ కర్నల్ కామత్ ఇంటివైపు చూస్తున్నాను. మేడమీదున్న గది కిటికీకి తెరలున్నాయి. తెరల వెనకనుంచి ఒక ఆకారం మమ్మల్ని గమనిస్తోంది. కారును పోనిచ్చాను.

# 5

గోపీనాథ్ తొమ్మిదింటికల్లా ఇంటికొచ్చేశాడు. భార్య ఎలా వుందో అని అతని గాభరా!

రాధ ఉషారుగా వుంది. ఒక ఉత్తరాన్ని అతనికి చూపించిందామె.

"అనూరాధ నా చిన్ననాటి స్నేహితురాలు. హైస్కూల్లో ఇద్దరం కలిసి చదువుకున్నాం," అంది రాధ.

"రాధా! ఇటుపైన కొంతకాలంపాటు నువ్వు ఒంటరిగా వుండనక్కరలేదు. ఆమె నీకు తోడుగా వుంటుంది," అన్నాడు భర్త.

ఏదో ఇంటర్వ్యూకి తన్ని పిల్చారనీ, తను మద్రాస్ వస్తున్నాననీ, అభ్యంతరం లేకపోతే ఇంట్లో అతిథిగా వుంటాననీ రాసింది వుత్తరంలో అనూరాధ.

రాధ ఇద్దరికీ వడ్డించింది. డైనింగ్ హాల్లో గోపీనాథ్, రాధ ఎదురుగా కూర్చుని భోజనం చేస్తున్నారు.

"మీరు వెళ్ళాక పరశురామ్‌గారొచ్చారు!" అందామె.

"ఎనీ న్యూస్?"

పరశురామ్ చెప్పినదంతా ఆమె భర్తకు చెప్పింది. అతను సూటిగా భార్యవైపు చూశాడు.

"రాధా! కర్నల్ కామత్ మీద నువ్వు హత్యా నేరాన్ని మోపుతున్నావు! అది నిజం కాకపోతే నువ్వూ, నీతో నేనూ చిక్కుల్లో పడ్తాం!"

"నేను శవాన్ని చూశాను!" అందామె.

"ఎలాగైనా మనం వెనకాముందూ ఆలోచించాలి! హత్యానేరం చిన్న నేరం కాదు!" అన్నాడతను.

భోజనం చేసి అతను మేడమీదకు వెళ్ళాడు.

ఆమె ముందుతలుపు గడియలు బిగించి, లైట్లు తీసేసి పైకి వెళ్ళింది.

గోపీనాథ్ ఒక టేబుల్ ముందు కుర్చీలో కూర్చుని, సిగరెట్ పీలుస్తూ ఏవో బ్లూప్రింట్లను చూస్తున్నాడు. వెనక్కి వెళ్ళి ఆమె నిలబడింది. అతను వెనుదిరిగిచూశాడు.

"ఇవి పరీక్షించి నేనొస్తాను. నువ్వెళ్ళి పడుకో!" అన్నాడతను.

ఆమె కిటికీ దగ్గరకు చేరింది. కాస్సేపయ్యాక గోపీనాథ్ ఆమెకేసి చూశాడు.

"రాధా! అటువైపు చూడకు! వెళ్ళి పడుకో!" అన్నాడతను.

ఆమె వెళ్ళి పరుపుమీద వాలింది. కళ్ళు మూసుకుంది. నిద్రపట్టక ఇటూ అటూ దొర్లుతూ వుండిపోయింది. గోపీనాథ్ తన పనిలో లీనమైపోయాడు.

ఎప్పుడో ఆమెకు నిద్రపట్టేసింది. ఏదో కేక విని ఆమె ఉలిక్కిపడి లేచింది. పక్కన పడుకొన్న గోపీనాథ్ మేలుకున్నాడు.

"భయంకరమైన కేక వినడింది!" అందామె.

"నేను వినలేదు!" అన్నాడతను.

అతనామె చెయ్యి పట్టుకున్నాడు.

"రాధా! నీ అరపు విని నేను లేచాను!" అన్నాడతను.

"నేనరవలేదు! ఆ కేక మీకు వినపడివుంటుంది!"

అతను లేచి కిటికీ దగ్గరకు వెళ్ళి ముందున్న రోడ్డును పరికించాడు. కబీర్ కోసం చూశాడు. అతనెక్కడా కనపడలేదు!

గోపీనాథ్ వెనక్కి తిరిగాడు. రాధవైపు చూశాడు.

"రాధా! కబీర్ ఏమైనాడు?"

"ఆయనే అర్చారేమో!"

"వెళ్ళి చూసిరానా?"

"వద్దు! మీరు వెళ్ళొద్దు! పరశురామ్‌గారికి ఫోన్ చేయండి! ఆయన చూస్తారు!" అందామె.

"రాధా! నేనొక పిరికిపందనని పరశురామ్‌గారు అనుకుంటారు! వెళ్ళి చూస్తాను!" అని అతను కిందకు పరుగెత్తాడు. గోపీనాథ్ గేటువైపు నడిచాడు. అతని చేతిలో టార్చిలైటుంది. అతను రోడ్డుమీదకు చేరుకున్నాడు.

రోడ్డు వారగా కబీర్ పడున్నాడు. అతని తలనుంచి రక్తం కారోంది. అతను మెలుకువగా లేడు. అది చూసి గోపీనాథ్ వేగంగా లోపలకు పరుగెత్తుకొచ్చాడు. హాల్లోని టెలిఫోన్ దగ్గరకెళ్ళి, రిసీవరెత్తి, ఒక నంబరు తిప్పాడు.

పైనుంచి రాధ గబగబా వచ్చి, ముందుతలుపు మూసి గడియలు పెట్టింది! రాధ చాలా భయపడ్తోందని అతను గ్రహించాడు!

# 6

గోపీనాథ్ ఇంటిముందు డాడ్జి కారు ఆపి దిగాను.

గోపీనాథ్ నా దగ్గరకొచ్చాడు. కబీర్ని పరీక్షగా చూశాను. కర్రతో ఎవరో అతడిని బుర్రమీద కొట్టారు. కబీర్ని ఎత్తి, మోసుకెళ్ళి కారు వెనుక సీటుమీద కూర్చోబెట్టాను.

సిగరెట్ వెలిగించి, పొగ వదుల్తూ గోపీనాథ్ వైపు చూశాను.

"మిస్టర్ గోపీనాథ్! తలుపులు జాగ్రత్తగా మూసుకు పడుకోండి! నేనితనిని హాస్పిటల్లో చేర్చి మళ్ళా ఈపక్క

కొస్తాను. బి కేర్ ఫుల్!'' అన్నాను.

"అలాగే మిస్టర్ పరశురామ్!'' అన్నాడతను.

"నేనుండగానే మీరు లోపలకు వెళ్ళండి!'' అన్నాను.

అతను వెళ్ళిపోయాడు. ముందు సీటుమీద కూర్చుని తలుపు మూశాను. సిగరెట్ పీలుస్తూ కాస్సేపు అలాగే కూర్చున్నాను. రోడ్డుమ్మట జనసంచారం లేదు. కర్నల్ కామత్ మేడవైపు చూశాను. ఎక్కడా లైట్లు లేవు!

కారును ముందుకు పోనిచ్చాను. రాయపేట హాస్పిటల్లో కబీర్ని చేర్చాను. జాగ్రత్తగా అతడిని చూడమని డాక్టర్ సుందరంతో చెప్పాను.

డాడ్జి కారును వెనక్కి పోనిచ్చాను. గోపీనాథ్ ఇంటి ముందు కారాపి దిగాను. రోడ్డుమ్మట ఇటూ అటూ పచార్లు చేస్తున్నాను!

ఒకతను ఎదురుగా వస్తున్నాడు. భారీ దుస్తుల్లో వున్నాడతను. చేతిలో లాఠీ వుంది. అతనివైపు నడిచాను. నన్ను చూసి అతను ఆగాడు.

"ఎవరు నువ్వు?'' అడిగాను.

"వాచ్ మన్ సార్!'' అన్నాడతను.

"ఇక్కడ తిరగడానికి ఎవరు నిన్ను నియమించారు?''

"నేనే తిరుగుతున్నాను. ప్రతి ఇంటివాళ్ళూ ఒక రూపాయి యిస్తారు!'' అన్నాడతను.

"ఈ రోడ్డుమీదే తిరుగుతావా?''

"జీ సాబ్!'' అన్నాడతను.

ఆ గూర్ఖా! నేపాల్ నుంచి వచ్చాడు. ఉద్యోగాలు దొరకక నైట్ వాచ్ మన్ గా పనిచేసి, ఇళ్ళవాళ్ళు ఇచ్చే దానితో జీవిస్తూవుంటాడు!

అతడిని పోనిచ్చాను. వెళ్ళి కార్లో కూర్చున్నాను, సిగరెట్ పీలుస్తూ.

రెండు గంటలు అలా వాచ్ చేసి తిరిగి కారును పోనిచ్చాను.

రాయపేట హాస్పిటల్ కాంపౌండులో కారును ఆపాను. దిగి డాక్టర్ సుందరం గదిలోకి వెళ్ళాను. అతను నవ్వుతూ నన్ను కబీర్ గదిలోకి తీసుకెళ్ళాడు.

"నో డేంజర్, మిస్టర్ పరశురామ్!" అన్నాడు డాక్టర్.

కబీర్ నవ్వుతూ నావైపు చూశాడు. అతని తలమీద బాండేజి వుంది!

"కబీర్, ఏమైంది?" అడిగాను.

"ఎవరో తలమీద కర్రతో కొట్టారు. కళ్ళు తిరిగాయి. బుర్ర దిమ్మెక్కినట్లయింది. కింద పడిపోయాను!" అన్నాడతను.

"ఎవరు?" ప్రశ్నించాను.

"నేను చూడలేదు సార్!" అన్నాడతను.

"ఇదెక్కడ జరిగింది?"

"పదిహేనో నంబరు ఇంటినుంచి వెనక్కి తిరిగి వస్తున్నాను. పన్నెండో నంబరు ఇల్లు ప్రాంతంలో ఎవరో కొట్టారు."

"కర్నల్ కామత్ కొట్టివుంటాడా?"

"చెప్పలేను సార్!" అన్నాడు కబీర్.

అతను లేచి కూర్చున్నాడు.

"మీతో నేనూ వస్తాను సార్! ఐయామ్ ఆల్ రైట్!" అన్నాడతను.

డాక్టర్ సుందరంవైపు చూశాను.

"అతను రేపు వెళ్ళడం మంచిది!" అన్నాడు డాక్టర్.

"థాంక్స్ ది డాక్టర్!" అని బయటకు నడిచాను.

# 7

రాధ స్టేషన్‌కి వెళ్ళి అనూరాధను ఇంటికి తీసుకొచ్చింది. భర్త కారు పంపాడు. వాళ్ళను ఇంట్లో దింపేసి కారు వెళ్ళిపోయింది.

అనూరాధ వయసు ఇరవైనాలుగుంటుంది. రాధకంటె కొద్దిగా పెద్దది.

ఎన్నో వింతలూ, విశేషాలు చెప్పుకుంటూ ఇద్దరూ కాఫీ తాగారు. అనూరాధ స్నానం చేస్తూంటే రాధ స్టూల్ వేసుకొని బాత్‌రూమ్‌లో కూర్చుంది. ఇద్దరూ మాట్లాడుకుంటూ వుండగా, అనూరాధ స్నానం చేసింది. భోజనం చేస్తూ యిద్దరూ ఎంతో చెప్పుకున్నారు.

భోజనాలయాక వాళ్ళు పైనున్న పడగ్గదిలోకి వెళ్లారు. ఒకే పరుపుపైన వాళ్ళు పడుకున్నారు. అనూరాధ రాధను కౌగిలించుకుంది!

"నీ జీవిత మెలా వుంది చెప్పు!" అందామె.

"ఆయన బాగా డబ్బు గడిస్తున్నారు. ఈ ఇల్లు కొన్నారు. కాని నాతో తిరగడానికి ఆయనకు టైమ్ దొరకదు! ఆయనకి పనితోనే సరిపోతుంది!" అంది రాధ.

"రాధా! డోంట్ బాదర్! ఎండగా వున్నప్పుడే బట్టలు ఆరేయాలి! అలాగే వచ్చే సమయంలోనే డబ్బును రాబట్టుకోవాలి! మనం కావాలన్నప్పుడు డబ్బు రాదు!" అంది అనూరాధ.

అటుపైన తను చూపిన శవాన్ని గురించి చెప్పింది రాధ.

అనూరాధ ఆమె చెప్పింది విని ఆశ్చర్యపోయింది. ఆమె కిటికీ దగ్గరకెళ్ళి ఎదుటి ఇంటివైపు చూసింది. ఇంట్లో ఎవ్వరూ లేనట్లు వుంది!

"దయ్యాల కొంపలా వుంది!" అంది అనూరాధ.

"ఒకప్పుడు ఈ ఇల్లు కూడా దయ్యాల కొంపట! ఇంట్లోవాళ్ళందరూ వెళ్ళిపోయారు, తాళంవేసి. రెండేళ్లు అలా పడుంది. ఎవ్వరూ వుండేవారు కారట! తర్వాత నరసింగరావుగారు కొన్నారట! ఇదంతా పాలు పోసేది పొద్దుట నాతో చెప్పింది!" అంది రాధ.

"మనుషులలాగే ఇళ్ళకు గత చరిత్రలుంటాయి. అంతా తెలుసుకొన్నాక ఇళ్ళు కొనాలి!" అంది అనూరాధ.

"ఆయనకు తొందరెక్కువ! ఇల్లు నచ్చిందని వెంటనే అడ్వాన్స్ యిచ్చేశారు" అంది రాధ.

ప్రయాణబడలికతో అనూరాధ నిద్రపోయింది.

రాధకు ఇంటిముందు తిరుగుతున్న కబీర్ కనిపించాడు. ఆమె వేగంగా కిందికెళ్ళింది. ముందు వరండాలో నిలబడి చేత్తో కబీర్‌కి సౌంజ్ఞ చేసింది. గేటు తెరిచి అతను ఆమె ముందుకొచ్చాడు. అతని తలమీద కట్టుంది.

"నిన్న రాత్రి మిమ్మల్ని ఎవరు కొట్టారు?" అందామె.

"త్వరలో కనుక్కుంటాను!" అన్నాడతను.

ఆమె ఆశ్చర్యపోయింది. ఆమె ఆలోచిస్తోంది. తను శవాన్ని చూసింది. అటుపైన కబీర్ ఇంటిముందు పచార్లు చేస్తున్నాడు. హంతకుడు భయపడి కబీర్ని కొట్టివుండాలి! ఆమె గాభరాగా కబీర్ వైపు చూసింది.

"మీరు భయపడకండి. మీకే ప్రమాదం రాదు!" అన్నాడు కబీర్.

"మిమ్మల్నే కొట్టిన మనిషి నన్ను వదుల్తాడా?" అందామె.

"వాడొక పిరికిపంద! వెనకనుంచి వచ్చి కొట్టి పారి పోయాడు! ఇవాళో, రేపో వాడికి బుద్ధి చెప్తాను." అని కబీర్ గేటువైపు వెళ్ళిపోయాడు.

రాధ లోపలకు వెళ్ళి తలుపు మూసింది. హాల్లో నిలబడి నలువైపులా చూసింది. ఎందుకో ఆమెకు భయమేసింది. ఆమె గబగబా మెట్లమ్మట పైకి వెళ్ళింది. అనూరాధ ప్రక్కనే పడుకుంది. అనూరాధ గాఢనిద్రలో వుంది!

టెలిఫోన్ మ్రోగింది.

రాధ టెలిఫోన్ దగ్గరకెళ్ళింది. ఆమె శరీరం వణుకు తోంది. రిసీవర్ని ఎత్తింది.

"హాలో!" అందామె.

"రాధా! అనూరాధ వచ్చిందని డ్రైవర్ చెప్పాడు. ఇప్పుడు భయం లేకుండా వున్నావా?" అడిగాడు గోపీ నాథ్.

"భయం లేదు!" అందామె.

"ఇవాళ నేను ఆలస్యంగా వస్తాను" అన్నాడతను.

"అలాగే!"

"స్వీట్ గర్ల్! బై బై!" అని అతను రిసీవర్ని పెట్టే శాడు.

ఆమె రిసీవర్ని పెట్టేసి కిటికీ దగ్గరకు వెళ్ళింది. కర్నల్ కామత్ గేటు బయటకొచ్చి క్షణకాలం ఆమెవైపు చూశాడు. గబగబా రోడ్డమ్మట వెళ్ళిపోయాడు. అతని వైపు ఆమె చూస్తూ వుండిపోయింది!

కర్నల్ కామత్ కిరాతకుడిలా కనిపించాడామెకు!

కబీర్ ఇంటిముందునుంచి వెళ్ళాడు. కర్నల్ కామత్ వెళ్ళినవైపు నడుస్తున్నాడతను!

అది పట్టపగలు కాబట్టి వాళ్ళు పోట్లాడుకోరు. ఆమె మెదడులో ఏవేవో ఆలోచనలు సాగుతున్నాయి!

"రాధా!"

ఆమె పిలుపు విని వెనక్కి తిరిగింది. అనూరాధ పరుపు మీద కూర్చునివుంది.

"రాధా! ఈ ఇంట్లో నిద్రపట్టటంలేదు. ఎందువల్లనో? ఏవో దుష్టశక్తులు చుట్టూ తిరుగుతున్నాయి అనిపిస్తోంది!" అంది అనూరాధ.

రాధ ఆమె దగ్గరగా కూర్చుంది. ఆమె చెయ్యి పట్టుకుంది.

"నువ్వు చెప్పింది నాకూ నిజమనిపిస్తోంది!" అంది రాధ.

మూడింటికి అనూరాధ చక్కటి చీర కట్టుకుని, మేకప్ చేసుకుని తన పనిమీద వెళ్ళడానికి సిద్ధమైంది.

"రాధా! నువ్వు రాకూడదూ? పదింటికి వచ్చేస్తాం!" అందామె.

"వద్దు. ఎవరో ఒకరు ఇంట్లో వుండాలి!" అంది రాధ.

"ఒక్తెవ్వూ ఉండగలవా?"

"ఉండక తప్పదు!" అంది రాధ.

అనూరాధ హేండ్ బాగ్ పట్టుకుని వెళ్ళిపోయింది.

రాధ గడియవేసి పైకి వెళ్ళిపోయింది. కిటికీలోంచి బయటకు చూసింది. కబీర్ తిరుగుతున్నాడు. కర్నల్ కామత్ యింకా ఇంటికి వచ్చివుండడు!

# 8

రాధ పరుపుమీద పడుకుంది. కళ్ళు మూసుకుంది. తను చూసిన శవం...గాయపడిన కబీర్...చుట్టూ దుష్టశక్తు

లున్నాయన్న అనూరాధ...ఇదంతా రాధకు జ్ఞాపక మొస్తోంది! ఆమె గుండె దడదడ కొట్టుకుంటోంది!

ఆమె లేచి గాడ్రెజ్ బీరువాను తెర్చింది. స్కాచ్ విస్కీ బాటిల్ను, ఒక గ్లాసును తీసి టీపాయ్‌మీద పెట్టింది. రెఫ్రిజిరేటర్‌లోంచి రెండు సోడాలను తీసింది. పరుపుమీద కూర్చుని గ్లాసులో విస్కీ పోసి సోడా కలిపింది.

కొద్దిగా తాగింది. ఘాటుగా వుంది. కళ్ళు మూసుకుని మందులా గడగడ తాగేసింది. సోడా తక్కువగా పోయడంవలన గొంతు మండింది.

రాధ మళ్ళీ కిటికీ దగ్గరకు వెళ్ళింది. రోడ్డువైపు చూసింది. కర్నల్ కామత్ లోపలకు వస్తున్నాడు.

కబీర్ గేటు ముందునుంచి వెళ్తున్నాడు.

ఆమె పరుపుమీద కూర్చుని ట్రాన్సిస్టర్‌ని ఆన్ చేసింది. పాప్ మ్యూజిక్ వినబడ్తోంది. ఒక యువతి పాడ్తోంది. ఆమె పాదాల్తో తాళం వేస్తోంది!

లైఫ్ యీస్ రిస్కీ
విత్ ఎ పెగ్ ఆఫ్ విస్కీ
ఇటీస్ ఆల్ ఫన్
యూ రాక్ అండ్ రన్!

రాధకు తాగాక ఉషారుగా వుంది. మరో పెగ్ విస్కీని ఆమె తాగేసింది.

ట్రాన్సిస్టర్‌లోంచి పాట వినపడుతోంది. ఆమె పరుపు మీద వాలింది. కళ్ళు మూసుకుపోయాయి. ఆమె మత్తుతో నిద్రపోయింది.

ఆమె పదింటికి లేచింది. గదిలో లైటు వెల్గుతోంది.

నిషాగా వుంది. ఆమె కిటికీ దగ్గరకెళ్ళింది. ఎదురింటివైపు చూసింది, ఎడంవైపు గదిలో లైటు వెల్గుతోంది!

కుర్చీమీద ఒక స్త్రీ కూర్చునివుంది! ఆమెకు తలలేదు! ఆమె ధరించిన తెల్లచీర, జాకెట్ రక్తంతో ఎర్రబడ్డాయి! కబీర్ గేటు ముందునుంచి వెళ్తున్నాడు. మూర్ఖుడు! అలా తిరగడం లాభించదు. ఆ స్త్రీ శవం అతనికి కనపడదు! ఆమె అటువైపే చూస్తోంది. అతను గదిలోకొచ్చాడు. ఆమె తల అతని చేతిలో వుంది!

అతను కిటికీ దగ్గర కొచ్చి ఆమెకేసి చూశాడు. వెంటనే తలుపులను మూసేశాడు.

రాధ వెనక్కి వచ్చి పరుపుమీద కూర్చుంది. వేగంగా గ్లాసులో విస్కీ పోసుకుని సోడా కలిపింది. గ్లాసులోని విస్కీ గడగడ తాగేసింది.

ఎదుటింట్లో జరిగే హత్యలను తను ఆపాలి! ఆమె కిందకు పరుగెత్తి వీధి తలుపు తెరిచింది! అటువైపు నున్న మనిషిని చూసి వులిక్కిపడింది!

అనూరాధ!

"నువ్వా!" అంది రాధ.

"తలుపు తట్టేముందే తెరిచావు! నేను రావడం పైనుంచి చూశావనుకున్నాను," అందామె.

"అనూ, మరో హత్య! అతను ఒక స్త్రీని నరికేశాడు!" అర్చింది రాధ.

రాధ తూల్తోంది. రాధ మాట ముద్దగా వస్తోంది! "రాధా, పైకి పద! ఏం చెయ్యాలో ఆలోచిద్దాం," అంది అనూరాధ.

రాధను ఆమె పైకి తీసుకుపోయింది. ఇద్దరూ పరుపుపై

కూర్చున్నారు. ట్రాన్సిస్టరులోంచి ఏదో ఉపన్యాసం విన పడ్తోంది. అనూరాధ ట్రాన్సిస్టర్‌ను ఆఫ్ చేసింది.

టీపాయి మీదున్న విస్కీ బాటిల్నీ, గ్లాసును, సోడా బుడ్లనూ ఆమె నవ్వుతూ చూచింది.

"రాధా, బాగా విస్కీ కొట్టేశావ్!" అందామె.

"జాయిన్ మి!" అంది రాధ.

"మొదట ఏం చూశావో చెప్పు!"

తను చూసినదంతా ఆమె వర్ణించింది. అనూనాధ కిటికీ దగ్గర కెళ్ళి తిరిగి వచ్చింది.

"తలుపు మూసివుంది!"

రాధ గ్లాసులో విస్కీ పోసి సోడా కలిపింది.

"అనూ, తాగు!" అందామె.

"విస్కీ అలవాటు నాకొద్దు. నువ్వు తాగు!" అందామె.

రాధ గ్లాసులోని విస్కీని తాగేసింది. హుషారుగా వుంది.

"అనూ, ఎదుటింటి మీదకు దాడి చేద్దామా?" అడిగింది రాధ.

"డేంజరస్! ఒక స్త్రీని చంపిన వాడు ఎందర్నైనా చంపేస్తాడు. మనం అక్కడికి వెళ్ళొద్దు!"

"అయితే ఏం చేద్దాం?"

"ఈ యిల్లు ఎవరికేనా అద్దెకిచ్చేసి మరో ఇల్లు చూసుకోండి!" అంది అనూరాధ.

"ఆయనొచ్చాక చెప్తాను," అంది రాధ.

గోపీనాథ్ వచ్చేసరికి పన్నెండయింది. అతను నవ్వుతూ రాధ దగ్గర వెళ్ళాడు. కళ్ళు చిట్లించి అతని వైపు చూసిం

దామె. టీపాయి మీదున్న గ్లాసులో విస్కీపోసి, కొద్దిగా సోడా కలిపి తాగేశాడతను.

"మీ శ్రీమతి మంచి డ్రెస్‌లో వుంది!" అంది అనూ రాధ.

"రాధ నేనిచ్చినా తాగేది కాదు. ఇవాళ తాగడం విచిత్రంగా వుంది," అన్నాడతను,

"నాకు భయంగా వుంది. మరో హత్య చూశాను. ఆమెను నరికేశాడు. ఆమె తల అతని చేతిలో వుంది!" అంది రాధ.

"రాధా డోంట్ వర్రీ! నేను నీపక్కనున్నాను. నీ ఫ్రెండ్ అనూరాధ వుంది. రోడ్డుమీద కబీరు తిరుగుతున్నాడు! నీకేం భయం లేదు," అన్నాడతను, ఆమెను సమాధానపరుస్తూ.

# 9

నా ఫ్రెండ్ మేజర్ జనరల్ పృధ్వీరాజుతో రెండు గంటలపాటు కూర్చున్నాను. అతడిని కల్సుకుని సంవత్సరం దాటింది. అతను నన్ను ఒకంతట వదల్లేదు. విస్కీ తాగుతూ అనేక విషయాల గురించి మాట్లాడాం.

అక్కడ నుంచి తిరిగొస్తూ పోలీస్ హెడ్ క్వార్టర్స్‌కు వెళ్ళాను. ఇన్‌స్పెక్టర్ నాయర్‌తో గంటపైగా మాట్లాడుతూ కూర్చున్నాను.

అక్కడ నుంచి హిందూ ఆఫీసుకు వెళ్ళి అక్కడ పని ముగించుకుని ఇంటికొచ్చాను.

రెండింటికి మస్తుగా భోజనం చేసి పడుకున్నాను. నేను లేచేసరికి సూర్యుడు అస్తమించాడు. లైట్లు వెల్గుతున్నాయి.

మొహం కడుక్కొని వంటవాడు కృష్ణయ్య తెచ్చిన టిఫిన్ తిని నాలుగు కప్పుల కాఫీ తాగాను.

ఏర్ కండిషండ్ హాల్లో కూర్చుని స్కాచ్ విస్కీ తాగుతూ నేను కొని తెచ్చిన హిందూ పాత పత్రికలను చూస్తున్నాను.

టెలిఫోన్ మ్రోగింది.

వెళ్ళి రిసీవర్ని ఎత్తాను.

"హలో, పరశురామ్!" అన్నాను.

"నేను గోపీనాథ్‌ని సార్. నా భార్య ఇవాళ అదే యింట్లో మరో హత్య చూసింది," అన్నాడతను.

అతని భార్య చూసినదంతా వివరంగా చెప్పాడు.

"విచిత్రంగా ఉంది!" అన్నాను.

"పరశురామ్‌గారూ, ఈ యింటికొచ్చినప్పటి నుంచీ రాధ సంతోషంగా లేదు. ఎవరికేనా అద్దెకిచ్చి మరో చోటుకు పోదాం అనుకుంటున్నాను," అన్నాడతను.

"గుడ్ ఐడియా!" అన్నాను. ఆ తర్వాత కొద్దిసేపు మాట్లాడి ఫోన్ పెట్టేశాను.

## 10

కబీర్ నా ఎదురుగా కూర్చున్నాడు. అతని వైపు నవ్వుతూ చూశాను.

"గోపీనాథ్‌గారు మరో యింటికి మారిపోయారు. సామానంతా పైన బెట్టి తాళం వేసి కింద భాగాన్ని ఒక బొంబాయి సేట్‌కి అద్దెకిచ్చేశారు. సేట్ ఇవాళ తన కుటుంబంతో సహా యింట్లోకి ప్రవేశించాడు," అన్నాడు కబీర్.

"సేట్‌కి పిల్లలున్నారా?"

"లేరు. అతనూ, భార్యా," అన్నాడు కబీర్.

సరిగ్గా పదింటికి అతనూ, నేనూ కిందకు వెళ్ళాం. డాడ్జి కారులో అతను ముందు సీటు మీద కూర్చున్నాడు. కారును శరవేగంగా పోనిచ్చాను.

గోపీనాథ్ ఇంటి చివర రోడ్డు వారగా కారును ఆపి దిగాను. కబీర్ నా దగ్గరకు వచ్చాడు.

ప్రహారీ గోడ దూకి కాంపౌండులోకి చేరుకున్నాం. ఇంట్లో ఎక్కడా లైట్లు లేవు. ఆకాశంలో చంద్రుడు లేడు. ఎటు చూసినా అంధకారంగా వుంది.

మెల్లిగా అడుగులేస్తున్నాను. కబీర్ నా వెనకనే వస్తున్నాడు. వెనుక నున్న నూతి దగ్గరకు చేరుకున్నాం. ఎటు చూసినా చీకటి. ఏదో చప్పుడు వినిపిస్తోంది.

చటుక్కున టార్చి వెలిగింది. ఒకతను గునపంతో తవ్వుతున్నాడు. టార్చి మరొకళ్ళ చేతిలో వుంది!

కబీర్ ముందుకు వెళ్ళబోయాడు. అతని చెయ్యి పట్టుకుని ఆపాను. తొందర పడొద్దని చెవులో చెప్పాను.

టార్చి ఆరిపోయింది. గునపంతో తవ్వుతూన్న చప్పుడు మాకు వినపడ్తోంది. మెల్లిగా కదిలాను. మొక్కల పక్క నుంచి వెళ్ళాను. తవ్వే మనిషి ఆకారం కనపడ్తోంది.

"నాగూ, ఇంకా లోతుగా తవ్వి చూడు!" అందొక స్త్రీ కంఠం.

"టార్చి వెయ్యి!" అన్నాడతను.

ఆమె ఆన్ చేసింది. కబీర్ మెడమీద తట్టాను. ఇద్దరం అమాంతంగా వాళ్ళవైపు దూకాం. గునపంతో తవ్వుతున్న తడ్ని నేను బంధించి పట్టుకున్నాను. కబీర్ ఆమెను పట్టుకుని టార్చి లాక్కున్నాడు.

టార్చి కాంతి గునపం పట్టుకున్నతనివైపు పడింది.

నన్ను గుర్తుపట్టి అతను ఉలిక్కిపడ్డాడు.

"కర్నల్ కామత్ ఉరఫ్ నాగూ!" అన్నాను.

అతను గునపాన్ని ఎత్తబోయాడు. అతని మెడమీద చేత్తో బలంగా కొట్టాను. అతను ముందుకు పడ్డాడు. ఇంటి చుట్టూవున్న లైట్లు వెలిగాయి.

ఇన్‌స్పెక్టర్ నాయర్, పదిమంది కానిస్టేబుల్స్‌తో మా దగ్గరకొచ్చాడు. నేలమీద పడిన నాగూ లేచాడు. ఇద్దరు కానిస్టేబుల్స్ అతడిని చుట్టేశారు.

"నాయర్ భాయ్, కానిస్టేబుల్సును యిక్కడ తవ్వి చూడమను! భారత్ బాంకిలోంచి పోయిన పదిలక్షలు మనకు దొరకొచ్చు," అన్నాను.

ఒక కానిస్టేబుల్ పెట్రోమాక్స్ లైట్‌ను తెచ్చి మా సమీపంలో వుంచాడు.

నాగూకీ, అతనితోపాటు వున్న అతని ప్రియురాలికి ఇన్‌స్పెక్టర్ నాయర్ సంకెళ్ళు వేశాడు.

సిగరెట్ వెలిగించి, పొగ వదుల్తూ మేడ ముందువైపుకు వెళ్ళాను. మెయిన్ గేటు తెరిచివుంది. అంబాసిడర్ కారొచ్చి యింటి ముందు ఆగింది. గోపీనాథ్, రాధ, అనూరాధ కిందకు దిగారు.

"వెల్ కమ్ టు యువర్ హోమ్!" అన్నాను నవ్వుతూ.

ఇంటి వెనుకవైపునుంచి వచ్చి ఒక కానిస్టేబుల్ ముందుతలుపు తెరిచాడు.

హాల్లోకి వెళ్ళి సోఫాలో చతికిలబడ్డాను. గోపీనాథ్ ఫాన్ తిప్పి నా పక్కనే కూర్చున్నాడు. రాధ, అనూరాధ అతని పక్కనున్న సోఫాల్లో కూర్చున్నారు.

ఇన్‌స్పెక్టర్ నాయర్ గబగబా లోపలికొచ్చాడు.

"బ్రదర్, యూ ఆర్ రైట్. పెద్ద ట్రంకుపెట్టె దొరికింది. వాళ్ళు తెస్తున్నారు," అన్నాడతను.

ఇద్దరు కానిస్టేబుల్స్ ఒక పెట్టెను మోసుకొచ్చి హాల్లో గోడవారగా పెట్టారు. ఇన్‌స్పెక్టర్ నాయర్ పెట్టె తాళాన్ని పగలగొట్టి తెరిచాడు.

పైన న్యూస్ పేపర్లు వున్నాయి. న్యూస్ పేపర్లను పైకి తీసి పక్కన పడేశాడు. నోట్లకట్టలు పేర్చబడి వున్నాయి.

"నాయర్ భాయ్, లెక్కబెట్టి చూడు!"

నాగూనీ, అతనితో వున్న స్త్రీనీ యిద్దరు కానిస్టేబుల్సు హాల్లోకి తీసుకొచ్చి, గోడవారగా నిలబెట్టారు.

ఇన్‌స్పెక్టర్ నాయర్ పెట్టెను మూసేశాడు. నా దగ్గర కొచ్చాడు.

"బ్రదర్, తొమ్మిదిలక్షల ఎనభైవేలుంది!" అన్నాడతను.

"ఇరవైవేలు వాళ్ళు ఖర్చుచేసి వుంటారు," అన్నాను.

టైమ్ చూశాను. పన్నెండయింది.

"బ్రదర్, ఇదంతా విచిత్రంగా వుంది. వాళ్ళు ఇక్కడ డబ్బును పాతిపెట్టారని నువ్వెలా తెల్సుకున్నావు?" అడిగాడు నాయర్, నా పక్కన చతికిలబడుతూ.

"నాయర్, నీకంతా చెప్తేగాని యిది అర్థంకాదు," అని రాధనూ, గోపీనాధ్‌నీ అతనికి పరిచయం చేశాను.

రాధ చూసిన మొదటి శవాన్నిగురించి చెప్పాను. "నాయర్ భాయ్, ఎలాగైనా యీ యిల్లు వదిలి వాళ్ళు పోయేటట్లు చేయాలని నాగూ ఆమెను భయపెట్టాడు. రక్తంతో ఎర్రబడిన శవాల్ని చూసి రాధ భయపడింది!

కాని, అవి శవాలు కావు. మనిషిలా తయారుచేసిన బొమ్మలు! నాగూ బొమ్మల్ని శవాల్లా ఆమెకు చూపించే వాడు! అవి నిజంగా శవాలనుకుని ఆమె భయపడేది.

ఈ యిల్లు వదిలిపోదామని భర్తతో చెప్పింది. అతను నా సలహా అడిగాడు. అద్దె కివ్వమన్నాను, కాని వేరే యిల్లు తీసుకోవద్దన్నాను. హోటల్లో గది తీసుకుని వుండ మన్నాను! అలాగే చేసారు గోపీనాథ్! నాగూ వెంటనే బొంబాయి సేటుగా రూపుదాల్చి వచ్చి ఇల్లు అద్దెకు తీసు కున్నాడు'' చెప్పాను జరిగింది.

''ఈ ఇల్లు నాగూ అద్దెకు తీసుకుంటాడని మీరెలా ఊహించారు?'' అడిగాడు గోపీనాథ్.

''నాగూ పెద్ద పొరబాటు చేశాడు. అతను కర్నల్ కామత్ గా నటిస్తూ ఎదటి యింట్లో వుండేవాడు. తను రిటైరయినట్లు నాతో చెప్పాడు. నేను మేజర్ జనరల్ పృథ్వీరాజును కలుసుకుని, కర్నల్ కామత్ యింకా సర్వీ సులో వున్నాడని తెల్సుకున్నాను! దాంతో కర్నల్ కామత్ యింట్లో వుండే అతను కామత్ కాదని తేలింది! అయితే అతను ఎవరు?'' అని ఆగాను.

సిగరెట్ వెలిగించాను. పొగ వదుల్తూ అందరివైపూ చూశాను. నేను ఏం చెప్తానా అని వాళ్ళు యెదురు చూస్తున్నారు!

''కొంత రిసెర్చి నేను చేయవలసి వచ్చింది. ఇన్ స్పెక్టర్ నాయర్ ఆఫీసులో కూర్చుని పాత ఫైల్సు, ఫోటోలు చూశాను. కర్నల్ కామత్ గా నటించిన నాగూను వెంటనే పోల్చగల్గాను. ఆరేళ్ళ క్రితం ప్రచు రించిన హిందూ కాపీలను తిప్పి చూశాను. అంతా నాకు

అర్థమైంది. రాధ వుండే యిల్లు నాగూకి యెందుకు కావాలో నాకు అర్థమైంది!

"ఆరేళ్ళ క్రితం నాగూ, మస్తాన్, విలియమ్ యీ ముగ్గురూ కలిసి పట్టపగలు భారత్ బాంకిమీదకు దాడి చేసి, పదిలక్షల రూపాయిల రొక్కాన్ని పట్టుకు పారిపోయారు. వాళ్ళు ముగ్గురూ ఈ యింట్లో దాక్కున్నారు. అప్పట్లో యీ యింటికి తాళంవేసి వుండేది. అద్దెకు తీసుకున్నట్లు నటిస్తూ, వాళ్ళు ముగ్గురూ యిక్కడుండేవారు. ఎలాగో యీ యిల్లు పోలీసులకు తెలిసింది. అంతకుముందే వాళ్ళు పెట్టెను తోటలో పాతిపెట్టారు. పోలీసులు వాళ్ళను అరెస్టుచేశారు, కాని డబ్బు దొరకలేదు.

"వాళ్ళకు ఆరేళ్ళ కఠినశిక్ష పడింది. మస్తాన్, విలియమ్ జైల్లో మరణించారు. నాగూ జైల్లోంచి బయటకొచ్చి రెండు నెలలు అయింది. తనకు కావలసిన యిల్లును ఎవరో కొనుక్కుని అందులో నివసిస్తున్నారు.

"ఇల్లు తనచేతిలో వుంటేగాని తవ్వడం వీలుకాదు! ఇప్పుడు డబ్బంతా తనదే! కర్నల్ కామత్ యిల్లు ఖాళీగా వుంది. అతను కర్నల్ కామత్‌గా నటిస్తూ ఆ ఇంట్లో చేరాడు! రాధను భయపెట్టడం మొదలెట్టాడు!" అన్నాను, నవ్వుతూ.

"పెద్ద ప్లాను," అంది రాధ ఆశ్చర్యపోతూ.

—: ఐపోయింది :—

# వెంటాడిన దొంగలు

రంకిరెడ్డి రాము

వరండాలో కూర్చుని పేపర్ చదువుతున్న పుహాళేంది చూపు హఠాత్తుగా ఒక చోట ఆగిపోయింది.

అతడి దృష్టి పడ్డ చోట ఢిల్లీ లాటరీస్ ఫలితాలు ప్రకటించబడ్డాయి!

వెంటనే పేపర్ టీపాయ్‌మీద పడేసి లోనికి పరుగెట్టాడు. వెంకటేశ్వరస్వామి ఫోటో ముందు వున్న కుంకుమభరిణ కింద వున్న ఢిల్లీ లాటరీ టికెట్ తీశాడు.

ఒక చేత్తో టికెట్ పట్టుకొని మొదటి బహుమతి అని పెద్దపెద్ద అంకెల్లో పేపర్లో వేసిన నెంబర్‌ని తన టికెట్ నెంబర్‌తో చూసుకొన్నాడు.

ఒక్క క్షణం గుండె ఆగి తిరిగి కొట్టుకోసాగింది పుహా

శేందికి. మరోసారి జాగ్రత్తగా ప్రతి అంకెనూ నిశితంగా పరీక్షించి, పరిశీలించాడు. నిజమే! తను...తనకు పది లక్షలు!

ఎందుకైనా మంచిదని మళ్ళీ చూసుకొన్నాడు.

పేపర్లో ముందుగా వున్న సిరీస్ అంకె, తన టికెట్ మీద వున్న అంకె చూశాడు. ఒకటే! నెంబర్ కూడ ఒకటే! ఒళ్ళంతా చమటలు పట్టేశాయి పుహశేందికి.

ఇంటికప్పు ఎగిరిపోయేలా అరవాలనుకున్నాడు. ప్రపంచంలో వున్న అన్నిరకాల నాట్యాలు కలగలిపి డాన్స్ చేద్దామనిపించింది. బట్టలు విప్పేసి, నడిరోడ్డుమీద స్ట్రీకింగ్ చేద్దామనిపించింది. బలవంతాన తన కోర్కెలన్నీ అణచుకొన్నాడు పుహశేంది.

ఇంతలో గేటు తీసుకొని, ఎదురింటి లక్ష్మణరావు కంగారుగా వచ్చాడు. అతడిని చూసి తొట్రుపడుతూ లాటరీ టికెట్ వున్న చేయి వెనక్కి పెట్టేశాడు పుహశేంది.

అనుమానంగా ఆ చేయివైపు చూశాడు లక్ష్మణరావు. ఆ తర్వాత టీపాయ్‌మీద పడివున్న పేపర్ చూశాడు. ఆ పేపర్ సగానికి మడచివుంది. పైకి కన్పిస్తున్న సగంలో లాటరీ ఫలితాలు వున్నాయి.

పుహశేంది ముఖంలోకి చూశాడు. చెమటలు పట్టి వణుకుతున్నాడు. $1 + 1 = 2$ అని అర్థంచేసుకున్నాడు లక్ష్మణరావు.

"ఏమిటలా వున్నారు?" అడిగాడు లక్ష్మణరావు.

"అబ్బే! ఏ...మీ లేదు...ఏం లేదు...ఏమ్ లేదు... ఏమీ లేద్..." అన్నాడు పుహశేంది, తనేం మాట్లాడు

తున్నాడో తనకే తెలియని ధోరణిలో.

తనను తాను ఎంత కంట్రోల్ లో ఉంచుకోవాలనుకున్నా కుదరటంలేదు. లక్ష్మణరావు పదేపదే తన వెనుక దాచుకొన్న చేతివైపు, పేపర్లో పడ్డ లాటరీ ఫలితాల వైపు చూస్తున్నాడు. వాడసలే వట్టి రౌడీవెధవ. పది లక్షల రూపాయలు బహుమతి వచ్చిన లాటరీ టికెట్ తన వద్ద వుందని తెలిస్తే తనని నిలువునా చీల్చైనా ఆ టికెట్ పట్టుకుపోతాడు.

ఈ విషయం ఎలాగైనా అతడికి తెలియకుండా, తను జాగ్రత్తపడాలి అని నిర్ణయించుకొని స్ట్రెయిట్ గా నిలబడ్డాడు పురుషోత్తం.

"మా గేటు దగ్గర నిలబడి చూస్తే మీకు హార్ట్ ఎటాక్ వచ్చినట్టు వణికిపోతూ కన్పించారు. ఏమిటో చూసిపోదామని వచ్చాను." అన్నాడు లక్ష్మణరావు.

"అబ్బే! అదేమీ లేదే!" అన్నాడు పురుషోత్తం.

"మరి ఆ చెమటలు..."

"ఏమీ లేదండీ! కొంచెం ఉక్కబోసి చెమటలు పట్టాయి. అంతే!" అన్నాడు పురుషోత్తం, సాధ్యమైనంత క్లియర్ గా పదాలు ఉచ్చరిస్తూ.

అబద్ధం, అబద్ధం అన్నట్లు చల్లగా గాలి వీచింది.

లక్ష్మణరావు అనుమానంగా మరోసారి చూసి "సర్లెండి' నేను వస్తాను." అంటూ గేటు తీసుకొని తన ఇంటివైపు వెళ్ళిపోయాడు.

'వీడి దుంపతెగా! అనుమానాలతో వేపుకుతిన్నాడు దొంగవెధవ!' అని తిట్టుకుంటూ లోపలికి పోయి తలుపులు వేసుకొన్నాడు పురుషోత్తం.

# 2

తన ఇంట్లోకి వెళ్ళిపోయిన లక్ష్మణరావుకి ఏం చేయాలో పాలుపోలేదు క్షణంసేపు.

పుహాశేంది తనను చూసి కంగారుగా చేతులు వెనక్కి పెట్టుకునేటప్పుడు అతడి చేతిలోని వస్తువు తనకు లీలగా కనిపించింది. అప్పుడు దాని గురించి పెద్దగా అనుమానమేమీ రాలేదు కానీ, టీపాయ్‌మీద పడివున్న పేపర్‌లోని లాటరీ ఫలితాలు చూసాక ఓ రూపం యేర్పడుతోంది. దానికితోడు పుహాశేంది కంగారు, వొణుకు, అతడికి పట్టిన చెమటలు చూసాక తన అనుమానం నిజమేనని నిర్ధారణ అవుతోంది.

అంటే...తను ఊహించిందే నిజమైతే పుహాశేందికి లాటరీలో ఏదో ప్రైజు తగిలుండాలి!

తనా లాటరీ టికెట్ పుహాశేందినుండి సంపాదించ గలిగితే ఆ అదృష్టానికి తనే అధిపతి కాగలుగుతాడు... ఎలా?...

ఈ రాత్రికి పుహాశేంది ఇంట్లోకి ప్రవేశించి అతడికి స్పృహ పోగొట్టి ఇల్లంతా వెదికి ఆ టికెట్ సంపాదించ వచ్చు. కానీ, ఈలోగా ఆ టికెట్‌ను అతడు దాటించెయ్యడని నమ్మకమేమిటి? చటుక్కున ఓ అయిడియా వచ్చింది లక్ష్మణరావుకి.

వెంటనే ఫోన్ ఎత్తి ఓ నెంబర్ డయల్ చేసాడు. "హలో! దండేకర్! నేను లక్ష్మణరావుని మాట్లాడుతున్నాను. నీతో పని పడింది. పెద్ద పనే! నువ్వు త్వరగా బయలుదేరి మా ఇంటికి రావాలి! అవును. అర్జెంటే! నీకోసం ఎదురుచూస్తూంటాను." ఫోన్ పెట్టేసి వరం

డాలో కూర్చుని పుహశేంది ఇంటివైపు చూడసాగాడు.

పావుగంటలో దండేకర్ వచ్చాడు.

దండేకర్ ఆరడుగుల రెండంగుళాలు ఎత్తుంటాడు. గుబురు గడ్డం, ఒత్తయిన కనుబొమలు, చిందరవందరగా మొహంమీద పడేతల వెంట్రుకలతో బలిష్ఠంగా వుంటాడు. అతడి కళ్ళలో కాఠిన్యం, ముఖంలో క్రౌర్యం కొట్టొచ్చి నట్లు కనిపిస్తాయి.

లక్ష్మణరావు అతడికి విషయమంతా చెప్పాడు.

"ఒకవేళ అది లాటరీ టికెట్ కాకపోతే?" అనుమానించాడు దండేకర్.

"ఎందుకో నా సిక్స్త్ సెన్స్ తప్పనిసరిగా అదే అయి వుండాలని చెప్తోంది. అయినా, ప్రయత్నించటంలో తప్పేముంది?" అన్నాడు లక్ష్మణరావు.

"ఓ.కే! నీ మాట కాదనం దేనికి? మరి నా వాటా?"

"వచ్చినదాంట్లో ఫిఫ్టీ ఫిఫ్టీ." అన్నాడు.

"ఎగ్రీడ్! ఇంతకూ ఇప్పుడు నేను చేయాల్సిన పనేమిటి?" అడిగాడు దండేకర్.

## 3

లక్ష్మణరావు వెళ్ళగానే ఇంటిలోనికి పోయి తలుపులు మూసుకున్న పుహశేందికి మరో అరగంటవరకూ గుండెదడ తగ్గలేదు.

ముందు లాటరీ టికెట్ జేబులో పెట్టుకుని తరువాత ఆలోచించసాగాడు ఏం చేయాలా అని. లక్ష్మణరావుకి లాటరీ విషయం నిర్ధారణగా తెలియకపోయినా అనుమానం వచ్చిందని తెలుస్తోంది. లక్ష్మణరావు రెండుమూడుసార్లు జైలుకి కూడా వెళ్ళివచ్చాడు; ఏవో నేరాలుచేసి. అతడి

వెనుక ఏదో గ్యాంగ్ కూడా వున్నట్లుంది.

వాళ్ళు తనని బెదిరించో, చంపేసో ఆ టికెట్ దొంగి లించే అవకాశం వుంది .మరి దాన్నెలా కాపాడుకోవాలి?

ఆ టికెట్ లక్ష్మణరావు చేతిలో చిక్కిందంటే, తరు వాత ఆ టికెట్ తనదని నిరూపించుకోలేడు. ఈ ఊళ్లో టికెట్ కొనివుంటే, టికెట్ అమ్మినవాడి దగ్గర వుండే కౌంటర్ ఫాయిల్ లో తన పేరు, అడ్రస్ వుండటానికి అవకాశం వుండేది.

కానీ, ఒకసారి బస్ లో ఏదో ఊరు వెళుతుండగా కొన్నాడా టికెట్. మధ్యలో ఏదో ఊళ్ళో బస్ ఆగి నప్పుడు ఎవరో పట్టుకొచ్చారు. రూపాయి యిచ్చి ఓ టికెట్ ఇమ్మన్నాడు. వాడు తన పేరు అడిగాడు.

తను పేరు చెప్పేంతలో బస్ కదిలింది. వాడు వెంటనే టికెట్ చింపి ఇచ్చేసాడు. ఆ టికెట్ ఇప్పుడు చేయి జారిందంటే తనదని నిరూపించుకోవటానికి ఆధారాలేమీ లేవు. అది ఎవరి దగ్గరుంటే వాళ్ళకు డబ్బు చెందుతుంది.

యథాలాపంగా కిటికీవైపు తల త్రిప్పిన పురుషోత్తం ఉలిక్కిపడ్డాడు. ఎదురుగా గేటు దగ్గర నిల్చుని లక్ష్మణ రావు తన కిటికీవైపు చూస్తున్నాడు దీక్షగా. వెంటనే వెళ్ళి కిటికీ తలుపులన్నీ మూసి లైటు వేసాడు.

ఆ టికెట్ ని ఇంట్లోనే వుంచుకుంటే ఖచ్చితంగా లక్ష్మణరావు దానిని కాజేస్తాడు. తనింట్లో వుంచుకుని లాభంలేదు. రెండో కంటికి తెలియకుండా దాన్ని ఎక్కడైనా జాగ్రత్త చెయ్యాలి! ఎక్కడ?

బ్యాంక్ లాకర్ లో దాయవచ్చు. కానీ ఈ రోజు బ్యాంక్ లు శలవు. మరెలా?

తీవ్రంగా ఆలోచిస్తున్న పుహాశేందికి చటుక్కున ఓ అయిడియా వచ్చింది.

తనకు బాగా నమ్మకస్థుడైన ఓ స్నేహితుడున్నాడు. అతడి పేరు సుబ్బారావు. ఆ లాటరీ టికెట్ ఓ కవర్లో పెట్టి దాన్ని సీల్ చేసి అతడి చేతికిస్తే అది సురక్షితంగా వుంటుంది. రెండు రోజులు పోయాక అది తీసుకుని ఢిల్లీ వెళ్ళి డబ్బు తెచ్చుకోవచ్చు.

చాలాసేపు ఆ విషయంమీద ఆలోచించాడు పుహాశేంది, అలా చేయటం ఎంత సమంజసంగా వుంటుందా అని. ఎంత ఆలోచించినా అంత కంటే మంచి వుపాయం తట్టటం లేదు. వెంటనే అది అమలు పరిచాడు.

క్రొత్త కవరొకటి తీసుకుని లాటరీ టికెట్ అందులో వుంచి గమ్‌తో కవర్ అంటించాడు. దానికి సీల్ ఎలా వేయాలో అర్థం కాలేదు. కొంత సేపు ఆలోచించాక ఓ విషయం గుర్తుకు వచ్చి, వెంటనే లెటర్స్ బంచ్ తెచ్చి, దాన్లో ఎప్పుడో స్టేట్ బ్యాంక్ నుంచి వచ్చిన ఓ రిజిస్టర్డ్ లెటర్ తీశాడు. దానికి సీల్ వేసివున్న లక్కను వూడదీసి అగ్గిపుల్లతో వేడిచేసి, లాటరీ టికెట్ వుంచిన కవర్‌కి సీల్ చేశాడు. అంతా ఓసారి చూసుకుని సవ్యంగానే వుందని నిర్ధారించుకున్నాడు.

వీధివైపు నుండి వెళితే లక్ష్మణరావు చూస్తాడు. తన ప్రయత్నమంతా వృథా అయిపోతుంది. పెరటివైపునుండి వెనుక వీధిలోకి దారివుంది. అలా వెళితే లక్ష్మణరావుకి అనుమానం వుండదు.

కవర్ జేబులో పెట్టుకుని వెనుక తలుపులేసి మళ్ళీ దానికి తాళం వేసి వీధిలోకి వచ్చాడు.

ఒకసారి చుట్టూ పరికించాడు. అదిరిపడ్డాడు.

రోడ్డు వారగా వున్న కిళ్ళీ బడ్డీ దగ్గర ఓ వ్యక్తి సిగరెట్ కాలుస్తూ నిలబడ్డాడు. అతడిని అంతకు ముందు రెండు, మూడు సార్లు లక్ష్మణరావు ఇంటికి వచ్చినప్పుడు, ఒకసారి పోలీసులు వాన్ ఎక్కుతుండగానూ చూశాడు. అంటే...అప్పుడే టికెట్ కోసం వేట మొదలయిందన్న మాట. ఇతడు లక్ష్మణరావు మనిషేనా? లేక అతడిక్కడుండటం కేవలం కాకతాళీయమా?

ఆ వ్యక్తి పుహాంశేంది వైపు చూస్తున్నాడు.

ఇప్పుడు వెనక్కి తిరిగితే వాళ్ళకు మరింత అనుమానం కలిగించిన వాడవుతాడు. ధైర్యం కూడగట్టుకుని ముందుకు నడిచాడు. అక్కడకు దగ్గర్లో ఓ కాకా హోటల్ వుంది. ఆ హోటల్లోకి వెళుతూ వెనక్కి తిరిగి చూసాడు పుహాశేంది. ఆ వ్యక్తి తన వెనకే వస్తున్నాడు.

అంటే అతడు తప్పకుండా లక్ష్మణరావు మనిషే నన్న మాట. తనను వెంటాడటం వలన ఫలితం ఏమిటి? దౌర్జన్యంగా తన దగ్గరవున్న టికెట్ తీసుకుంటాడా?

తను జన సమ్మర్దం వున్న ప్రాంతంలో తిరుగుతున్నంతసేపూ తనకే ప్రమాదమూ వుండదు. ఎటు తిరిగీ ఒంటరిగా మాత్రం వాళ్ళకు చిక్కకూడదు.

హోటల్లో టీ త్రాగి బయటకు సిగరెట్ కొట్లో సిగరెట్ ప్యాకెట్ వక్కపొడి కొని, సిగరెట్ వెలిగించి, వక్కపొడి నములుతూ తిరిగి ఇంటి వేపు బయలుదేరాడు. లక్ష్మణరావు మనిషి తిరిగి తన వెంట పడటం ఓర కంటితో గమనించాడు.

గబగబా నడుచుకుంటూ ఇంటి తాళం తీసి లోపలకు

వెళ్ళి తలుపులు మూసేసాడు. కొంతసేపయ్యాక వంటగది కిటికీ తలుపులు కొద్దిగా తీసి చూసాడు. ఇంతకు ముందు తనను వెంబడించిన వ్యక్తి అదే కిళ్ళీ బడ్డీ దగ్గర నిల్చుని తన ఇంటివైపు చూస్తున్నాడు.

# 4

మరో కవర్ తీసి అందులో ఓ తెల్లకాగితం వుంచి ఆ కవర్ కూడా సీల్ చేసాడు పురుషోత్తం. టికెట్ వున్న కవర్ మడిచి సాక్స్‌లో పెట్టుకున్నాడు. కాగితం వున్న కవర్ జేబులో పెట్టుకున్నాడు.

పెరటి తలుపు తాళం వేసి రోడ్డుమీద వచ్చి ఓరగా చూసాడు. కిళ్ళీ బడ్డీ దగ్గర వ్యక్తి అలాగే నిలబడి వున్నాడు చిన్నగా నవ్వుకుంటూ ముందుకు నడవసాగాడు పురుషోత్తం. ఆ వ్యక్తికూడా పురుషోత్తం వెనకాలే బయలు దేరాడు.

వెనుక వస్తున్న వ్యక్తికి విసుగు పుట్టించాలని నాలు గైదు వీధులు అనవసరంగా తిరిగాడు పురుషోత్తం. అయినా అతడు వెంటాడటం మానలేదు. గాంధీనగర్‌కి ప్రవేశించే మలుపు తిరగ్గానే—రోడ్డు వారగా వున్న చెత్తకుండీ ఆకర్షించింది పురుషోత్తంని.

వెనుక వస్తున్న వ్యక్తి ఇంకా వీధి మలుపు తిరగలేదు. అటు ఇటు చూసాడు. వీధంతా నిర్మానుష్యంగా వుంది. తన నెవరూ గమనించటం లేదని నిర్ధారించుకుని చటుక్కున వొంగి సాక్స్‌లోనుండి టికెట్ ఉన్న కవర్ తీసి, చెత్తకుండీ దగ్గరకు వెళ్ళి కొద్దిగా చెత్త ప్రక్కకు తొలగించి ఆ మధ్యలో కవర్ పెట్టి పైన చెత్త కప్పేశాడు. మళ్ళీ ఏమీ తెలియని వాడిలా రోడ్డుమీద నడవ సాగాడు.

కొంతదూరం నడిచాక వెనక్కి తిరిగి చూశాడు. ఆ వ్యక్తి తనను 50 గజాల దూరంలో వెంబడిస్తున్నాడు.

# 5

పుహాళేందిని వెంబడిస్తున్న దండేకర్ కి కొంత సేపటికి విసుగు పుట్టింది. అతడు తనని తిప్పలు పెడుతున్నాడనిపించి, వెనక్కి తిరిగి వెళ్ళిపోదామనుకున్నాడు. కానీ ఇంత కష్టపడి బూడిదలో పోసిన పన్నీరవుతుందేమో నని ఓపికగా వెంటాడుతున్నాడు.

పుహాళేంది గాంధీనగర్ మలుపు తిరగ్గానే ప్రక్కనే వున్న కిళ్ళీ బడ్డీ దగ్గరకు సిగరెట్ల కోసం వెళ్ళాడు దండేకర్.

సిగరెట్ వెలిగించి, మళ్ళీ పుహాళేందిని వెంబడించ సాగాడు. కొంత సేపటికి పుహాళేంది ఒక ఇంటి ముందాగి తలుపు తట్టాడు. దండేకర్ ప్రహరీగోడ ప్రక్కనే నిలబడి చూడసాగాడు. కొద్ది నిముషాల తర్వాత తలుపు తెరచుకుంది. పుహాళేంది లోపలకు వెళ్ళగానే మళ్ళీ తలుపు మూసుకుంది.

బయట నిలబడి వున్న దండేకర్ పుహాళేంది బయటకు వచ్చేవరకూ వేచి వుందామనుకున్నాడు. కానీ ఈలోగా టికెట్ చేయి దాటి పోతుందేమో ననిపించింది. శబ్దం కాకుండా గేటుదాటి మెల్లెక్కి కిటికీ ప్రక్కగా నిలబడ్డాడు.

లక్ష్మణరావు ఆదేశం మేరకు పుహాళేంది జన సమ్మర్దం లేని ప్రాంతలో దొరికితే బలవంతంగా అతడి దగ్గర్నుంచి లాటరీ టికెట్ తీసుకోవాలి! కాని పుహాళేంది తెలివిగా తప్పించుకుంటున్నాడు.

ఇంతలో పురుషోత్తం కంఠం వినిపిస్తోంది లోపలినుంచి నెమ్మదిగా. "నువ్వీ కవర్ ప్రాణపదంగా దాచుకోవాలి. ఓ రెండు రోజుల తర్వాత మళ్ళీ తీసుకుంటాను. నేను తప్ప ఎవరడిగినా ఇది ఇవ్వకూడదు. నీ దగ్గర సురక్షితంగా దాచినందుకు నీకు ప్రతిఫలంకూడా ఇస్తాను."

"ఇంతకూ ఏముంది ఇందులో?" అడిగాడు రెండో అతను.

"అది ప్రస్తుతానికి రహస్యం. రెండు రోజుల తర్వాత నీ కన్ని వివరాలు చెప్తాను. చాల జాగ్రత్తగా వుంచు నేను వస్తాను."

ఆ మాటలు వినగానే దండేకర్ చటుక్కున గేటు దాటి రోడ్డుమీదకు వచ్చేసాడు.

సో, అది ఖచ్చితంగా లాటరీ టికట్టే అయివుంటుంది. ఇప్పుడు చేతులు మారింది. ఇక తమకు పురుషోత్తంతో పని లేదు. ముందీ విషయం లక్ష్మణరావుకి చెప్పి తర్వాత కార్యక్రమం నిర్ణయించాలి! అనుకుంటూ లక్ష్మణరావు దగ్గరకు బయలుదేరాడు దండేకర్.

## 6

సుబ్బారావు ఇంటినుండి బయటకు వచ్చిన పురుషోత్తం ఎక్కడా తనను వెంటాడిన వ్యక్తి కనిపించకపోవటంతో తేలికగా నిట్టూర్చాడు. అంత తేలికగా ఆ వ్యక్తి తన ట్రాప్‌లో పడతా డనుకోలేదు. వెంటనే గాంధీనగర్ రోడ్డు ఎక్కాడు.

టికెట్ దాచిన చెత్తకుండీ దగ్గరకు వెళ్ళాడు. ఆ కుండీని చూడగానే గుండె ఝల్లుమంది పురుషోత్తంకి. తను భూమి లోపలకు దిగిపోతున్నట్లు ఫీలయ్యాడు. చెత్తకుండీ

అంతా కలికినట్లు స్పష్టంగా కనిపిస్తోంది. అదురుతున్న గుండెలతో షండీలో చెయ్యిపెట్టి తను కవర్ వుంచిన ప్రదేశంలో వెదికాడు. లేదు!

పిచ్చిపట్టినవాడిలా షండీలోని చెత్తనంతా బయటకు తీసేసాడు. కూర్చుని మొత్తమంతా వెదకసాగాడు.

ఇంతలో ఏమైపోయింది? తను సుబ్బారావు యింటికి వెళ్ళి రావటానికి దాదాపు అరగంట పట్టి వుంటుంది. ఈ లోపులో ఎవరు దొంగిలించారు?

కవర్ అందులో పెట్టేటప్పటికి దండేకర్ ఆ వీధి మలుపు తిరగలేదు. వీధిలో ఎవరైనా చూస్తున్నారేమోనని తను ముందే జాగ్రత్తగా వాచ్ చేసాడు. ఎవరూ లేరని నిర్ధారించుకున్నాకే ఆ కవర్ అందులో వుంచాడు.

ఒకవేళ దండేకర్ ఎక్కడైనా దాక్కుని తనని గమనించాడా?

అలా జరిగివుండదు. తను షండీ దగ్గరనుంచి వెళ్ళాక కూడా అతడు తన వెనుకే ఫాలో అయ్యాడు. అందులో పెట్టటం చూసివుంటే—మళ్ళీ తన వెనుక యెందుకు పడతాడు? తనను మభ్యపెట్టటానికి ఆ విధంగా చేసాడు?

లేక లక్ష్మణరావు అదృశ్యంగా వుండి తనను వెంబడిస్తున్నాడా? వీళ్ళిద్దరూ కాక మరెవరైనా టికెట్ అందులో వుంచటం చూసి తస్కరించారా?

పదిలక్షలు చేయి దాటిపోయాయనేసరికి పుహళేందికి ఏడుపు ముంచుకొచ్చింది. అంతా వెదికినా ఆ కవర్ కనిపించలేదు.

నీట్‌గా డ్రెస్ చేసుకున్న వ్యక్తి చెత్తకుండీ కెలుకుతుండేసరికి వీధిలో వెళుతున్న జనం ఒక్కొక్కరే అతడి

చుట్టూ పోగవసాగారు.

"దేనికి సార్! వెదుకుతున్నారు?" అడిగాడు ఓ వ్యక్తి జనంలోంచి.

వెర్రివాడిలా ఆ ప్రశ్న అడిగిన వ్యక్తివైపు చూసాడు పుహాశేంది. అతడికి మతి పోయినట్లుంది. "ఏం! నువ్వా వెదుకుతావా?" అన్నాడు తిక్కగా.

వీడెవడో పిచ్చివాడిలా వున్నాడనుకుని జనం తలో మాటా అంటూ వెళ్ళిపోయారు.

అంతా ఖాళీ అయ్యాక పుహాశేంది వేదిక దిగి నిరాశగా లేచాడు. అంతా తగ్గుముఖంగా వెదికి నిరాశగా లేచాడు పుహాశేంది.

తనపై తనకే ఏదో తెలియని కసి, క్రోధం, ద్వేషం పుట్టుకొచ్చాయి. గమ్యం తెలియని బాటసారిలా రోడ్లన్నీ తిరగసాగాడు.

అలా రోడ్లన్నీ తిరుగుతున్న పుహాశేంది దృష్టిని రోడ్డు ప్రక్క ఓ దృశ్యం ఆకర్షించింది.

ఆ ప్రక్కనవున్న చెత్తకుండీ దగ్గర ఇద్దరు పిల్లలు పదేళ్ళ లోపువాళ్ళు—జిడ్డు ఓడుతున్న శరీరాలతో, తైల సంస్కారంలేని జుట్టుతో, ఒంటిమీద చొక్కాలు లేకుండా—ఒట్టి నిక్కర్లతో కుండీలోని చెత్తంతా క్రింద పారబోసి అందులో ఏదో వెదుకుతున్నారు.

పుహాశేంది వాళ్ళ దగ్గరకు వెళ్ళి "ఏమిటి బాబూ! వెదుకుతున్నారు?" అన్నాడు.

"కాయితాలు" అన్నాడో కుర్రాడు.

అప్పుడు చూసాడు పుహాశేంది, వాళ్ళ ప్రక్కనే వున్న రెండు గోనె సంచులు, వాటినిండా వున్న చెత్త కాగితాలనూ.

"ఏం చేస్తారు మీరు వీటిని?"

"గోవిందయ్యగారికి అమ్ముతాము. ఆయన డబ్బు లిత్తారు" అన్నాడు మళ్ళీ ఆ కుర్రాడు.

పురుషోత్తం చటుక్కున బుర్రలో ఏదో మెరిసింది. జేబులోంచి ఓ రూపాయి కాగితం తీసి, ఆ కుర్రాడి చేతి కిచ్చి "ఆ ప్రక్కవీధిలో వున్న కుండీలో కాగితాలు ఎవరు తీసారు? అవికూడా మీరే ఏరుకున్నారు కదూ?" అన్నాడు.

ఆ కుర్రాడు తల అడ్డంగా తిప్పి, "అ కూడికి మేం ఎల్లకూడదు బాబూ! అది సత్తిగాడు, ఆడి తమ్ముడు ఏరు కుంటారు" అన్నాడు.

"వాళ్ళు ఎక్కడుంటారు?" అనునయంగా అడిగాడు పురుషోత్తం.

"ఇందాకే ఆళ్ళింటికి ఎల్లిపోయారు."

"వాళ్ళ ఇల్లు చూపిస్తే మీకు ఇంకా డబ్బులిస్తాను" అని వాళ్ళను ఆశపెట్టాడు.

పావుగంట తర్వాత వాళ్ళతోపాటు నడిచి మురికి పేటలో వున్న సత్తిగాడి గుడిసె కనుక్కున్నాడు. ఇల్లు చూపించి, పురుషోత్తం ఇచ్చిన డబ్బు తీసుకుని ఆ కుర్రాళ్లు వెళ్ళిపోయారు. సత్తిగాడు లోపల భోజనం చేస్తున్నాడు. అది పూర్తయ్యేవరకూ బయట నిలబడివున్నాడు.

భోజనం పూర్తయ్యాక సత్తిగాడు బయటకు వచ్చాడు. వాడికి పదిహేను సంవత్సరాలుంటాయి. "చూడు బాబూ! గాంధీనగర్ మొదటివీధిలో వున్న చెత్తకుండీలోని కాగితాలు ఏరుకున్నది నువ్వే కదూ?" నెమ్మదిగా అడిగాడు వాడిని.

తలూపాడు ఆ కుర్రాడు, భయంగా.

"ఆ కాగితాలు ఏవి? ఎక్కడున్నాయి?" ఆత్రుతగా అడిగాడు పుహాశేంది.

"ఎందుకు?" అనుమానంగా అడిగాడు సత్తిగాడు.

వాడి ఎదురుప్రశ్నకు చిర్రెత్తుకొచ్చింది పుహాశేందికి. వేలెడులేడు వెధవ. వీడికెందు కిన్ని ఆరాలు? అనుకున్నాడు. కానీ, కోపానికిది సమయం కాదు. మంచిగానే పని పూర్తి చేసుకోవాలి అని నిర్ణయించుకున్నాడు పుహాశేంది.

"ఓ ముఖ్యమైన ఉత్తరం చూసుకోకుండా మా పని మనిషి చెత్తకుండీలో పారేసింది. అది చాలా అవసరం. దానికోసం వచ్చాను" అన్నాడు.

"ఇందాక నేను, మా కోటిగాడు పోగేసిన కాయితాలు రెండు సంచులయితే పట్టుకెళ్ళి, గోయిందయ్యగారికిచ్చేసి డబ్బులు తెచ్చుకున్నాం" అన్నాడు సత్తిగాడు చల్లగా.

"గోవిందయ్యగారిల్లెక్కడ?" అన్నాడు పుహాశేంది.

"అబ్బో! శానా దూరం" అన్నాడు వాడు.

"ఆ ఇల్లు చూపిస్తే, నీకు ఐదురూపాయ లిస్తాను" అని ఆశ పెట్టాడు పుహాశేంది.

సత్తిగాడు సంతోషంగా తలూపాడు, ఐదు రూపాయలు మాట వినగానే.

పదినిముషాల తర్వాత "అదే గోయిందయ్యగారిల్లు" ఇల్లు చూపిస్తూ చెప్పాడు సత్తిగాడు.

జేబులోంచి ఐదురూపాయల నోటు తీసి వాడి చేతిలో పెట్టి "నువ్వెళ్ళిపో!" అన్నాడు పుహాశేంది.

వాడు హుషారుగా వెళ్ళిపోయాడు.

# 7

మిట్టమధ్యాహ్నం తలుపు తట్టిన చప్పుడు విని వెళ్ళి తలుపు తీసాడు సుబ్బారావు. బయట ఇద్దరు ఆగంతకులు నిలబడివున్నారు.

"ఎవరు మీరు? ఏం కావాలి?" అడిగాడు సుబ్బారావు.

వాళ్ళు సుబ్బారావుని నెట్టుకుంటూ లోపలకు ప్రవేశించారు.

"ఏమిటీ... దౌర్జ..." దండేకర్ చేతిలో నల్లగా నిగనిగలాడుతున్న పిస్తోల్ చూసేసరికి సుబ్బారావు నోరు తక్కున మూత పడిపోయింది.

లక్ష్మణరావు తలుపు మూసి, "అలా కూర్చో!" అని ఆజ్ఞాపించాడు సుబ్బారావుని.

తన ఇంటికి వచ్చి తననే కూర్చోమని ఆజ్ఞాపిస్తున్న వాళ్ళను ఏమనాలో అర్థంకాలేదు సుబ్బారావుకి. వాళ్ళ అవతారాలు చూస్తుంటే ఎంతకైనా తెగించే మనుషుల్లా కనిపిస్తున్నారు. నోరు మాట్లాడకుండా కుర్చీలో కూలబడ్డాడు, అదురుతున్న గుండెలతో.

"మమ్మల్ని చూసి భయపడకు! మాకు కావలసింది మర్యాదగా ఇచ్చేస్తే నిన్నేమీ చేయకుండా వెళ్ళిపోతాం. అలా ఇవ్వటానికి నీకేమైనా అభ్యంతరం వుంటే ముందే చెప్పేసెయి. నిరభ్యంతరంగా నిన్ను చంపేసి ఆ వస్తువు తీసుకుపోతాం" అన్నాడు లక్ష్మణరావు మరో కుర్చీలో కూర్చుంటూ.

"మీకు కావలసిందేమిటి?" నీరసంగా అడిగాడు సుబ్బారావు.

"పుహాశేంది నీకిచ్చి జాగ్రత్తగా దాయమన్న కవర్

మాకిచ్చేయ్! మా దారిన మేం పోతాం!'' అన్నాడు లక్ష్మణరావు.

సుబ్బారావు వెంటనే జవాబివ్వలేదు. ఏముంది ఆ కవర్‌లో? ప్రాణప్రదంగా దాయమని ఇచ్చాడు పుహళేంది. అందులో ఏముందో చూద్దామనిపించినా, సీల్డ్ కవర్ కావటంవలన వీలుపడలేదు. ఇప్పుడు వీళ్ళెవరో దౌర్జన్యంగా ఆ కవర్ పట్టుకుపోవటానికి వచ్చారు. ఇవ్వనంటే, ఏం చేస్తారు? నిజంగా చంపేస్తారా?

దండేకర్ వైపు చూసాడు సుబ్బారావు. పిస్తోల్ తన రేపే గురిపెట్టి నిల్చున్నాడు. ఏ క్షణంలోనైనా ప్రేలటానికి సిద్ధంగా వుంది పిస్తోల్. దండేకర్ కళ్ళల్లో కాఠిన్యం చూసేసరికి నీరుకారిపోయాడు సుబ్బారావు. తప్పించుకునే మార్గంలేదు. ఏం చేయాలి?

''కవర్ ఇచ్చిన తర్వాత కొంతసేపటికి మళ్ళీ పుహళేంది వచ్చి పట్టుకుపోయాడు'' అన్నాడు.

ఫట్‌మని సుబ్బారావు గెడ్డంమీద ఒకదెబ్బ కొట్టాడు లక్ష్మణరావు. పళ్ళు కదిలి రక్తం కారుతోంది నోటినుంచి.

''అనవసరంగా మా టైమ్ వేస్ట్ చేయకు. కవర్ ఎక్కడుంచిదో వెంటనే చెప్పకపోతే నిన్ను చంపి మరీ తీసుకుపోతాం. సరిగ్గా అయిదు నిముషాలు టైమిస్తున్నాను. ఈలోపు ఆ కవర్ తీసి మాకిచ్చి చావునుంచి తప్పించుకో!'' అన్నాడు లక్ష్మణరావు కఠినంగా.

నాలుగు నిముషాలు గడిచాయి ఆ గదిలో, అతి భారంగా.

అయిదో నిముషంలో సుబ్బారావు లేచి కవర్ దాచిన ట్రంక్‌పెట్టెవైపు నడిచాడు.

# 8

"నా పేరు భజ గోవిందం."

"కూర్చోండి. ఏం కావాలి మీకు?" అడిగాడు గో
దయ్య.

"మీరు పేపర్ స్క్రాప్ బిజినెస్ చేస్తున్నారు కదూ
అడిగాడు భజగోవిందంగా తన పేరు చెప్పుకున్న ఫ
ణీంద్ర.

"ఔను" జవాబిచ్చాడు గోవిందయ్య. అతడి వయ
50 సంవత్సరాలుంటుంది. స్ఫోటకం మచ్చలతో చ
వికృతంగా వుందతని రూపం,

"ఈ రోజు మధ్యాహ్నం సత్తి, కోటి అనే ఇ
కుర్రాళ్ళు తీసుకొచ్చి మీ కమ్మిన స్క్రాప్‌లో ఓ
కవర్ వచ్చింది. ఆ కవర్ నాదే! దయచేసి కొంచెం
ఆ కవర్ నా కిప్పించగలరా!" చాలా మర్యాదగా
గాడు పుహ శేంద్ర.

"ఓహో! అదా! ఇంతకుముందే ఆ స్క్రాప్
రూమ్‌లో పోసేటప్పుడు ఆ కవర్ క్రొత్తగా అని
తీసి చూసాను. ఓపెన్ చేసి చూద్దామనుకునే, ప
ఒత్తిడిలో మర్చిపోయాను" అన్నాడు గోవిందయ్య.

తేలికగా ఊపిరి పీల్చుకున్నాడు పుహ శేంద్ర. ఆ క
దొరకటమే కాక అందులో ఏముందో గోవింద
చూడలేదు.

"దయచేసి ఆ కవర్ నాకిచ్చేస్తారా?"

"ఏముంది అందులో?" అడిగాడు గోవిందయ్య క
హాలంగా.

గుండెల్లో రాయి పడింది పుహ శేంద్రకి. ఏమని చెప

చెప్పినా నమ్మేలా చెప్పాలి? హరికథ మొదలు
ాడు ప్రహ్లాద శేంది.

"నాకు పెళ్ళయి పదేళ్ళవుతోంది. నా భార్య, నేను
లా అన్యోన్యంగా వుంటున్నాం. నిన్న ఆఫీస్‌కి ఓ
క్తి వచ్చి నా పెళ్ళికి పూర్వం నా భార్య చెడు తిరు
ళ్ళ తిరిగిందని, శీలంకూడా పాడుచేసుకుందని చెప్పాడు.

"నాకు వెత్తికోపం వచ్చి ఆ చెప్పినవాడిని చాచి
పేళాయ కొట్టాను. వాడు విసురుగా లేచి, "పెళ్ళాం
ౙలో పడి నా మాట ఎలా నమ్ముతారు? మీ భార్య
సిన కొన్ని ప్రేమలేఖలుకూడా వున్నాయి నా దగ్గర.
స్చికి ఒకటి మీ ఇంటికి రేపు పంపిస్తాను" అని వెళ్ళి
యాడు.

ఈరోజు ఉదయం నేను బాత్‌రూంలో స్నానం
స్తుండగా బయటనుంచి మా ఆవిడ ఎవరో ఓ కవర్
ి వెళ్ళారని టేబుల్‌మీద పెడుతున్నానని చెప్పింది.
ు స్నానంచేసి వెళ్లేసరకి టేబుల్‌మీద కవర్ లేదు.
యిందని నా భార్యను అడిగాను. ఆమె తనా కవర్
బుల్‌మీద పెట్టి వంటింట్లో పని చూసుకుంటున్నానని
ర్ ఏమైందో తనకు తెలియదని అంది.

"మధ్యాహ్నం పనిమనిషి వచ్చినప్పుడు దాన్నడిగాను.
యం తను గది ఊడుస్తుండగా ఆ కవర్ నేలమీద
పించిందట. అదేదో కాగితం పనికిరానిది క్రింద పడేసా
ుకుని అదికూడా తుడిచి చెత్తతోపాటు కుండీలో
ూబోసిందట.

"వెంటనే నేను మా వీధిలో వున్న కుండీదగ్గరకు వెళ్ళి
స్తే అందులో కవర్ లేదు. ఇంతలో ఆ వీధిలో చెత్త

కాగితాలు ఏరుకుంటున్న కుర్రాళ్ళు కనిపించారు. వాళ్ళను అడిగితే అంతకుముందే తాము ఆ కుండీలోని కాగితాలన్నీ ఏరుకుని, సంచీ నిండిపోవటంవలన మీకు తీసుకొచ్చి అమ్మేసామని చెప్పారు.

"నేను వెంటనే ఆ కవర్‌లో వున్న నా భార్య తన ప్రియుడికి వ్రాసిన ఉత్తరం చదవాలి. కోర్టులో అది చూపించి, నా భార్యనుంచి విడాకులు తీసుకోవాలనుకుంటున్నాను" అన్నాడు పుహాళేంది తన హారికథకు 'గోవిందోహరి' కొట్టేస్తూ.

గోవిందయ్య కొంతసేపాగి "భజగోవిందంగారూ!" అన్నాడు.

పుహాళేంది గోవిందయ్య ఎవర్నో పిలుస్తున్నాడనుకుని వెనక్కు తిరిగాడు. వెంటనే అతడికి తన పేరు భజగోవిందం అని చెప్పినట్లు గుర్తువచ్చి, గోవిందయ్యవైపు తిరిగి 'యస్' అన్నాడు హుందాగా.

"ఆ కవర్ మీ కివ్వటానికి కొంత ఖర్చవుతుంది" అన్నాడు.

"ఎంత కావాలి?" అడిగాడు పుహాళేంది.

"వెయ్యిరూపాయలిస్తే మీ కవర్ మీ కిచ్చేస్తాను" అన్నాడు గోవిందయ్య.

పుహాళేంది కుర్చీలోంచి లేచి నిలబడ్డాడు. "ఆ కవర్ విషయమై ఒక్క పైసాకూడా ఖర్చుపెట్ట దలచుకోలేదు. నా భార్యను ఎలాగూ వదిలేయ దల్చుకున్నాను. దానికి విడాకులే యివ్వనక్కరలేదు. పుట్టింటికి పంపేస్తాను. మీరడిగిన డబ్బు ఇవ్వటానికి నేను సిద్ధపడనందుకు సారీ!" అంటూ గుమ్మంవైపు నడిచాడు.

నిజానికి ఆ కవర్‌కి ఎంతడిగినా ఇవ్వటానికి సిద్ధంగా వున్నాడు పురుషోత్తం. అలాగని ఎదుటి వ్యక్తికి తెలిస్తే, అందులో వున్నదేమిటనే అనుమానం వచ్చేస్తుంది. అందుకే బేటు చేసాడు.

"చూడండి భుజగోవిందంగారూ! ఆ కవర్ జాగ్రత్తగా దాచినందుకు నాకు ఏదో ప్రతిఫలం ఇవ్వటం ధర్మం. ఏమంటారు?" కాళ్ళబేరానికి వచ్చాడు గోవిందయ్య.

"ఆల్ రైట్! వందరూపాయలు ఇస్తాను. ఆ కవర్ ఇలా యివ్వండి," అన్నాడు పురుషోత్తం.

గోవిందయ్య టేబుల్ సొరుగునుండి కవర్ తీసి "ముందు డబ్బు ఇవ్వండి" అన్నాడు.

పురుషోత్తంకి ఆ కవర్ చూడగానే గుండె వేగం హెచ్చింది. అదే కవర్!

వెంటనే జేబులోంచి వంద కాగితం తీసి గోవిందయ్య చేతిలో పెట్టి కవర్ తీసుకున్నాడు.

గోవిందయ్య తన అదృష్టానికి మురిసిపోయాడు.

## 9

కవర్ జేబులో పెట్టుకుని రోడ్డుమీదకు వచ్చాడు పురుషోత్తం.

అష్టకష్టాలు పడి ఎలాగైతేనేం తన టికెట్ తను సంపాదించుకున్నాడు. లక్ష్మణరావు వాళ్ళు యెలాగూ తనమీద పడరు. బహుశా ఈ రాత్రికి సుబ్బారావుమీద దాడి జరపొచ్చు. సుబ్బారావుకేమీ ప్రమాదం జరగకూడదని మనసులోనే కనిపించని దేవుడికి మొక్కుకున్నాడు.

ఫాంట్ కుడిజేబులో కవర్ పెట్టుకుని ఆ జేబుమీద చేయిపెట్టుకుని బీసెంట్ రోడ్డులో నడుస్తున్నాడు పురు

శేంది. రేపు ఏదైనా బ్యాంక్‌కి వెళ్ళి ఓ లాకర్ తీసుకుని ప్రస్తుతానికి టికెట్ అందులో భద్రపరచాలి.

ఇంతలో పుహాళేంది నడుంచుట్టూ ఓ చేయి పడింది. ఉలిక్కిపడి తలెత్తి ఆ చేయితాలూకు వ్యక్తిని చూసాడు.

ఎవరో అపరిచిత వ్యక్తి నల్లని సూట్‌లో, కళ్ళకు గాగుల్స్‌తో, ఫెల్ట్ హేట్‌తో పుహాళేంది నడుంమీద చేయివేసి అతడి ప్రక్కనే నడుస్తున్నాడు.

"ఎవరు మీరు?" వొణుకుతున్న కంఠంతో ఓ చేయి కవర్‌వున్న జేబుమీద గట్టిగా నొక్కి అడిగాడు పుహాశేంది.

ఆ వ్యక్తి నవ్వి, "నా పేరు దండేకర్. ఉదయం నిన్ను వెంటాడిన వ్యక్తిని నేనే!" అన్నాడు.

పుహాశేంది గుండెల్లో రైళ్ళు పరిగెట్టాయి. వీడు మళ్ళీ తన వెనుక పడ్డాడేం? సుబ్బారావు ఇంట్లో తను కవర్ గురించి చెప్తూండగా, కిటికీ ప్రక్కనీడ చూసి ఇతడు అంతా విన్నాడనుకున్నాడు. వింటే మళ్ళీ తన వెనుక ఎందుకు పడ్డట్టు?

"ఏం కావాలి మీకు? ఎందుకు నన్నిలా వెంటాడు తున్నారు?" అసహనంగా అడిగాడు.

ఇద్దరూ రోడ్డుమీద నడుస్తూనే మాట్లాడుకుంటున్నారు. చూసేవాళ్ళకు వాళ్ళిద్దరూ ప్రాణస్నేహితుల్లా కనిపిస్తారు.

"లాటరీ టికెట్ వున్న కవర్ మర్యాదగా మా కిచ్చేయ్. లేకపోతే నిండు ప్రాణాలు పోగొట్టుకుంటావ్?" అన్నాడు దండేకర్.

"నేను కొనుక్కున్న లాటరీ టికెట్‌కి ప్రైజు తగిలితే అది మీ కెందుకివ్వాలి?" రోషంగా అడిగాడు పుహాశేంది.

దండేకర్ చిన్నగా నవ్వాడు. "న్యాయానికి మంచి చెడుతో పనిలేదు బ్రదర్! అది దౌర్జన్యానికే తల ఒగ్గుతుంది ఎప్పుడూ. దౌర్జన్యానికి మించిన శక్తి ఈ ప్రపంచంలో లేదు. మా దౌర్జన్యానికి లొంగి ఆ టికెట్ మాకు అప్పగించు. లేకపోతే..."

పుహళేంది డొక్కలో ఏదో గుచ్చుకున్నట్లయింది. తల త్రిప్పి చూసాడు. దండేకర్ చేతిలో నల్లని పిస్తోల్ పుహళేంది డొక్కలో గుచ్చుకుని వుంది. దండేకర్ వ్రేలు ట్రిగ్గర్ మీద బిగుసుకుని వుంది.

"...లేకపోతే, అనవసరంగా దీనికి బలి అయిపోతావు. హత్యలు చేయటం నాకేమీ కొత్తకాదు!" అన్నాడు దండేకర్.

పుహళేంది నీరుకారిపోయాడు. తన్ను చంపయినా ఆ టికెట్ చేజిక్కించుకునేలా వున్నాడు వీడు. ఆ ఊహ రావటంతోనే టికెట్ వున్న జేబుమీద చేయి మరింత బిగుసుకుపోయింది.

"ఆ టికెట్ ఓ కవర్‌లో పెట్టి, నా స్నేహితుడు సుబ్బారావుకిచ్చాను దాయమని" అన్నాడు.

డొక్కలో పిస్తోల్ బలంగా గుచ్చుకుంది.

"ఇక అబద్ధాలు, నాటకాలు కట్టిపెట్టటం మంచిది బ్రదర్! మీ సుబ్బారావు కిచ్చి దాచమన్న తెల్లకాగితం ఇందాకే మా చేతికి చిక్కింది. అప్పట్నుంచీ లక్ష్మణరావు, నేను నీకోసం ఊరంతా గాలిస్తున్నాం. ఇప్పటికి దొరికావు. నీ కుడి జేబులో వున్న ఆ టికెట్ తీసి ఇచ్చేయ్!" అన్నాడు దండేకర్.

పుహళేంది అదిరిపోయాడు. వీడెవడో అసాధ్యుడిలా

ఉన్నాడు. లేక మాయలు, మంత్రాలు ఏమైనా వచ్చా? జేబులో వున్న కవర్ సంగతి వీడికెలా తెలిసింది? అదీ పడిజేబులో ఉన్నట్టు?

"నాకెలా తెలిసిందని ఆశ్చర్యపోతున్నావా? నీ కంగారే నిన్ను పట్టించింది. అస్తమానూ చేయి ఆ జేబు మీద వేసుకుంటుంటే తెలియక ఏమవుతుంది?" అన్నాడు దండేకర్.

అప్పటికి ఇద్దరూ బాగా జనసమ్మర్దం వున్న ప్రదేశం లోకి వచ్చేసారు. పుహాశేందికి వాడినెలా తప్పించుకోవాలో అర్థంకావటంలేదు.

ఇంతలో ఎదురుగా ఓ అందమైన ఇరవై ఏళ్ళ యువతి వస్తోంది. ఆమెను చూడగానే చటుక్కున ఓ ఆలోచన మెరిసింది పుహాశేందికి.

ఆ యువతి వీళ్ళ దగ్గరకు రాగానే పుహాశేంది విజిల్ వేసాడు. ఆ యువతి పుహాశేందివైపు చూసింది. పుహాశేంది వెంటనే కన్నుకొట్టాడు.

ఆ యువతి ముఖం ఎర్రగా మారిపోయింది. వెంటనే కాలినున్న జోడుతీసి ఫెడీల్‌మని పుహాశేంది చెంపమీద కొట్టి, నోటికొచ్చినట్లు తిట్టసాగింది, పెద్ద నోరుతో.

ఆ అల్లరికి రోడ్డుమీద జనం వీళ్ళ ముగ్గురి చుట్టూ మూగ సాగారు. ఇదంతా చూసి దండేకర్ కంగారుపడ్డాడు. అంతమంది జనం గుంపుగా పోగవటంవలన తప్పనిసరిగా పిస్తోల్ పుహాశేంది నడుంమీదనుంచి ఉపసంహరించి జేబులో పెట్టుకున్నాడు.

ఆ యువతి జనం పోగవటం చూసి ఇంకా రెచ్చిపోయి పుహాశేందిని, దండేకర్‌ని కలిపి, నోటికొచ్చినట్లు

తిట్టసాగింది. ఆమె అరుపుకు జనం ఇంకా పోగవ సాగారు. ట్రాఫిక్ ఆగిపోయింది.

అక్కడ మూగిన జనం తలా ఒక మాటా అంటున్నారు. అంతా వీళ్ళని తిట్టే సందడిలో వుండగా పుహాశేంది మెల్లగా దండేకర్ నుంచి తప్పించుకుని ఆ గుంపులో కలిసిపోయి బయటపడ్డాడు.

# 10

జనం మధ్యలో చిక్కుబడిపోయిన దండేకర్ పుహాశేందికోసం చూసాడు. అతడెక్కడా కనిపించలేదు. ఈసారి చేజారిపోతే ఇక తమకా టికెట్ దొరకదు. తమ శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరవుతుంది.

మూగిన జనంలో ఎవరు ఎవరిని తిడుతున్నారో అర్థం కావటంలేదు. ఆ యువతి కూడా కొంతసేపు తిట్టి తన దారిన తాను వెళ్ళిపోయింది. ఆ యువతి వెళ్ళిపోగానే దండేకర్ కూడా ఆ గుంపులోంచి బయటపడ్డాడు.

పుహాశేందికోసం చుట్టూ చూసాడు. అతడు ఆ బజార్ మలుపు తిరుగుతూ కనిపించాడు. పరుగులాంటి నడకతో అతడిని వెంబడించసాగాడు దండేకర్.

కొంతదూరం వెళ్ళేసరికి దండేకర్ కి మారువేషంలో వున్న లక్ష్మణరావు కనిపించాడు.

"పుహాశేంది కనిపించాడా?" అడిగాడు లక్ష్మణరావు.

"నిలబడి మాట్లాడుకునే వ్యవధిలేదు. నడుస్తూ దారిలో అంతా చెప్తాను. రా!" అని నడుస్తూ అంతా చెప్పుకొచ్చాడు. కొంతదూరంలో వెళ్తున్న పుహాశేందిని కూడా చూపించాడు.

"ఆల్ రైట్! వీడి సంగతి నేను చూసుకుంటాను.

వ్వు రైల్వేస్టేషన్ కు వెళ్ళు. ధనపతి బంగారంతో ఎక్స్
ప్రెస్ లో వస్తున్నాడు. వెళ్ళి రిసీవ్ చేసుకుని రూమ్ కి
సుకురా!'' అన్నాడు లక్ష్మణరావు.

దండేకర్ వెళ్ళిపోయాడు.

లక్ష్మణరావు పుహాశేందిని తన దృష్టిపథంలోంచి తప్పుకుపోకుండా వెంటాడసాగాడు.

పుహాశేంది రెండుమూడు వీధులు తిరిగి గవర్నర్ పేట సెంటర్ కి వచ్చాడు. మధ్యమధ్య వెనక్కి తిరిగి చూసుకుంటున్నాడు, దండేకర్ మళ్ళీ వెంటపడుతున్నాడేమోనని. కానీ, తన వెనుక వస్తున్న లక్ష్మణరావుని గమనించలేదు, మారువేషంలో వుండటంవలన. చేత్తో కుడిజేబుని తడుముకుంటున్నాడు చీటికి, మాటికీ.

గవర్నర్ పేట సెంటర్ లో జనం హడావుడిగా అటు ఇటు తిరుగుతున్నారు, ఎవరి పనుల తొందర్లో వాళ్ళు.

లక్ష్మణరావు గబగబా నడిచి పుహాశేందిని చేరుకుని వెనుకగా వెళ్ళి అతడికి డాష్ ఇచ్చాడు.

పుహాశేంది తూలిపడబోయి తమాయించుకున్నాడు. వెంటనే ఏదో అనుమానం వచ్చి కుడిజేబు తడుముకున్నాడు. జేబులో కవర్ తోపాటు మరేదో ఎత్తుగా తగిలింది.

ఇంతలో లక్ష్మణరావు పుహాశేంది చేయిపట్టుకుని 'దొంగ, దొంగ' అని గట్టిగా అరిచాడు. ఆ గొంతునిబట్టి గుర్తించాడు పుహాశేంది, లక్ష్మణరావుని.

రోడ్డుమీద హడావుడిగా వెళ్తున్న జనమంతా వీళ్ళవైపు చూశారు.

''దొంగవెధవ! నా పర్స్ కొట్టేసాడు!'' ఇంకా అరు

స్తున్నాడు లక్ష్మణరావు.

పుహళేందికి క్షణంసేపు ఏం జరుగుతోందో అర్థం కాలేదు. అర్థం అయ్యాక 'అబద్ధం' అని కాయశక్తులా అరచాడు.

"నిజమండీ! కావాలంటే వాడి జేబులు వెదకండి. నా పర్స్, దాంతో పాటు ఓ సీల్డ్ కవర్ కూడా ఉండాలి!" అన్నాడు లక్ష్మణరావు.

మూగిన జనంలోంచి ఓ వ్యక్తి పుహళేంది జేబులో చెయ్యి పెట్టబోయాడు. పుహళేంది కోపంగా అతడి చేయి విసిరికొట్టి "నేను దొంగను కాను. అదంతా కట్టుకథ అబద్ధం." అంటూ వెళ్ళిపోబోయాడు.

లక్ష్మణరావు "అయ్యో! అలా చూస్తూ నిలబడిపోయారేమిటండీ! అతడు నా పర్సుతోపాటు ఓ కవర్ కూడ కొట్టేసాడు. అతడి జేబులో వస్తువులన్నీ తియ్యండి అందులో నా పర్సు ఉంటుంది. ఆ పర్సులో మొత్త మూడు వందకాగితాలు, రెండు పదులు, నాలుగు ఒకట్లు కొంత చిల్లర ఉండాలి!" అన్నాడు గట్టిగా అరుస్తూ.

ఇద్దరు వ్యక్తులు పుహళేంది చేతులు పట్టుకున్నార ఓ పెద్దమనిషి అతడి జేబులోంచి పర్సు, కవర్ తీసాడ పర్సులో డబ్బు లెక్కపెట్టాడు. అది లక్ష్మణరావు చెప్పి లెక్కకు సరిపోయింది. ఆ పెద్దమనిషి కవరు, పర లక్ష్మణరావుకి అప్పగించి, "దొంగ వెధవని తన్నండి! అన్నాడు. అంతే! ధన్ ధన్ మంటూ పుహళేంది వీపుమీ తమ కాయశక్తులా వడ్డించారు.

లక్ష్మణరావు పర్సూ, కవరు జేబులో పెట్టుక గర్వంగా నవ్వుకుంటూ అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

## 11

చివరి కలాగై తేనేం సాధించాం అనుకున్నాడు లక్ష్మణరావు తలుపు తాళం తీస్తూ.

తమాషా ఏమిటంటే, ఆ టికెట్‌కి వచ్చిన బహుమతి ఎంతో తెలియకుండా ఇంత కష్టపడాల్సివచ్చింది, మళ్ళీ స్వగతంగా అనుకున్నాడు.

లక్ష్మణరావు తలుపులు లోపలివైపు గడియవేసి, జేబులోంచి కవరు తీసాడు. అతడికి చాల ఆతృతగా వుంది. కవరు ఓపెన్ చేసి లోపల వున్న కాగితం బయటకు తీసాడు.

తెల్లబోయాడు లక్ష్మణరావు.

లోపల చెత్త కాగితం!

వట్టి చెత్త కాగితం ఉంది!

మరోసారి కవర్‌లో పరీక్షగా చూశాడు లక్ష్మణరావు. ఖాళీ కవర్ వెక్కిరించింది.

'నాన్సెన్స్! పుహళేంది మళ్ళీ మోసంచేశాడు!' అనుకున్నాడు, లక్ష్మణరావు అసహనంగా. సరిగ్గా అదే సమయంలో గదిలోని ఫోన్ మ్రోగింది.

## 12

తలా ఓ దెబ్బ వేయటంవలన చొక్కా అంతా పీలికలైపోయింది పుహళేందికి. ఒళ్ళంతా నొప్పులు, జనమంతా ఎక్కడివాళ్ళక్కడ సర్దుకున్నారు.

నీర్సంగా లేచి నడవసాగాడు పుహళేంది. ఎడమ జేబులో చేయి పెట్టుకుని చూసుకున్నాడు. టికెట్ సురక్షితంగా వుంది.

అంత బాధలోను టికెట్ తన దగ్గరే వుందనే సంతో

షంతో సంతృప్తి పడ్డాడు పుహాశేంది.

దండేకర్ నుంచి తప్పించుకున్నా, మళ్ళీ వాళ్ళు తన నెలాగైనా పట్టుకుంటారని తెలుసు. అందుకే వెళ్తూ, వెళ్తూ, బజార్ మలుపు తిరగ్గానే ఫాన్సీషాపులో ఓ కవర్ కొన్నాడు. మళ్ళీ రోడ్డుమీద నడవసాగాడు. నడుస్తూనే టికెట్ వున్న సీల్డ్ కవర్ చింపి, అందులోని టికెట్ విడిగా జేబులో పెట్టుకుని, చింపేసిన కవర్ తాలూకు కాగితాన్ని కొత్తకవర్ లో పెట్టి, కొత్త కవర్ను సీలు చేశాడు.

ఆ తర్వాత చెత్త కాగితం వున్న కవర్ను కుడిజేబులో పెట్టుకున్నాడు. లక్ష్మణరావు మారు వేషంలో తనను గమనించినా అతడిని రాంగ్ డైరెక్షన్ లో వుంచాలని మాటి మాటికి, కుడి వైపు జేబు మీద చేయి అదిమి పెడు తున్నాడు.

అనుకున్నట్లుగానే లక్ష్మణరావు ఆ కవర్ పట్టుకు పోయాడు.

తనిప్పుడే టికెట్ ను జాగ్రత్త పరచుకోవాలి! లక్ష్మణ రావు ఆ కవర్ చూడగానే, చిందులు త్రొక్కుతూ మళ్ళీ తన కోసం వేట మొదలు పెడతాడు.

లక్ష్మణరావుమీద పోలీసు రిపోర్టు ఇచ్చినా ఫలితం వుండదు తనకు ఆధారాలేమీ లేవు. అతడి మీద కేస్ పెట్టేందుకు రెండు రోజులు ఆ టికెట్ సురక్షితంగా వుంటే, ఆ తర్వాత అది తీసుకొని ఢిల్లీ వెళ్ళి డబ్బు తెచ్చుకోవచ్చు.

ఈ టికెట్ జాగ్రత్త పరచాలి! ఎలా? ఎక్కడ? తీవ్రంగా ఆలోచిస్తున్న పుహాశేందికి ఒక అయిడియా

వచ్చింది. వెంటనే దగ్గర్లోవున్న పోస్ట్ ఆఫీస్‌కి వెళ్ళాడు. ఎవరూ చూడకుండా లాటరీ టికెట్ కవర్‌లో పెట్టి దాని మీద తన పేరు వ్రాసి, హైదరాబాద్‌లో వున్న తన మిత్రుడి అడ్రసుకు కేరాఫ్ వ్రాసి, రిజిస్టర్ చేశాడు.

హమ్మయ్య! ప్రస్తుతం టికెట్ చాల సురక్షితంగా వుంది. తను వెంటనే హైద్రాబాద్‌లోని తన స్నేహితుడి దగ్గరకు వెళ్ళిపోవాలి. ఈ రిజిస్టర్ కవర్ రేపుగాని, ఎల్లుండిగాని హైదరాబాద్ చేరుతుంది. కవర్ తన పేరునే వుంది కనుక పోస్ట్‌మాన్ నుండి కవర్ తీసుకుని, అటు నుంచి అటు ఢిల్లీ వెళ్ళిపోవచ్చు.

ఒన్ షాట్! టు బర్డ్స్! ఇటు తనూ లక్ష్మణరావుబారి నుంచి తప్పించుకోవచ్చు. అటు లాటరీ టికెట్ సురక్షితంగా వుంటుంది.

లక్ష్మణరావు తన దగ్గర నుండి వెళ్ళి, అప్పుడే అర్థ గంట కావొస్తోంది. అతడు ఈపాటికి టికెట్ లేదని తెలుసుకుని తన కోసం బయలుదేరతాడు. మరో పావు గంటలో హైదరాబాద్ కెళ్ళే ట్రెయిన్ ఉంది. దాన్లో వెళ్ళిపోతే లక్ష్మణరావుకి దొరకడు.

బట్టలు పూర్తి చిరిగిపోయివున్నాయి. ముందుగా ఓ రెడీమేడ్ షాపులోనికి వెళ్ళి తనకు సరిపోయే సూట్ కొనుక్కుని ట్రయిల్ రూమ్‌లోకి వెళ్ళి తొడుక్కున్నాడు.

రిక్షా ఎక్కి రైల్వేస్టేషన్ చేరుకున్నాడు. కంగారుగా బుకింగ్ దగ్గరకు వెళ్ళి 'హైదరాబాద్ టికెట్ ఇవ్వండి' అన్నాడు. టికెట్ తీసుకొని పరుగెడుతూ వెళ్ళి ప్లాట్ ఫామ్ మీద సిద్ధంగా వున్న ట్రెయిన్‌లో కూలబడ్డాడు.

ఒకసారి పరిసరాలన్నీ పరిశీలించి చూశాడు. అనుమా

నించ దగ్గరిగా ఏమీ కనిపించలేదు. ఇంతలో ట్రెయిన్ కూత వేసి బయలుదేరింది.

థాంక్ గాడ్! ఇక తను గట్టెక్కినట్లే! తన నుంచి మళ్ళీ మోసపోయామని తెలుసుకున్నాక లక్ష్మణరావు బృందం నిప్పు తొక్కిన కోతుల్లా అవుతారు. తన కోసం వూరంతా గాలించి వదిలిపెడతారు. తను హైద్రాబాద్ వెళ్తున్నట్లు ఎవరూ వూహించలేరు.

హైద్రాబాద్ చేరుకుని, ఆ రిజిస్టర్ కవర్ తీసుకుని, వెంటనే అక్కడ నుండి ఢిల్లీకి వెళ్ళి టికెట్ ఇచ్చి డబ్బు తీసుకుంటాడు. పది లక్షలు! ఏం చేయాలి అంత డబ్బు! ఏదైనా పెద్ద ఫైవ్ స్టార్ హోటల్ కడితే? రెండో, మూడో సినిమా హాళ్ళు కట్టేస్తే? పోనీ ఆ డబ్బంతా వడ్డీలకి తిప్పితే? వీటన్నిటి సంగతి ఎలావున్నా ముందు అయిదారు వేలు పెట్టి లాటరీ టికెట్లు కొనాలి. ఆ తరువాత ఎంత డబ్బు ఖర్చయినా సరే, లక్ష్మణరావుని, దండేకర్ని కటకటాల వెనక్కి తోయించాలి.

ఇలా రకరకాలుగా ఆలోచిస్తూ నిద్రలోకి జారిపోయాడు పుహాశేంది.

# 13

ట్రెయిన్ సికింద్రాబాద్ స్టేషన్లో ఆగింది. పుహాశేంది బద్ధకంగా లేచి ఒళ్ళు విరుచుకొని ట్రయిన్ దిగాడు. స్టేషను బయటకు వచ్చాడు. ఆటో, టాక్సీ డ్రయివర్లు చుట్టుమూగారు, "ఎక్కడికి వెళ్ళాలి సార్," అంటూ.

"మలక పేట పోవోయ్," అన్నాడు ఓ ఆటో ఎక్కి.

ఆటో కదిలింది.

ముషీరాబాద్ దాటి కొంత దూరం వెళ్ళాక ఆటో ఆగిపోయింది.

“ఏమయిందిః” అడిగాడు పురుషోత్తం.

“కొంచెం ట్రబుల్ ఇస్తోంది సార్!” అంటూండగానే వెనుక నుంచి ఓ టాక్సీ వస్తోంది. ఆటో డ్రయివర్ చప్పట్లు కొట్టి, ఆ టాక్సీని ఆపి, టాక్సీ డ్రయివర్ దగ్గరకు వెళ్ళి ఏదో మాట్లాడాడు. తిరిగి వచ్చి “ఆ టాక్సీలో వెళ్ళండి సార్!” అన్నాడు.

పురుషోత్తం విసుక్కుంటూ ఆటో దిగి, టాక్సీ ఫ్రంట్ డోర్ తీసుకుని ఎక్కాడు.

టాక్సీ బయలుదేరింది. మలక్ పేట దాటి విజయవాడ రోడ్డుపై దూసుకుపోసాగింది.

“ఏయ్ డ్రయివర్ దారాపు. మలక్ పేట దాటి వచ్చేసాం” అన్నాడు పురుషోత్తం.

వెనుక సీట్ లోంచి నవ్వు వినిపించింది చిన్నగా ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూసాడు పురుషోత్తం.

వెనుక సీట్లో ఓ వ్యక్తి కూర్చుని వున్నాడు. ఫెల్ట్ హేట్ మొహం మీదికి వుండటం వలన ముఖం సరిగా కనిపించటం లేదు. పురుషోత్తందికి కనిపించినదల్లా ఆ వ్యక్తి యొక్క ముందుకు చాచివున్న చేయి. ఆ చేతిలో నల్లగా నిగనిగలాడుతున్న పిస్తోల్.

“ఎవరు మీరుః ఏమిటీ దౌర్జన్యం? ఏం కావాలి మీకుః” కంగారుగా అన్నాడు పురుషోత్తం.

“మేమెవరమో తెలుసుకోవాలని వుందా పురుషోత్తం?” తన పేరు వినపడగానే ఫులిక్కిపడ్డాడు పురుషోత్తం. ఇంతలో బేక్ సీట్ లో కూర్చున్న వ్యక్తి హేట్ తీసి చేత్తో పట్టుకున్నాడు.

అతడు.........లక్ష్మణరావు!

"డ్రైవింగ్ చేస్తున్నది దండేకర్ అని వేరే చెప్ప నవ సరంలేదనుకుంటాను" అన్నాడు లక్ష్మణరావు నవ్వుతూ.

పుహాళేందికి ముచ్చెమటలు పట్టేసాయి. మైగాడ్! వీళ్ళకేమైనా దివ్యదృష్టి వుందా? లేకపోతే వాళ్ళు తనని అంత త్వరగా ఎలా పసిగట్టగలిగారు? అదే అడిగాడు లక్ష్మణరావుని.

"ఆల్ రైట్ చెప్తాను విను. నువ్వు దండేకర్ నుంచి తప్పించుకున్న వెంటనే నేను దండేకర్‌ని కలుసుకున్నాను అతడు జరిగింది అంతా చెప్పాడు. దండేకర్‌ని రైల్వే స్టేషన్‌కు వెళ్ళి ఓ వ్యక్తిని రిసీవ్ చేసుకోమని పంపి నేను నిన్ను పట్టుకున్నాను. నీ దగ్గర నుంచే కవర్ తీసుకుని ఇంటికి వెళ్ళాను. కవర్ చింపగానే జరిగిన మోసం గ్రహించాను.

"స్టేషన్‌కి వెళ్ళిన దండేకర్ నువ్వు హైద్రాబాద్‌కి టికెట్ తీసుకుంటుండగా చూసి వెంటనే నాకు ఫోన్ చేసి చెప్పాడు. నేను స్టేషన్‌కి వెళ్ళేలోగా ట్రైన్ వెళ్ళిపోయింది వెంటనే ఇద్దరం కార్లో బయలుదేరి సికింద్రాబాద్ వచ్చి స్టేషన్ బయట కాపు వేశాం. అక్కడున్న ఆటో డ్రైవర్లకి, రిక్షావాళ్ళకు డబ్బులిచ్చి లోంగదీసుకున్నాం. అంటే నువ్వు ట్రైన్ దిగి ఆటో ఎక్కినా రిక్షా ఎక్కినా మళ్ళీ అందులోంచి దింపి మా కారు ఎక్కించే ఏర్పాటు చేసుకున్నాం.

అనుకున్నట్లుగానే నువ్వు మా చేతికి చిక్కావు. ఈ సారి నువ్వు మమ్మల్ని మోసం చేయలేవు. ఆ టికెట్ మాకు ఇచ్చేయ్. లేకపోతే నిండు ప్రాణాలు పోగొట్టుకుంటావ్" అన్నాడు లక్ష్మణరావు.

కారు మెయిన్ రోడ్డు వదిలి ఎడమవైపు తిరిగి తుప్పల గుండా కొంత దూరం ప్రయాణం చేసి ఆగింది. చుట్టూ పొదలు, తుప్పలు, దరిదాపుల్లో ఎక్కడా జన సంచారం కనిపించటం లేదు.

లక్ష్మణరావు కారు దిగి పిస్తోలు పుహాశేందికి గురిపెట్టి "దిగు" అని హుంకరించాడు. పుహాశేంది చేతులెత్తి కారు దిగాడు.

దండేకర్ పుహాశేంది దగ్గరకు వచ్చి అతడి జేబులో వెదికాడు. టికెట్ లేదు.

"మర్యాదగా నిజం చెప్పు ఎక్కడ టికెట్?" కాఠిన్యం నిండిన కంఠంతో అడిగాడు లక్ష్మణరావు.

పుహాశేంది మాట్లాడలేదు.

దండేకర్ ముందుకు వచ్చి ఫట్‌మని గడ్డం కింద ఒక దెబ్బ వేసాడు. కళ్ళు బైర్లు కమ్మాయి పుహాశేందికి. నోటి నుండి రక్తం కారుతోంది.

అయినా జవాబు చెప్పలేదు.

లక్ష్మణరావు దండేకర్‌కి సైగ చేశాడు. దండేకర్ పుహాశేంది వెనక్కు వెళ్ళి అతడి చంకలోంచి రెండు చేతులు పోనిచ్చి కదలకుండా పట్టుకున్నాడు.

లక్ష్మణరావు సిగరెట్ వెలిగించి పుహాశేంది దగ్గరగా వచ్చాడు. "నువ్విక్కడ అరిచినా ఎవరికీ వినపడదు. చుట్టు పక్కల జన సంచారం ఏమీ వుండదు. నిజం చెప్పేసి నీ ప్రాణం దక్కించుకో. లేకపోతే మామూలుగా చంపము నిన్ను చిత్రహింసలుపెట్టి మరీ చంపుతాం" అన్నాడు.

అప్పటికీ మాటాడలేదు పుహాశేంది. లక్ష్మణరావు సిగ

రెట్ తీసి వెలిగించాడు. పుహాశేందికి దగ్గరగా వచ్చి సిగ రెట్‌తో అతడి నుదుటిమీద కాల్చాడు.

బాధతో వికృతంగా అరిచాడు పుహాశేంది.

"టికెట్ యెక్కడ దాచిందీ చెప్పకపోతే నీవు చావటం ఖాయం. చిత్రహింసలు పెట్టటంలో నాకు చాలా పద్ధతులు తెలుసు. కమాన్. క్విక్" అంటూ జేబులోంచి బ్లేడ్ తీసాడు.

అప్పటికీ పుహాశేంది నోరు విప్పలేదు.

లక్ష్మణరావులో అసహనం పెరిగిపోతోంది. బ్లేడ్ పుహాశేంది బుగ్గమీద పెట్టాడు.

"ఇప్పటికైనా చెప్పు. లేకపోతే ఈ బ్లేడ్ నీ బుగ్గను చీరేస్తుంది" అన్నాడు.

పుహాశేంది బుర్ర ఆలోచించటం మొదలుపెట్టింది. క్షణంలో ఓ నిర్ణయానికి వచ్చాడు.

"ఆల్ రైట్! చెప్తాను. కానీ, ఓ షరతు. ఆ టికెట్ పట్టుకుని మనం ముగ్గురం వెళ్ళి డబ్బు తెచ్చుకుందాం. వచ్చినదాంట్లో సగం మీకు, సగం నాకు. ఒప్పుకుంటారా?" అన్నాడు.

లక్ష్మణరావు నవ్వాడు. "మళ్ళీ తప్పించుకోవటాని కిదో ఎత్తా? నో! అలా వీల్లేదు. ఆ టికెట్ మా కివ్వక పోతే నీ ప్రాణం పోతుంది. ప్రాణం ముందు వెధవడబ్బు ఓ లెక్కలోది కాదు. దీంట్లో మళ్ళీ షరతులు, గిరతులు వుండకూడదు. బేషరతుగా టికెట్ మా కప్పగించేయి" అన్నాడు.

"ఆల్ రైట్! మీరు నన్ను చంపినా ఆ టికెట్ ఎక్క డుందో నేను చెప్పను. అప్పుడు మీకు నా ప్రాణం

తీసినా ఉపయోగం వుండదు. పైగా హత్యానేరంతో జైలుకు వెళ్ళాలి. నేను పెట్టిన కండిషన్ కి ఒప్పుకుంటే మీకు సగమైనా దక్కుతుంది. నామీద నమ్మకం లేక పోతే, ఈ క్షణంనుంచి మీరు నా కూడానే వుండండి. టికెట్ తీసుకుని ముగ్గురం ఢిల్లీ వెళదాం. డబ్బు తీసుకో గానే ఎవరిడబ్బు వాళ్లు పంచుకుని విడిపోదాం'' అన్నాడు పుహళేంది.

కొద్ది నిముషాలు ఆలోచించాడు లక్ష్మణరావు. నిజమే! టికెట్ ప్రస్తుతం పుహళేంది దగ్గర లేదనేది స్పష్టం. ఇప్పు డతడిని చంపినా ఫలితం వుండదు. అతడు చెప్పి నట్లు ఒప్పుకోవటం తప్ప గత్యంతరం లేదు.

''ఓ. కే. నువ్వు చెప్పినదానికి ఒప్పుకుంటున్నాను. కానీ, ఒక్క విషయం గుర్తుంచుకో. ఏమాత్రం మమ్మల్ని మోసం చేయటానికి ప్రయత్నించినా, మాకు డబ్బు దక్కినా, దక్కకపోయినా—నిర్దాక్షిణ్యంగా చంపేస్తాం. మైండిట్'' అన్నాడు లక్ష్మణరావు.

పుహళేంది తలూపాడు.

''ఓ చిన్న అనుమానం. బహుమతి మొత్తం ఎంత?'' అడిగాడు లక్ష్మణరావు.

''పది లక్షలు!''

మై గాడ్! పదిలక్షలే! గుడ్లు మిటకరించారు లక్ష్మణ రావు, దండేకర్ లు.

# 14

మర్నాడు ముగ్గురూ పుహళేంది స్నేహితుడి ఇంటిదగ్గర వుండి రిజిష్టర్ కవర్ అందుకున్నారు. పుహళేంది టికెట్ ని తన దగ్గరే జాగ్రత్త పరిచాడు. అతడు ఎటువంటి అవక

తవక పనులూ చేయకుండా లక్ష్మణరావు, దండేకర్‌లు వేయికళ్ళతో గమనిస్తున్నారు.

ముగ్గురూ ఆరోజు ఆంధ్రప్రదేశ్ సూపర్ ఎక్స్‌ప్రెస్‌లో ఫోర్ బెర్తుపే ఒకటి బుక్ చేసుకున్నారు.

మధ్యాహ్నం 1-45 నిముషాలకు ఢిల్లీకి బయలుదేరింది ఆంధ్రప్రదేశ్ సూపర్ ఎక్స్‌ప్రెస్.

రాత్రి 9-30 ని॥లకు నాగపూర్ చేరింది ఎక్స్‌ప్రెస్. అక్కడ ముగ్గురూ భోజనాలు ముగించారు. సరిగ్గా 9-51 ని॥లకు నాగపూర్ స్టేషన్ వదిలింది ఆంధ్రప్రదేశ్ ఎక్స్‌ప్రెస్.

రాత్రి పన్నెండు గంటలయింది. చీకటిని చీల్చుకుంటూ దూసుకుపోతోంది ట్రైన్. అప్పటివరకూ ముగ్గురూ కబుర్లు చెప్పుకుని, ఎవరి బెర్తులమీద వాళ్లు సర్దుకున్నారు.

ఓ అరగంట తర్వాత పుహాశేంది గురక మొదలయింది. తన బెర్తుమీద పడుకున్న లక్ష్మణరావుకి నిద్ర రావటం లేదు. పుహాశేంది లాటరీ టికెట్ ఎక్కడ దాచాడో తెలియనివ్వటం లేదు. అతడు హైద్రాబాద్‌లో బయలుదేరే ముందు ఓ సూట్‌కేస్, రెండు జతల బట్టలు కొన్నాడు.

పుహాశేంది బాత్‌రూమ్‌కి వెళ్ళినప్పుడు తాము అతడి సూట్‌కేస్ మొత్తం వెదికారు. కానీ, అందులో టికెట్ లేదు. అంటే, తప్పనిసరిగా అతడిదగ్గరే వుండివుండాలి టికెట్. ఎక్కడ?

మరో అరగంట గడిచాక చప్పుడు చేయకుండా బెర్తుమీదనుంచి దిగాడు లక్ష్మణరావు. దండేకర్‌వైపు చూసి సైగ చేసాడు. అంతవరకూ నిద్ర నటిస్తున్న దండేకర్

కూడా బెర్త్ దిగివచ్చాడు.

లక్ష్మణరావు తన సూట్ కేస్ తెరిచి అందులో బట్టల మడతల మధ్యలోంచి ఓ సీసా తీసాడు. జేబులోంచి కర్చీఫ్ తీసి సీసాలో వున్న ద్రవం కొద్దిగా కర్చీఫ్ పై పోసి పుహళేంది దగ్గరకు వెళ్ళి, కర్చీఫ్ పుహళేంది ముక్కుకి అదిమాడు.

కొద్ది నిముషాల తర్వాత పుహళేందిని అటు, ఇటు కుదిపాడు. కదలలేదు పుహళేంది. అది చాలా ఘాటైన మత్తు మందు. అది వాసన చూసినవాళ్ళకు కనీసం ఆరుగంటల సేపు తెలివి రాదు.

చకచకా అతడి జేబులు వెదకటం ప్రారంభించారు ఇద్దరూ. టికెట్ లేదు. ఏమై వుంటుంది?

ఖచ్చితంగా అతడి దగ్గరే ఉండివుండాలి. మరింత జాగ్రత్తగా వెదికారు. పుహళేందిని ఇద్దరూ సాయంపట్టి నిల్చోబెట్టారు. దండేకర్ అతడిని పడిపోకుండా పట్టుకున్నాడు. లక్ష్మణరావు పుహళేంది పాంట్, షర్ట్ విప్పేసి, వాటిని క్షుణ్ణంగా పరిశీలించాడు, దొంగ జేబుల్లాంటి వేమైనా ఉన్నాయేమోనని.

అయినా ప్రయోజనం లేకపోయింది.

లక్ష్మణరావుకి చాలా అసహనంగా వుంది. మొదటి నుంచీ తాము ఎంత జాగ్రత్తగా ప్రయత్నించినా పుహళేంది తెలివిగా తప్పించుకుంటూ వచ్చాడు. ఇంత కష్టపడినా ఇప్పుడు తమకు దక్కేది అయిదు లక్షలు. అదైనా పుహళేంది అంత తేలికగా రానివ్వడు. మళ్ళీ ఏదో ఎత్తు వేస్తాడు.

చిరాకుగా పుహళేందిని సీటుకి జారబెట్టి సిగరెట్

వెలిగించాడు. కేబిన్‌లోంచి బయటకు వచ్చి విండో దగ్గర నిల్చున్నాడు. ట్రైన్ వేగంగా ఇటార్సీ స్టేషన్ దాటి పోయింది ఆగకుండా.

తాము త్వరపడాలి! ఇటార్సీకి 92 కి.మీ. దూరంలో వున్న భోపాల్ స్టేషన్‌లో ట్రైన్ ఆగుతుంది. ఈలోగా తాము టికెట్ విషయం తేల్చుకోవాలి! ఏదో గుర్తు రాగా పరిగెత్తుకుంటూ కేబిన్‌లోకి వచ్చాడు లక్ష్మణరావు.

కట్ డ్రాయర్‌లో సీటుకి జారబడి పడుకునివున్న పుహాశేందిని బలంగా లేపి నిలబెట్టాడు. దండేకర్ పుహాశేందిని పడిపోకుండా పట్టుకున్నాడు.

లక్ష్మణరావు పుహాశేంది కట్‌డ్రాయర్ తడిమాడు. చేతికి ఏదో గరుకుగా తగిలింది.

వెంటనే కట్‌డ్రాయర్ కూడా అతడి ఒంటినుంచి వేరుచేసాడు. డ్రాయర్ లోపలివైపు రహస్యంగా ఓ జేబు వుంది. ఆ జేబులో చూసాడు లక్ష్మణరావు. థాంక్ గాడ్! టికెట్ అందులో వుంది.

టికెట్ బయటకుతీసి ఆనందంగా ముద్దుపెట్టుకున్నాడు లక్ష్మణరావు. దాన్ని తన జేబులో పెట్టుకుని పుహాశేందికి యధావిధిగా బట్టలు తొడిగి సీట్‌పై పడుకోబెట్టారు.

"పుహాశేందిని ఏం చేద్దాం?" అడిగాడు దండేకర్.

"టికెట్ మన చేతికి చిక్కింది కనుక అతడి అడ్డు తప్పించుకుంటేనే మంచిది. మళ్ళీ మళ్ళీ మనకు ఆటంకాలు లేకుండా ఉంటుంది" అన్నాడు లక్ష్మణరావు.

ఇద్దరూ తమ కేబిన్‌లోంచి బయటకు వచ్చి చూసారు. అంతా నిద్రపోతుండటంవలన కారిడార్ నిశ్శబ్దంగా వుంది. పుహాశేందిని తలవైపు ఒకరు, కాళ్ళవైపు మరొకరు

సాయంపట్టి డోర్ దగ్గరకు తీసుకొచ్చారు. లక్ష్మణరావు డోర్ తెరిచాడు. పుహాశేందిని ఇద్దరూ ట్రైన్‌నుంచి బయటకు గెంటేసారు.

మరో పది నిముషాల్లో ట్రైన్ భోపాల్ స్టేషన్‌లో ఆగింది.

* * *

ఇసుక ఎక్కువగా వున్న ప్రదేశంలో పడటంవలన ఎక్కువగా గాయాలు తగిలాయిగాని, ప్రాణం పోలేదు పుహాశేందిక.

తెల్లవారాక స్పృహ లేకుండా పడివున్న పుహాశేందిని ఎవరో చూసి భోపాల్ హాస్పిటల్‌లో జాయిన్ చేసారు. మర్నాటివరకూ స్పృహ లేకుండా పడివున్నాడు పుహాశేంది.

ఆ సాయంత్రం కళ్ళు తెరిచాడు. ఒక్కక్షణం తనెక్కడున్నాడో అర్థంకాలేదు.

మంచంమీదనుంచి లేవబోయాడు. ఎక్కడో ఎముక కలుక్కుమన్నట్లయింది. అప్పుడు చూసుకున్నాడు, తన కాళ్ళకు, చేతులకు వున్న బేండేజ్‌ని. వెంటనే ఏం జరిగుంటుందో ఊహించుకున్నాడు.

లక్ష్మణరావు, దండేకర్‌లను తలచుకుని పళ్ళు పటపట కొరికాడు. ఆ వెంటనే పది లక్షలు చేదాటిపోయాయని గుర్తు వచ్చి ఏడుపొచ్చింది పుహాశేందికి.

# 15

లక్ష్మణరావు, దండేకర్‌లు ఉదయం సరిగ్గా పది గంటలకు ఢిల్లీ లాటరీస్ డైరెక్టర్ ఆఫీస్‌కు వెళ్ళారు.

లాటరీస్ డైరెక్టర్ వాళ్ళను కూర్చోమన్నాడు. లక్ష్మణ

రావు జేబులోంచి టికెట్ తీసి డైరెక్టర్ చేతికిచ్చాడు. ఆయన టికెట్ సాంతం పరీక్షించి "ఈ టికెట్ స్వంత దారుడు ఎవరు?" అడిగాడు.

"ఇద్దరం కలసి కొన్నాం. డబ్బు ఇద్దరికీ చెరిసగం చెందుతుంది." చెప్పాడు లక్ష్మణరావు.

"టికెట్ ఎక్కడ కొన్నారు?" అడిగాడు డైరెక్టర్.

"విజయవాడ, ఆంధ్రప్రదేశ్."

"జస్ట్ ఎ మినిట్!" అంటూ లోపలికి వెళ్ళాడు డైరెక్టర్.

లక్ష్మణరావు, దండేకర్‌లకు చాలా ఆనందంగా వుంది. ఇద్దరూ పది లక్షలు చేతికి వచ్చాక ఆ డబ్బుతో ఏం చేయాలో ప్రణాళికలు వేస్తున్నారు.

పావుగంట తర్వాత డైరెక్టర్ ఆ గదిలోకి వచ్చాడు.

"క్షమించండి! కేష్ రెడీ కావటానికి టైము పట్టొచ్చు. ఈలోగా మీరు సంతకాలు చేయాల్సిన కాగితాలు కూడా తయారవుతున్నాయి. కొంచెం ఓపికపట్టండి" వినయంగా చెప్పాడు డైరెక్టర్.

"ఆల్ రైట్. నెవర్ మైండ్!" హుందాగా జవాబిచ్చాడు లక్ష్మణరావు.

పది నిముషాల తర్వాత "కమాన్ సర్! వీళ్ళే ఆ ఇద్దరూ." అన్నాడు డైరెక్టర్.

ఇద్దరూ ఆశ్చర్యంగా వెనక్కి తిరిగి చూసారు. ఇద్దరు పోలీస్ అధికారులు, నలుగురు కానిస్టేబుల్స్‌తో సహా లోపలకు వచ్చి "మిస్టర్స్! యు ఆర్ అండర్ అరెస్ట్!" అన్నారు.

ఇద్దరూ తెల్లబోయారు.

"అరెస్టా? ఎందుకు? ముందుగా తేరుకుని అడిగాడు లక్ష్మణరావు.

లాటరీస్ డైరెక్టర్ "మిమ్మల్ని డిస్ అప్పాయింట్ చేసినందుకు అయామ్ వెరీసారీ మై డియర్ ఫ్రెండ్స్! మీరు తీసుకువచ్చింది డూప్లికేట్ టికెట్" అన్నాడు.

"డూప్లికేట్ టికెట్టా?" వంత పాడినట్లుగా ఇద్దరూ ఒకేసారి అరిచారు.

"ఔను. అసలు టికెట్ స్వంతదారుడికి డబ్బు నిన్ననే పే చేసేసాం. మీ దగ్గరకూడా మొదటి బహుమతి వచ్చిన నెంబర్ టికెట్ చూడటంతో మతిపోయింది నాకు. నిన్న డబ్బు ఇచ్చింది ఒరిజనల్ టికట్టా? లేక మీదే ఒరిజనలా? అని అనుమానం వచ్చింది. లోపలకు తీసుకు వెళ్ళి ఎక్స్‌పర్ట్స్‌తో పరీక్షించాను. ఇదే నకిలీ టికెట్ అని నిరూపించబడింది.

"నకిలీ టికట్లు తయారవుతున్నాయని మాకీ మధ్య కంప్లయింట్స్ వస్తున్నాయి. కానీ సాక్ష్యాలతో మాకేమీ దొరకలేదు ఇంతవరకూ. మీరీ టికెట్ ఎక్కడ కొన్నారో కరెక్టుగా చెప్పగలిగితే మా వాళ్ళు పరిశోధించి అసలు నేరస్థుల్ని పట్టుకోగలుగుతారు. లేదా మిమ్మల్ని డూప్లికేట్ టికెట్స్ ప్రింట్ చేసి అమ్ముతున్నారనే ఆరోపణతో కేస్ పెట్టాల్సి వస్తుంది. అప్పుడు పది సంవత్సరాలకు తక్కువ పడదు మీకు శిక్ష. అసలు విషయం తేలేవరకూ మీరు కస్టడీలో వుండాలి!" అంటూ ముగించాడు ఢిల్లీ లాటరీస్ డైరెక్టర్.

అసలే తాము పాత నేరస్తులు. ఆ విషయం తెలుసు కోవటం ఎంతోసేపు పట్టదు. తమకు శిక్షతప్పదు. నిరుత్సాహంగా నేరస్తులు ఇద్దరూ తలలు క్రిందికి వేలాడేసారు.

-: ఐ పో యిం ది :-

# "మేడం దయానా"

శశిభూషణ్

"బజ్ జ్..." మంటూ మ్రోగింది ఇంటర్ కామ్.

భారత ఇంటిలిజెన్స్ శాఖ స్పెషల్ బ్రాంచ్ రీజియనల్ డైరెక్టర్ మిస్టర్ నేతాజీ ఇంటర్ కామ్ స్విచ్ ఆన్ చేసాడు. "యస్?" అడిగాడు.

"డిటెక్టివ్ చందూర్ గారు, ఆయన అసిస్టెంట్ వచ్చారు, సార్!" చెప్పింది రిసెప్షనిస్ట్.

"వెల్! లోనికి పంపించు" స్విచ్ ఆఫ్ చేసి సిగరెట్ వెలిగించుకున్నాడు నేతాజీ.

స్ప్రింగ్ డోర్ తెరుచుకుంది. ఇద్దరు యువకులు లోనికొచ్చారు. వారిలో ఒకతనికి ఇరవై ఏడు సంవత్సరాలుంటుంది వయసు. రెండో అతనికి పాతిక మించి వుండదు.

చటుక్కున లేచాడు నేతాజీ. సూట్‌వాలాతో కర చాలనం చేసాడు. "మిస్టర్ చందూర్! సమాచారం అందిన వెంటనే వచ్చినందుకు సంతోషం!" తల తిప్పి రెండో వ్యక్తిని చూసాడు. "మిస్టర్ ప్రతాప్! హౌ డు యు డూ?"

"ఫైన్."

డిటెక్టివుల్ని కూర్చోమని చెబుతూ తన సీట్లో రిలాక్స్ అయ్యాడు నేతాజీ.

సిగరెట్ వెలిగించుకుని బలంగా దమ్ము లాగాడు చందూర్. "మెస్సేజ్‌తోబాటు కోడ్ వర్డ్స్ కూడా పంపించారు. అంటే విషయం చిన్నది కాదన్నమాట. ఏమిటది?" అడిగాడు.

ఎగశ్వాస పీల్చి వదిలాడు నేతాజీ. "విషయం పెద్దదే. ఈ ఎసైన్‌మెంటులో మీ ప్రాణాలు పోయే అవకాశం ఎక్కువగా వుంది. అందుకే ఆలోచిస్తున్నాను."

మందహాసం చేసాడు చందూర్. "మిస్టర్ నేతాజీ! మనిషి రెండుసార్లు మరణించడు. టేకిట్ ఈజీ."

నేతాజీ భారంగా నిట్టూర్చి చెప్పసాగాడు.

"ప్రతి దేశంతోను సంబంధ బాంధవ్యాలు కల్గిన అంతర్జాతీయ గూఢచారుల ముఠా ఒకటి ప్రపంచం నలు మూలలా తిరుగుతోంది. ఆ ముఠాలో డయానా సభ్యురాలిగా వుంటోందని మనకు తెలుసు.

ఆ ముఠాని కమాండ్ చేస్తున్నది ఎవరు? ఇటు మనకు అటు ఇంటర్‌పోల్‌కి అర్థంకాని విషయ మది.

పదిరోజుల క్రితం ఇంటర్‌పోల్ క్రైమ్స్ ఇన్వెస్టిగేటర్ ఒకతను సాలిస్‌బరి నుంచి సమాచారం అందజేసాడు

హెడ్డాఫీసుకు. డయానా ప్రస్తుతం ఇండియాలోనే వుందనీ, డయానా పనిచేస్తున్న సీక్రెట్ ఆర్గనైజేషన్ కీలక స్థానం సాలిస్‌బరి అయివుండాలని తను అనుమానిస్తున్నట్టు తెలిపాడు. తన పూర్తి రిపోర్ట్‌ను మరొక వారంరోజుల్లో పంపుతానన్నాడు. కాని, తర్వాత అతని వద్దనుంచి యెటువంటి సమాచారం అందలేదు.

కాగా, నిన్న సాయంత్రం ఆరున్నర ప్రాంతంలో ఇండియన్ ఎయిర్‌లైన్స్‌వారి స్పెషల్ ఫ్లైట్ యిక్కణ్ణుంచి బయలుదేరింది. అది బొంబే చేరాలి. నిర్ణీత సమయానికి చేరలేకపోయింది.

ప్లేన్ పాలం ఎయిర్‌పోర్ట్‌నుండి టేకాఫ్ అయిన ఐదు నిమిషాల తర్వాత పాలం విమానాశ్రయానికి ప్లేన్‌కి టెలీకమ్యూనికేషన్స్ తెగిపోయాయ్.

ఆ తర్వాత శాంతాక్రజ్ ఎయిర్‌పోర్టుకి దాని సంగతే తెలియలేదు.

నిమిషాలమీద సెర్చ్ పార్టీ సిద్ధమైంది. పది హెలికాప్టర్లు ఆ ప్లేన్ కోసం గాలింపు చర్యలు ప్రారంభించాయ్.

అదృశ్యమైపోయిన ప్లెయిన్‌లో అటమిక్ రీసెర్చి సెంటర్‌కి చెందిన ఒక ఛీఫ్ సైంటిస్ట్ ఆఫీసర్ వున్నాడు. పేరు భరద్వాజ. పోంఖరిన్‌లో మన అణుబాంబు ప్రయోగం జరుగటానికి వెనుక ఆయన శ్రమ చాలా వుంది. మిస్టర్ భరద్వాజ పాత్ర లేకుంటే మన అణుపాటవ పరీక్ష యింత త్వరగా ముగిసేది కాదు.

సైంటిస్ట్ భరద్వాజ అదృశ్యం కావటానికి, డయానా కారకురాలై వుంటుందా? ఆమె పనిచేస్తున్న సీక్రెట్

ఆర్గనైజేషన్ హెడ్డాఫీస్ సాలిస్‌బరిలో వుందా? అసలు డయానా భారతదేశంలోకి యెందుకు ప్రవేశించింది? సెంటిస్ట్ అపహరణ విషయంలో డయానా పాత్ర లేకుంటే ఆ ప్లెయిన్‌ని హైజాక్ చేసింది యెవరు? ప్లెయిన్ హైజాకర్స్ చేతుల్లో కాకుండా ఏదైనా ప్రమాదంలో యిరుక్కుందా? ప్రస్తుతం భరద్వాజ యెక్కడున్నాడు? ఎలా వున్నాడు?

"మిస్టర్ చందూర్! ఇవి సమస్యలు. ఇహ మనం చేయవల్సిందేమిటో మీరే నిర్ణయించండి!" చెప్పటం ఆపి సిగరెట్ వెలిగించుకున్నాడు నేతాజీ.

చందూర్ కుర్చీలో వెనక్కి వాలాడు.

"డయానా గురించి విన్నానంతే! ఆమెను యింతవరకు నేను చూళ్లేదు. ఆవిడ ఫోటో, వివరాలు మీకు అంది వుంటాయ్. ఆమె వివరాలు చెప్పండి."

తల అడ్డంగా ఊపాడు నేతాజీ. "ఆవిడ ఫోటో లేదు.ఆమెగురించి మీకు నేను చెప్పగలిగిన వివరాలుకూడా చాలా తక్కువ. నాకు అందిన సమాచారం ప్రకారం డయానా ఇరవైమూడు సంవత్సరాల యువతి. ఐదడుగుల నాలుగు అంగుళాల ఎత్తు. పసుపుపచ్చని శరీరం, చురుకైన కళ్ళు, గుండ్రటి ముఖం, ఆకర్షణీయమైన గుండ్రటి వక్షసంపద, రాగి వర్ణంలో మెరిసే తల వెంట్రుకలు, ఎక్కువగా చిరునవ్వులు చిందించటం ఆమెలోని ప్రత్యేకత."

"మీరు చెప్పిన వివరాలు చాలవు. చాలామంది యువతులు ఆమెలాగే వుంటారు."

ఇబ్బందిగా నవ్వాడు నేతాజీ. "ఆమె గురించి అంత

కంటే తెలియదు. ఆవిడ ఎక్కడ పుట్టిందో అసలే తెలియదు."

హఠాత్తుగా ఏదో గుర్తొచ్చినవాడిలా తిరిగి చెప్పసాగాడు నేతాజీ. "డయానా గురించి మరొక్క విషయం చెప్పగలను. ఆమె ఎడమచేతికి ఆరు వ్రేళ్ళు వున్నాయ్. చిటికెన వ్రేలు ప్రక్కన మరొక చిన్న వ్రేలుంది. అది రెండు సెంటిమీటర్ల పొడవు వుంటుందట.

ఆ సంగతి ఆమెతో పరిచయం సంపాదించ గలిగిన ఇంటర్‌పోల్ డిటెక్టివ్ తెల్సుకో గలిగాడు. అతన్ని పన్నెండు ముక్కలుగా నరికి ఇంటర్‌పోల్ డైరెక్టర్ జనరల్‌కి బహుమానంగా పంపించింది డయానా నల భై రోజుల క్రితం."

"ఇట్సాల్ రైట్! నేను సాలిస్‌బరి వెళ్తాను. ప్రతాప్ లండన్ వెళ్ళి ఇంటర్‌పోల్ డైరెక్టర్ జనరల్‌ని కల్సుకుంటాడు. ముందు డయానా సంగతి తేలిస్తే, కేసంతా విడిపోతుందని నా నమ్మకం" అన్నాడు చందూర్.

"మీ పరిశోధన వివరాలు ఎప్పటికప్పుడు తెలియజేస్తుండండి. సాలిస్‌బరిలోని ఇంటర్‌పోల్ బ్రాంచ్ మీకు అన్నివిధాలా సహకరిస్తుంది. విష్ యు బెస్టాఫ్ లక్‌లాట్!" అంటూ చందూర్‌తో కరచాలనం చేసాడు నేతాజీ.

## 2

ఢిల్లీనుంచి బయలుదేరిన ఇంటర్నేషనల్ ఫ్లైట్, టెహరాన్, అంకారా, పారిస్‌ల మీదుగా లండన్ చేరుకుంది.

సుదీర్ఘ ప్రయాణం కావటంతో ప్రతాప్‌కి కొద్దిగా విసుగు కలిగింది. హీత్రో ఎయిర్‌పోర్టునుండి బయటకు

వచ్చాడు. నల్లటి సూట్‌లో స్మార్టుగా కన్పిస్తున్నాడు.

సమయం బ్రిటన్ కాలమానం ప్రకారం ఉదయం ఎనిమిది గంటలు. చలిచలిగా వుంది వాతావరణం. నవంబర్ నెల కావటంతో మంచు పల్చగా కురుస్తోంది.

ఎయిర్‌పోర్టునుండి బయటకొచ్చిన ప్రతాప్ సిగరెట్ వెలిగించుకుని, బలంగా దమ్ము లాగాడు.

గుర్రున దూసుకొచ్చి అతని ప్రక్కన ఆగింది ఓ ఇంపాలా కాబ్.

కాబ్ బాక్ సీట్లో కూర్చున్నాడు ప్రతాప్. హైడ్ పార్క్ ప్రాంతంలోని "ఇండియన్ రెస్టారెంటు"కి వెళ్ళమన్నాడు.

కాబ్ ఇండియన్ రెస్టారెంటు చేరుకుంది. ప్రతాప్ లండన్ రావటం యిది మొదటిసారి కాదు. ఫేర్ చెల్లించి, రెస్టారెంటులోకి నడిచాడు.

బ్రేక్‌ఫాస్ట్ ముగించుకుని, అక్కడకు సమీపంలో నున్న ఇంటర్‌పోల్ హెడ్డాఫీసుకి కాలినడకన బయలు దేరాడు.

సమితిలో సభ్యత్వం కలిగిన అన్నిదేశాలకు ఇంటర్ పోల్ వర్తిస్తుంది. ఐదుగురు డైరెక్టర్లు, ఒక డైరెక్టర్ జనరల్ కలిగిన సీక్రెట్ ఆర్గనైజేషన్...ఇంటర్‌పోల్. దాని బ్రాంచీలు ప్రపంచం నలుమూలలా వున్నాయ్.

ఐదంతస్తుల ఇంటర్‌పోల్ కార్యాలయం ముందు కెళ్ళాడు ప్రతాప్. మెయిన్‌గేటు ముందున్న సెక్యూరిటీ గార్డ్సుకి తన ఐడెంటిటీ చూపించాడు.

ప్రతాప్ సెక్యూరిటీ కాప్టన్ వద్దకు తీసుకెళ్ళబడ్డాడు.

ఆ కాప్టన్ ఆఫ్రికన్ నీగ్రో. పేరు జోమా.

థోమా తన సబార్డినేట్స్‌కి సైగ చేశాడు. ప్రతాప్ సోదా చెయ్యబడ్డాడు. చివరికి అతనివద్ద సిగరెట్ పెట్టె, లైటర్ కూడా లేకుండా తీసేసుకోబడ్డాయ్.

ఇంటర్‌పోల్ డైరెక్టర్ జనరల్ మిస్టర్ సోవెస్కీ, ప్రతాప్‌ని చూస్తూనే మందహాసం చేసాడు.

"వెల్, మై డియర్ యంగ్ స్పై! టేక్ యువర్ ఛెయిర్" అన్నాడు. అతను సోవియెట్ దేశస్థుడు. కంఠం గంభీరంగా వుంది.

థాంక్స్ చెప్పి, జనరల్ చూపించిన కుర్చీలో కూర్చున్నాడు ప్రతాప్. అరగంటపాటు వారి మధ్య సంభాషణ సాగింది.

ఆఖరుకు జనరల్ అన్నాడు. "వెల్, మిస్టర్ ప్రతాప్! అటు సభ్యదేశాలకు, ఇటు ఇంటర్‌పోల్‌కి ఒక పజిల్‌గా తయారైవున్న డయానా విషయం తేల్చెయ్యటానికి భారత దేశానికి చెందిన ఇద్దరు ప్రయివేట్ ఇన్‌వెస్టిగేటర్స్ పూనుకోవటం నాకెంతో ఆనందంగా వుంది. విష్ యు ఆల్ ది బెస్ట్. మీకు ఏం సహాయం కావాలన్నా చెయ్యటానికి ఇంటర్‌పోల్ సిద్ధంగా వుంది."

"థాంక్యూ, సర్! డయానాకు, ఆమెను ఆదరిస్తున్న సీక్రెట్ ఆర్గనైజేషన్‌కి సంబంధించిన వివరాలు మీ శాఖ సేకరించి వుంటుంది. ఆ ఫైల్ కావాలి!"

"డెఫినెట్లీ..." ఇంటర్‌కామ్ స్విచ్ ఆన్ చేసి, ఎవరికో ఏదో చెప్పాడు జనరల్.

రెండు నిమిషాల్లో ఓ ఫైలు బల్లమీదకు చేరింది.

పది నిమిషాలపాటు ఫైల్ తిరగేసాడు ప్రతాప్. దీర్ఘంగా గాలి పీల్చి వదులుతూ ఫైల్లోంచి తలెత్తాడు.

"ఈ ఫైల్లో ఎక్కువ వివరాలు లేవ్. సభ్యదేశాల గూఢచారు లందరికీ తెల్సిన విషయాలు మాత్రమే వున్నాయ్" అన్నాడు నవ్వుతూ.

"యస్! ఇంటర్ పోల్ ఎంత ప్రయత్నిస్తున్నా—ఆ ముఠా వివరాలు, దాని హైకమాండ్ పోస్టని నిర్వ రిస్తున్న వ్యక్తి వివరాలు తెల్సుకోలేకపోతోంది. బై ది బై—డయానా మీకు చిక్కితే ఆమెను మా శాఖకు అప్పగించే ప్రయత్నం చెయ్యండి."

"ప్రయత్నిస్తాం. డయానా సాధారణమైన ఆడది కాదు. కర్తవ్య నిర్వహణలో తన్ను తాను బలి పెట్టుకోవ టానికి సైతం వెనుకాడని డేరింగ్ లేడీ."

అని కొన్నిక్షణాలు మౌనంగా వుండిపోయాడు ప్రతాప్.

"నేను సాలిస్ బరి వెళ్ళి మిస్టర్ చందూర్ ని కల్సుకో వాలి. అందుకు కావల్సిన ఏర్పాట్లు చెయ్యమని కోరు తున్నాను."

"ష్యూర్...ష్యూర్..." బల్లమీదున్న ఫోన్ అందు కున్నాడు జనరల్. "హాలో ట్రాన్స్ పోర్ట్..."

ప్రతాప్ కుర్చీలో వెనక్కి వాలాడు.

# 3

సాలిస్ బరి ఎయిర్ పోర్టులో ప్లెయిన్ దిగిన చందూర్ ని ఎవరూ అనుమానించలేదు. అతను టూరిస్ట్ లాగా ప్యాసిం జర్స్ ఫ్లైట్లో ప్రయాణించి వచ్చాడు.

రొడీషియా ఆఫ్రికన్స్ తో నిండివున్నా అక్కడ శ్వేత జాతీయులు దాదాపు 270 వేలమంది వరకు వున్నారు. శ్వేతజాతి ప్రజలున్న ప్రాంతాలలో వర్ణజాతులు, యూవ

జనులు ప్రదర్శనలు జరుపుతున్న రోజులవి.

అల్లరు అణచటానికి పోలీసులు టియర్ గ్యాస్, రివా ల్వర్లు, షాట్ గన్స్ ఉపయోగిస్తున్న సమయం. అల్ప సంఖ్యాకులైన తెల్లజాతివారి చేతుల్లోంచి అధికారాన్ని హస్తగతం చేసుకోవటానికి నల్లజాతివారు ప్రత్యక్ష పోరా టాలు, గొరిల్లా యుద్ధాలు, అలజడులు జరుపుతున్న గడ్డు క్షణాలవి.

చందూర్‌తో పాటు మిగిలిన ప్రయాణీకులు కూడా కస్టమ్స్ గొడవలు ముగించుకొని, ఎయిర్ పోర్ట్ నుండి బయట పడ్డాడు.

ఎయిర్ పోర్ట్ లోపల, వెలుపల...ఎక్కడ చూసినా సాయుధ సైన్యం అప్రమత్తతతో మెలుగుతూంది. సైరన్లు వూదుకుంటూ పోలీస్ పెట్రోల్ వాన్స్ వీధుల వెంట పిచ్చికుక్కల్లా పరుగులు దీస్తున్నాయ్.

ఆఫ్ఘన్ కుర్దిష్ జాతివాడిలా కనిపిస్తున్నాడు చందూర్. కుర్తా, లాల్చి, పైన హాఫ్ కోటు, తలకు పెద్ద తలపాగా ధరించాడు. భుజానికి ఎయిర్ బేగ్ వ్రేలాడు తోంది. గుబురుగా పెరిగిన గడ్డం, మెలి తిరిగిన మీసాలు, చేతికి పెద్ద స్టీలు కడియం...నల్లటి రెయిబాన్ గ్లాసెస్ వెనుక చురుగ్గా కదిలే కనుపాపలు బయటకు కన్పించటం లేదు.

ప్రపంచం నలుమూలలా వుండే స్కిన్ ట్రేడర్స్ ఆఫ్రికన్ రాజ్యాలతో డీలింగ్స్ కలిగి వుంటారు. ఆఫ్రికన్ రాజ్యాల్లో చిక్కని జంతు చర్మాలు ప్రపంచంలో మరెక్కడా దొరకవు.

టాక్సీలో బయలుదేరాడు డిటెక్టివ్ చందూరు. ఏదైనా

హోటల్లో బస చెయ్యటం అతని కిష్టం లేదు. హోటల్లో బస చెయ్యటం వలన అనేక రకాలైన ప్రమాదాలు ఎదుర్కోవలసి వుంటుందని అతనికి తెలుసు.

అంతే కాదు. ఆ సమయంలో పాలిటిక్స్‌లో పరిస్థితులు కూడా అంతంత మాత్రంగానే వున్నాయ్. స్థానిక ప్రజలే ప్రతి క్షణం చచ్చి బ్రతుకుతున్నారు భయంతో.

నగరం మధ్యలోనున్న ఓ సందు కివతలగా టాక్సీ ఆపించాడు.

వాహనాలు ప్రవేశించడానికి వీలు లేని సందు అది. సందు కిరువైపులా భవనాలు కన్పిస్తున్నాయ్.

ఏభై గజాలు నడిచి ఎడమ చేతివైపున్న ఓ భవనం ముందాగాడు చందూర్.

అది రెండంతస్తుల భవనం. ఆధునికంగా కన్పిస్తోంది.

డిటెక్టివ్ కాలింగ్ బెల్ స్విచ్ నొక్కాడు. అర నిమిషం ఆగి మళ్ళీ నొక్కాడు.

పదిహేను సంవత్సరాల నీగ్రో పనిపిల్ల తలుపు తెరిచింది.

"హు ఆర్ యు?" అడిగింది ఇంగ్లీష్‌లో.

రొడీషియాలో తెల్లజాతి వారు వున్నది తక్కువ సంఖ్యే అయినా వారి సంస్కృతి అంతటా ఎక్కడ చూసినా కన్పిస్తుంటుంది. వేష భాషలు మొదలుకొని హావభావాల వరకు గ్రేట్ బ్రిటన్ సంస్కృతి అక్కడ ప్రజల్లో జీర్ణించుకుపోయింది.

"బేబీ; దాదాముల్లా కాబూల్ నుండి వచ్చాడని జెనీకి తెలియజెయ్!" చెప్పాడు చందూర్ ఇంగ్లీషులోనే.

ఆ పిల్ల చందూర్‌ని లోనికి ఆహ్వానించింది. హాల్లో

నున్న సోఫా చూపించి, కూర్చోమంది.

"సర్! మీరు ఏం బిజినెస్ చేస్తారు? మేడమ్ జెనీసా అడిగితే చెప్పాలి కదా!" అంది నవ్వుతూ.

"స్క్రాప్ ట్రేడర్ని. దాదాముల్లా అనే పేరు చెబితే చాలు. ఆమెకు నేను బాగా తెలుసు. వెళ్ళు!"

పని మనిషి వెను దిరిగి మేడ మెట్లు ఎక్కి అదృశ్య మైంది.

హై హీల్డ్స్ టక టక లాడించుకుంటూ మేడ మెట్లు దిగి వచ్చింది జెనీసా. చందూర్ని కాసేపు పరిశీలనగా చూసింది.

"మిస్టర్ చందూర్! హావ్ డు యు డూ?" అంది నవ్వుతూ.

ఆశ్చర్యపోలేదు చందూర్. తను మారు వేషంలో వున్నా జెనీసా పోల్చుకో గల్గింది. అంతటి సమర్థురాలే ఆమె.

"జెనీసా! అలా కూర్చో!" తన ఎదురుగా నున్న ఖాళీ సోఫాని చూపించాడు డిటెక్టివ్.

అందంగా నవ్వి చందూర్ ప్రక్కనే కూర్చుంది జెనీసా. "ప్రస్తుతం ఇక్కడ పరిస్థితులు సరిగా లేవ్. అంతర్యుద్ధం భయంకరంగా సాగుతోంది. ఎందు కొచ్చారు మీరు? ఎవరినైనా శత్రు గూఢచారిని వెంటాడుతూ ఇలా వచ్చారా?"

తన పెదవుల మీద ముద్దు పెట్టుకూంటున్న జెనీసాని వారించలేదు డిటెక్టివ్.

"నువ్వు ఇక్కడ సాలిస్బరీలో వుంటున్నావని రెండు నెలల క్రితం తెలిసింది. నేను వచ్చేసరికి మరొక దేశానికి

వెళ్ళిపోయి వుంటావేమో నని భయపడ్డాను. ఒక సమస్య తీరింది. మిస్ జెనీసా! నీ సహాయం కొంతకావాలి నాకు.''

''చెప్పండి.''

''కొద్ది రోజుల పాటు నువ్వు ఎవ్వరికీ ఎపాయింట్‌మెంట్ యివ్వకూడదు. నీ ఎంగేజ్‌మెంట్స్ అన్నీ కాన్సిల్ చేసుకోవాల్సివుంటుంది. నేను యిక్కడున్నంత వరకు ఎవరూ ఈ యింటి గుమ్మం తొక్కకూడదు.''

సిల్క్ రోబ్‌లో నున్న జెనీసా చిలిపిగా నవ్వి ఒళ్ళు విరుచుకుంది.

''నన్ను గుర్తుంచుకొని, నా కోసం వెతుక్కుంటూ యింత దూరం వచ్చారంటే నాకెంతో గర్వంగావుంది. మీరు చెప్పినట్లే జరుగుతుంది. కాని, నా బిజినెస్ దెబ్బ తినే ప్రమాదం వుంది. ఈ సారి చెల్లించాల్సిన బిల్లు పెద్ద మొత్తం అవుతుందేమో!''

''డోంట్ బాదర్. నువ్వు కోరిన మొత్తం యిస్తాను. జెనీసా! నేను వచ్చింది నీకోసం కాదు వివరాలు అడగొద్దు. నాకో గది ఏర్పాటు చేస్తావా?''

''వై నాట్...విత్ ప్లెజర్, డార్లింగ్!'' జారి పోతున్న సిల్క్ రోబ్‌ని సరిచేసుకుంటూ, లేచి నిల్చుంది జెనీసా. చందూర్ వృత్తి గురించి ఆమెకు తెలుసు.

# 4

ప్లేన్ రోడేషియా, భూభాగం మీదకు దూసుకొచ్చింది. దాన్ని కంట్రోల్ చేస్తున్న వ్యక్తి ఇంటర్‌పోల్ సెక్యూరిటీ కాప్టెన్ జోమా. అతని ప్రక్కనే ప్రతాప్ వున్నాడు.

అది రష్యన్ మిగ్-25 జెట్ ఫైటర్. అత్యంత శక్తి వంతమైన యుద్ధ విమానం. దాని వేగం గంటకు 3395 కిలోమీటర్లు. ప్రతాప్‌ని త్వరగా రొడోషియా చేర్చటానికి ఆ విమానం కేటాయించబడింది.

విండో గ్లాస్ గుండా బయటకు చూసాడు ప్రతాప్. నీరెండలో తళ తళ మెరుస్తున్నాయ్ క్రింద ఏవో పర్వత చరియలు. సాయంత్రం సమయం.

ప్లేన్‌ని ఆటోపైలెట్‌లో మాగ్జిమమ్ స్పీడ్‌కి ఫిట్ చేసి, పారాచూట్ బిగించుకున్నాడు జోమా.

అతని చర్యలు ప్రతాప్‌కి ఆశ్చర్యాన్ని కల్గించాయ్. "మిస్టర్ జోమా! ఏమిటి నువ్వు చేస్తున్నది?" కుతూహలాన్ని-అణచుకోలేక అడిగాడు.

సమాధానంగా నవ్వాడు జోమా. కంట్రోల్ స్టిక్ మీద చేయి వేస్తూ, ఫుల్ ఎక్సిలరేషన్‌లో పదివేల అడుగుల ఎత్తుకు విమానాన్ని తీసుకెళ్ళాడు.

ప్రతాప్ సిక్స్‌త్ సెన్స్ ఏదో ప్రమాదాన్ని సూచించే వార్తల్ని ట్రాన్స్‌మిట్ చెయ్యటం మొదలుపెట్టింది. పరిస్థితి అర్థం కావటం లేదు ప్రతాప్‌కి.

"జోమా! వాట్స్‌ది మేటర్" అరిచాడు.

"మై డియర్ ప్రతాప్! యు ఆర్ గోయింగ్ టు డై!" తాపీగా చెప్పాడు జోమా.

"వాడు యు మీన్?"

నవ్వాడు జోమా. "ధైర్యం వుంటే విను. నేను మేడమ్ దయానా మనిషిని. ఆ విషయం ఇంటర్ పోల్‌కి తెలియదు. గుడ్ బై!"

అదిరి పడ్డాడు ప్రతాప్.

సట్ ఎజక్ట్యూటర్ బటన్ నొక్కాడు జోమా. చటుక్కున అతను సట్‌తో సహా స్ప్రింగ్‌లా ప్లేన్‌లోనుండి ఆకాశంలోకి విసిరివేయబడ్డాడు.

ఆ తర్వాత జోమా ఏమయ్యాడో ప్రతాప్‌కి తెలియదు. అతను చావడు. అప్పటికే పారాచూట్ బిగించుకొని వుండటంతో క్షేమంగా భూమ్మీద లాండ్ కాగలడు.

చటుక్కున కంట్రోల్స్‌ని స్వాధీనం చేసుకున్నాడు ప్రతాప్. అప్పుడు గ్రహించాడు వింగ్స్ రెండూ మండుతుండటం. ఫైర్ ఎక్స్‌టింగ్ విషర్ బటన్ నొక్కాడు. అది పని చెయ్యటం లేదని అర్థమైంది.

ప్రతాప్ గుండెలు దడదడలాడాయ్. జోమా ప్రత్యర్థుల మనిషి అయి వుంటాడని తను వూహించనైనా లేదు. బాస్టర్డ్... మరొక పారాచూట్ వుందేమోనని గబగబ ప్లేన్‌లో వెతికాడు. అతని ఆఖరు ప్రయత్నంకూడా ఫెయిల్ అయ్యింది.

అది జీవన్మరణ సమస్య.

ప్లేన్ వణికిపోతూ యిష్టమొచ్చినట్టు ముందుకు దూసుకెళ్తోంది. అది ఏ క్షణంలోనైనా తల క్రిందులు కాగలదు.

మంటలు వ్యాపించటానికి జోమా ఏదో చేసివుంటాడు. అతని మీద ఎటువంటి అనుమానం లేకపోవటంతో తను ఫూల్ అయిపోయాడు. జోమా ప్రయత్నాల్ని పసిగట్టక పోయాడు.

అప్పటి వరకు ఫ్యూయల్ టాంకులు అంటుకోక పోవటంతో అటువంటి క్షణాల్లోకూడా ఒక్క క్షణం సంతోషించాడు ప్రతాప్.

శక్తి వంచన లేకుండా శ్రమిస్తున్నాడు. ప్లేన్‌ని కంట్రోల్ చెయ్యాలని చూస్తున్నాడు. అతని డైరెక్షన్ ప్రకారం కాకుండా జారిపోయే ఉల్కలా దూసుకెళ్తోంది విమానం. మంటలు కాబిన్‌లోకి ప్రవేశించాయ్.

ఇహ లాభం లేదని అర్థమైంది ప్రతాప్‌కి.

క్రిందకు చూసాడు. పర్వతాలు, లోయలు, దట్టమైన అడవి కన్పించాయ్.

ఏదో చెయ్యాలి తను. మిగ్ ఆకాశంలోనే మండిపోయి పేలిపోవటానికి ఎక్కువ సమయం పట్టదు. ఇటువంటి పరిస్థితి ఇంతవరకు తనకు ఎదురుకాలేదు. మిస్టర్ చందూర్! మీకు రేపటినుంచి అసిస్టెంట్ ఉండడు. అయాం వెరీ సారీ!

ప్లేన్‌ని డౌన్ చెయ్యాలని చూసాడు. నోస్ డైవ్ అయ్యింది. వెంటనే సర్రున దూసుకెళ్ళసాగింది రాకెట్‌లా భూమ్మీదకు.

డోర్ తెరిచాడు ప్రతాప్. అరక్షణమైనా ఆలస్యం చెయ్యకుండా ప్లేన్‌లోంచి తలక్రిందులుగా జారిపోయాడు.

అతన్ని దాటి కొంతదూరం ముందుకు వెళ్ళి, అంతలోనే తిరిగి నేలమీదకు తలక్రిందులుగా జారిపోతూ భగ్గున మండిపోయింది మిగ్. ఆకాశంలో పెద్ద విస్ఫోటం!

దాదాపు ఐదువేల అడుగుల ఎత్తునుంచి క్రిందకు జారిపోతున్న ప్రతాప్ గుండెలు నిమిషానికి 144 సార్లు కొట్టుకుంటున్నాయ్.

క్రింద ఏవో పర్వతాల మధ్య నల్లటి లోయ వికృతంగా కన్పిస్తోంది. గాలి వేగానికి చెవులు హోరెత్తిపోతున్నాయ్.

చటుక్కున గాల్లో బేలన్స్ సరిచేసుకొని పట్టి

కొట్టాడు ప్రతాప్. స్పీడ్ కాస్త కట్ అయ్యి, తిరిగి అంతలోనే రైజ్ అయ్యింది.

మళ్ళీ అంతలోనే తలక్రిందులుగా జారిపోతున్నాడు క్రిందకు. అతి కష్టంమీద రెండవ పల్టీ కొట్టాడు.

అప్పటికే భూమికి పదిహేనువందల అడుగుల ఎత్తు వచ్చేసాడు.

లోయ ఎంత లోతు వుందో తెలియదు. మూడవ పల్టీ కొట్టిన తర్వాత అతని కళ్ళకు ఏదో చిన్న జలపాతం లాంటిది కన్పించింది.

చాలా ఎత్తునుంచి క్రిందకు జారిపోతున్న నీరు పొగ మంచులాగా కన్పించింది.

ఉత్సాహంగా నాల్గవ పల్టీ కొట్టాడు ప్రతాప్. ఐదు...ఆరు...ఏడవ పల్టీ కొట్టి, అదృష్టం నవ్వకపోవటంతో పెద్ద నీటిమడుగులోకి తలక్రిందులుగా దూసుకుపోయాడు.

నిమిషం తర్వాత వాటర్ సర్ఫేస్‌మీదకు వచ్చాడు. జలపాతం హోరు దూరంనుంచి అస్పష్టంగా విన్పిస్తోంది.

చకచక ఒడ్డుకు ఈదుకొచ్చాడు ప్రతాప్.

మడుగు ఒడ్డునే వున్న రాతిబండమీద వెల్లకిలా పడుకొని పావుగంటపాటు విశ్రాంతి తీసుకున్నాడు. అతని బ్లడ్ ప్రెషర్ మామూలు స్థాయికి చేరుకుంది. హృదయ స్పందన వేగం సైతం మామూలుగా మారింది.

లేచి కడుపునిండా నీరు తాగాడు ప్రతాప్. దుస్తులు తీసి, నీరు పిండివేసి, తిరిగి అవే ధరించాడు. అప్పుడు తెల్సిందతనికి తన రివాల్వర్ ఎక్కడో పోయిన విషయం.

చేజారిపోయిన రివాల్వర్ గురించి చింతిస్తూ కూర్చొ

వటం అవివేకం! లోయ వెంబడే కొంతదూరం నడిచి, అడవి తీగల సహాయంతో పైకొచ్చాడు. మరొక్క అర గంటలో భయంకరమైన కీకారణ్యంలో ప్రవేశించాడు.

## 5

సూర్యుడు పడమటి కొండల చాటుకు చేరుకున్నాడు. పడమటి దిక్కున ఎర్రగా మెరుస్తోంది ఆకాశం. గాలి నెమ్మదిగా వీస్తోంది.

వన్యమృగాల అరుపులు ఆగి ఆగి వినిపిస్తున్నాయ్. కోతుల కిచకిచలు పోనుపోను అధికంగా వినిపించ సాగాయ్.

అడవుల్లో ప్రమాదాలు అన్నివైపులా పొంచివుంటా యని ప్రతాప్‌కి తెల్సు. ఆత్మరక్షణకోసం బూట్‌లో దాచుకున్న డాగర్ తీసి చేత్తో పట్టుకున్నాడు. అదొక్కటే అతని వద్దనున్న ఆయుధం ప్రస్తుతం.

ప్రయాణం ఎటువైపు సాగుతున్నదో తెలియదు.

కంపాస్ లేకుండా అడవుల్లో ప్రయాణించటంవలన అనేక ఇబ్బందులున్నాయ్. దారి తప్పే ప్రమాదం అటుంచి, తిరిగిన ప్రదేశాల్లోనే మళ్ళీ మళ్ళీ తిరగటం కూడా సంభవిస్తుంటుంది. అడవుల్లో కాలిబాటలన్నీ ఇంచుమించు ఒకే విధంగా ఉండటమే అందుకు కారణం.

హఠాత్తుగా జాగ్వార్ పులి గాండ్రింపు వినిపించింది.

అదిరిపడి చటుక్కున ఆగిపోయాడు ప్రతాప్.

ఇంతలో జాగ్వార్ అతని ఎదుట ప్రత్యక్షమైంది. ప్రక్కనే వున్న పొదల్లోంచి అది వచ్చిన తీరు, ప్రస్తుతం ఆ క్రూరజంతువు తోకను నేలకేసి బాదుతూ మధ్యమధ్య నోరు పూర్తిగా తెరిచి, భీకరంగా గాండ్రించటం

చూస్తుంటే ప్రతాప్ బ్లడ్ ప్రెషర్ తిరిగి పెరిగింది.

జాగ్వార్‌ని చిన్న డాగర్‌తో ఎదిరించటం మాటలు కాదని అతనికి తెలుసు. రాతిబొమ్మలా నిలబడుండి పోయాడు.

చిఱుతపులి నాలుగు అడుగులు వెనక్కు నడిచింది.

హఠాత్తుగా గాండ్రించి, మెరుపువేగంతో గాల్లో కెగిరి ప్రతాప్ మీదకు దూకింది.

# 6

సిగరెట్ వెలిగించుకుని, ఆరిపోయిన అగ్గిపుల్లను ఏష్ ట్రేలో పడేసాడు చందూర్. సిగరెట్టును నుసిగా మార్చేస్తూ గదిలో పచార్లు ప్రారంభించాడు.

అంతక్రితమే సాలిస్‌బరి నగరంలో పలుప్రాంతాలు తిరిగివచ్చాడు చందూర్. ఎక్కడ చూసినా అల్లర్లు, గొడవలు, లాఠీఛార్జిలు, బాష్పవాయుప్రయోగాలు కన్పించాయ్.

ఓ చోట నలుగురు నీగ్రో విద్యార్థినులు చందూర్ మీదకు రాళ్ళు విసిరారు, అతన్ని శ్వేతజాతీయునిగా ఎంచి. ఇంతలో పోలీసులు ఆ ప్రదేశానికి చేరుకోవటంతో డిటెక్టివ్ దుస్తులకుగాని, ఒంటికిగాని ఎటువంటి డామేజీ జరుగలేదు.

ఇహ రోడ్లు సర్వే చేయటం ఆరోగ్యానికి ఏమంత మంచిది కాదని అన్పించి, వెనుదిరిగి వచ్చేసాడు.

ఆలోచనలతో డిటెక్టివ్ మస్తిష్కం వేడెక్కిపోతోంది.

వరుసగా మూడు సిగరెట్లు నుసిచేసాడు చందూర్. గిరుక్కున వెనుదిరిగి బల్ల దగ్గరగా వెళ్ళాడు. బల్లమీద టెలిఫోన్ ఉంది.

"మిస్టర్ చందూర్! రిసీవర్‌ని రెస్ట్‌మీద పడెయ్!" కటువుగా విన్పించింది వెనుకనుంచి.

పెదవులు బిగించాడు డిటెక్టివ్. మౌనంగా రిసీవర్‌ని క్రెడిల్ చేసి, నెమ్మదిగా వెనక్కి తిరిగాడు.

గుమ్మంలో ఏడడుగుల నీగ్రో కన్పించాడు. పాంటు మాత్రమే ధరించాడతను. మిగిలిన శరీరమంతా నగ్నంగా ఉంది. కసరత్తుచేసి పెంచాడేమో కండలు మెలితిరిగి ఉన్నాయ్. నల్లటి ముఖంలోని కనుగుడ్లు ఎర్రగా మండు తున్నట్టు కన్పిస్తున్నాయ్.

48 ఆటోమేటిక్ అతని కుడిచేతిలో ఉంది. దాన్ని అతను పట్టుకున్న తీరు డిటెక్టివ్‌ని కలవరపరుస్తోంది. ప్రత్యర్థి అలాంటి మారణాయుధాలు ఉపయోగించటంలో మంచి అనుభవం కలిగివున్నాడని అర్థంచేసుకున్నాడు.

"చందూర్ ఎవరు?" హఠాత్తుగా ప్రశ్నించాడు. "ఇంతకూ నీవెవరు?"

అతను ముందుకొచ్చాడు. డిటెక్టివ్‌కి రెండు గజాల దూరంలో ఆగిపోయాడు.

"చందూర్ నేను కాదు. ఈ గదిలో ఉన్నది మనం యిరువురు మాత్రమే! ఇహ పోతే నీ రెండో ప్రశ్నకు సమాధానం విను. అయాం అబ్రన్...డాబూ అబ్రన్. మేడమ్ దయానా మనిషిని..." మాటలు ఆపేసి పాంటు జేబులోంచి ఏదో టాబ్లెట్ తీసి డిటెక్టివ్ మీదకు విసి రాడు. "దాన్ని మింగాలి నువ్వు."

డిటెక్టివ్ ఛాతీని తాకి క్రింద పడిపోయింది టాబ్లెట్. కనురెప్పలు కూడా కదిలించలేదు డిటెక్టివ్.

"మిస్టర్ అబ్రన్! చందూర్‌ని తక్కువగా అంచనా

వేసుకున్న ప్రతీ వ్యక్తీ ఘోరంగా భంగపడ్డాడు...”

“షటప్! చెప్పింది చెయ్.”

చటుక్కున ప్రత్యర్థిమీదకు దూకుతున్నట్టు నటిస్తూ ప్రక్కకు జారిపోయాడు డిటెక్టివ్. ‘ధన్...’మంటూ పేలింది. 48 బుల్లెట్ ఎదురుగానున్న గోడకు గుద్దుకుంది.

జరిగిన మోసం అర్థమై రెండవసారి ట్రిగ్గర్ నొక్కబోయాడు అబ్రన్.

అప్పటికే సమయం మించిపోయింది. అతడి కుడిచేతి మణికట్టుమీద బలమైన బూట్ కాలు దెబ్బ పడింది. 48 ఎగిరిపోయి నేలమీద పడిన వెంటనే “ఖంగ్...” మంటూ చప్పుడు చేసింది.

స్ప్రింగ్ లా లేచి నిలబడ్డాడు డిటెక్టివ్.

రెండడుగులు వెనక్కు నడిచాడు అబ్రన్. వికృతంగా నవ్వి చేతులు ముందుకు చాచాడు. పిడికిళ్ళు బిగిస్తూ అంతలోనే విడదీస్తూ మళ్ళీ నవ్వాడు కర్ణకఠోరంగా.

ప్రత్యర్థి జెయింట్ బాక్స్ కి సిద్ధమయ్యాడని అర్థమైంది చందూర్ కి.

జెయింట్ బాక్స్ తెల్సిన వ్యక్తితో మామూలుగా పోరాడి ప్రయోజనం ఉండదు. జపానీస్ జూడో, ఆఫ్రికన్ కరాటే, భారతీయుల మల్లయుద్ధం, మంగోలియన్ యన్ బాక్స్, చైనీస్ చుడో వగైరాలు జెయింట్ బాక్స్ ముందు నిలబడలేవు. భయంకరమైన ఫైట్ అది. ఒకే ఒక బాక్స్ తో మనిషి ఈ లోకాన్ని వదిలేస్తాడు.

ప్రత్యర్థిని తక్కువగా అంచనా వేసుకోలేదు డిటెక్టివ్. రక్తాన్ని గడ్డకట్టించే మాస్టర్ బాక్స్ అరుపు అరిచాడు. అరుస్తూ సింహంలా ముందుకు దూకాడు. దూకుతూ

పిడికిలిని బలంగా ప్రత్యర్థి కడుపుమీదకు విసిరాడు.

అప్పటికే అబ్రన్ చేతులు డిటెక్టివ్ భుజాలను తాకాయ్. ఇంతలో చందూర్ పిడికిలి అబ్రన్ కడుపులో దూరింది.

భయంకరమైన అబ్రన్ గావుకేకకు ఆ గది గోడలు అదిరాయ్ క్షణకాలం.

ప్రత్యర్థి కడుపులో రిస్ట్‌వరకు జొరబడున్న తన కుడి చేతిని వెనక్కి లాగేసుకున్నాడు డిటెక్టివ్. ఆ చేయి ఒంటరిగా బయటకు రాలేక అబ్రన్ ప్రేవుల్ని కూడా బయటకు లాక్కొచ్చింది. అప్పుడు-ఆలస్యంగా అర్థమైంది డిటెక్టివ్‌కి తన చేతులు రెండూ పెరాలసిస్ వచ్చినట్టు ప్రేలాడిపోతున్న సంగతి.

దబ్బున వెనక్కి విరుచుపడ్డాడు అబ్రన్. భీకరంగా మూలుగుతూ, పిడికిళ్ళు బిగించి నేలను గుద్దుతూ తల అటు ఇటు వూపుతున్నాడు.

గాయంలోంచి విపరీతంగా స్రవిస్తోంది రక్తం. అతను కదులుతుంటే అతని కడుపుమీద, నేలమీద పడున్న ప్రేవులు బరువుగా కదులుతున్నాయ్ పాపం!

చేతులు స్వాధీనంలోకి తెచ్చుకోవాలని ప్రయత్నించాడు చందూర్. స్వాధీనం కాలేదు. తోటకూరకాడల్లా ప్రేలాడిపోతున్నాయ్ రెండూ.

తన అదృష్టం బాగానే ఉంది. బలమైన జెయింట్ బాక్స్ తలమీద పడివుంటే తల కొబ్బరికాయ పగిలినట్టు పగిలివుండేది. గ్రుడ్డిలో మెల్ల మేలు అన్నది ఇలాంటిదే అయ్యుంటుంది అనుకున్నాడు.

తన స్వాధీనంలో లేని చేతులు తిరిగి మామూలు స్థితికి

రావటానికి కనీసం నాలుగు గంటలైనా అవసరమని డిటెక్టివ్‌కి తెలుసు.

చేతులు పనిచెయ్యకపోవటంతో ముందుకు కదిలాడు డిటెక్టివ్. నిర్దయగా ప్రత్యర్థి కంఠంమీద తన్నాడు.

సృష్టి దద్దరిల్లేలా కేకపెట్టబోయాడు అబ్రన్. అతని ప్రయత్నం ఫెయిల్ అయ్యింది. కంఠనాళాలు దెబ్బ తినటంతో శబ్దం అక్కడే సుడులు తిరిగిపోయింది.

తిరిగి కాలెత్తాడు డిటెక్టివ్.

"బీ కేర్!" కటువుగా విన్పించింది గుమ్మంలోంచి.

అబ్రన్‌ని తన్నటం మానేసి గుమ్మంవైపు చూసాడు డిటెక్టివ్. చేతులు వెనక్కి విరిచి కట్టబడిన జెనీసా, ఆమె వెనుక లైట్ మెషిన్‌గన్‌తో నిలబడున్న యూరోపియన్ వృద్ధుడొకడు కన్పించారు.

వెక్కి వెక్కి ఏడుస్తోంది జెనీసా. బిగ్గరగా ఏడవటానికి ఆమెకు ధైర్యం చాలటంలేదు. ఏడుపును బలవంతంగా దిగమ్రింగుకున్నప్పుడు కూడా వెక్కిళ్ళు రావటం జరుగుతుంటుంది.

మౌనంగా జడపదార్థంలా ఉండిపోయాడు డిటెక్టివ్.

## 7

గాలివేగంతో నేలమీదకు జారిపోయి, జాగ్వార్ మొదటి ప్రయత్నాన్ని వృథా చెయ్యటంతోబాటు దాన్ని గాయపర్చగలిగాడు ప్రతాప్.

పట్టు చిక్కకపోవటంతో ప్రతాప్‌మీదనుంచి అవతలకు దూకేసింది పులి. అదే సమయంలో దాని డొక్కలో దిగబడింది డాగర్.

జాగ్వార్ శరీరంలో జొరబడిన డాగర్‌ని వెనక్కి

లాక్కోవాలని చూసాడు ప్రతాప్. అతని అంచనా పారబాటైంది. సమయం చాల్లేదు. తన ఒంట్లో దిగిన డాగర్‌తోసహా అవతలకు దూకేసింది జాగ్వార్.

దడదడలాడే గుండెలతో లేచి నిలబడ్డాడు ప్రతాప్. భీకరంగా గాండ్రిస్తూ గిర్రున ఇటు తిరిగింది పులి. తిరిగి గాండ్రించింది.

ఒట్టి చేతుల్తో జాగ్వార్‌ని ఎలా ఎదుర్కోవటం? పారి పోవటానికి లేదు. పారిపోతే జాగ్వార్ వదిలెయ్యదు. ఆలోచనల్ని అపుకుంటూ మొండిధైర్యంతో నిలబడుండి పోయాడు.

రెండడుగులు నడిచి ఆగిపోయింది జాగ్వార్. కర్ణకఠో రంగా గాండ్రించింది.

దాని చూపుల్లో చూపులు కలిపి, కనురెప్పలార్పటం మర్చిపోయి రాతివిగ్రహంలా నిలబడున్నాడు ప్రతాప్.

భూమిని కాళ్ళతో తన్ని గాల్లో కెగిరింది పులి. అదే సమయంలో "జుంయ్..."మనే విచిత్ర ధ్వనితో గాలిని చీల్చుకుంటూ దూసుకొచ్చిన బాణం "చక్..."మంటూ ఆ జంతువు కంఠంలో దూరింది.

ఇంతలో ప్రతాప్ మీద విరుచుకుపడిందా జంతువు. దబ్బున వెనక్కి పడ్డాడు ప్రతాప్. తన కంఠం కొరి కెయ్యాలని చూస్తున్న పులి కళ్ళను బొటనవేళ్ళతో పొడిచాడు.

జాగ్వార్‌కి ఎడమకన్ను పోయింది.

ప్రతాప్ కుడిచేతి బొటనవ్రేలు కదిలినంత చురుగ్గా ఎడమచేతి బొటనవ్రేలు కదలకపోవటంతో జాగ్వార్‌కి ఒక కన్ను మిగిలిపోయింది.

ప్రత్యర్థిని వదిలి ఎనిమిది అడుగులు వెనక్కు నడిచింది పులి. చెప్పలేనంత కోపం కల్గుతోంది దానికి.

ఒక కన్ను పోవటంతోబాటు శరీరంలో ఒక బాణం, మరొక డాగర్ దిగబడివుండటంతో ఎప్పుడూ ఏ క్రూర మృగానికీ రానంత ఆగ్రహం కల్గుతోంది!

పులి చూపులు తీక్షణంగా ఉన్నాయ్. మిగిలివున్న కంటితో ప్రతాప్ పీకను వెదుకుతోంది.

అప్పటికే లేచి సిద్ధంగా ఉన్నాడు ప్రతాప్.

ఆ పరిసర ప్రాంతాలు దద్దరిల్లేలా ఓసారి గాండ్రించింది జాగ్వార్. చటుక్కున గాల్లోకి లఘించింది.

అదే సమయంలో తుమ్మెద ఝుంకారాన్ని గుర్తుకు తెప్పిస్తూ వెంటవెంటనే రెండు బాణాలు దూసుకొచ్చి పులి ముఖంలో జొరబడ్డాయ్.

తనకు ఎవరో సహాయపడుతున్నట్టు ఆలస్యంగా అర్థమైంది ప్రతాప్‌కి. ఈసారి పులిని ఎదుర్కోవటం మాని, మెరుపువేగంతో ప్రక్కకు గెంతేసాడు.

గాల్లోకి ఎగిరిన పులి నేలను తాకింది. రెండు క్షణాల్లో మరో రెండు బాణాలు దాని కంఠంలో జొరబడ్డాయ్.

పులి గిల గిలా తన్నుకుంది. గాయాల్లోంచి ఆగకుండా స్రవిస్తూంది రక్తం. దాని శరీరంలో దిగిన బాణాలు విష పూరితం కావటంతో ఆ జంతువు బలం క్షణక్షణానికి క్షీణించిపోతోంది.

ప్రతాప్ చుట్టూ చూశాడు. ఎవరూ కనిపించలేదు.

జాగ్వార్ భీకరంగా గాండ్రిస్తూ, తోకతో నేలను బాదుతూ, కాళ్ళతో భూమిని అదరగొడుతూ నానా గొడవ చేయసాగింది. దాని జీవాత్మ భౌతిక దేహం నుండి

బయట పడటానికి తంటాలు పడుతోంది.

ముందుకు కదిలాడు ప్రతాప్. జాగ్వార్ శరీరంలో దిగి వున్న తన డాగర్ అందుకుని, దానిని అంటివున్న రక్తాన్ని జాగ్వార్ శరీరానికే తుడిచేసి, డాగర్ని బూట్లో దాచుకున్నాడు.

"నాకు సహాయం చేసిన వారెవరో దయచేసి కన్పించండి. కృతజ్ఞతలు చెప్పుకునే అవకాశం నాకు కల్పించండి!"

ప్రతాప్ మాటలకు కిల కిలా మంటూ నవ్వు విన్పించింది ఓ చెట్టు చాటునుంచి, వెంటనే ఓ యువతి ప్రత్యక్షమైంది.

ఆమెను పరిశీలనగా చూసాడు ప్రతాప్.

ప్రతాప్ చూపుల్లో చూపులు కలుపుతూ అందంగా నవ్విందామె. వయసు రెండు పదులకు మించి వుండదు. ఒంటిరంగు నలుపే అయినా నలుపులో ఏదో మెరుపుంది.

వెంట్రుకలు వెనక్కి విరబోసుకునుంది. తలపై రంగు రంగుల ఈకలు అలంకరించుకుని, మెడలో ఆకాశం రంగు పూసల దండలు ధరించింది. వక్షోజాల మీద ఎటువంటి ఆచ్ఛాదనా లేదు. నడుముకు జింక చర్మము చుట్టుకుంది. ఎడమ చేతిలో విల్లు వుంది. వీపుకు అంబుల పొది అడవి తీగలతో బిగించుకునుంది.

ఆ ఆటవిక స్త్రీ ప్రతాప్ ముందుకొచ్చి, అతనికి తెలియని భాషలో ఏదో అడిగింది.

నవ్వాడు ప్రతాప్. "నీ మాటల్లో ఒక్క అక్షరమైనా నా కర్థం కాలేదు" అన్నాడు స్వచ్ఛమైన తెలుగులో.

ఆవిడ ప్రతాప్ ముందు మోకాళ్ళపై చతికిల బడింది.

"సోయా...సోయా...సోయా" అంటూ ముమ్మారు తల వంకించింది.

ఆమె జబ్బ పట్టుకొని లేవదీసాడు ప్రతాప్. "ఇది ఏ ప్రాంతం?"

ఆమె ఓరగా ప్రతాప్ ముఖంలోకి చూసింది. అతని చేతిలో యిరుక్కున్న తన జబ్బను సున్నితంగా విడదీసుకొని, చావు బ్రతుకుల మధ్య గింజుకుంటున్న జాగ్వార్ వైపు కదిలింది.

ప్రతాప్ కర్తవ్యం తెలియని అమాయకునిలా నిలబడున్నాడు.

ఆమె, పులి శరీరంలో జొరబడున్న బాణాన్ని ఒక్కొక్కటే లాగేస్తోంది. లాగేసిన బాణాల్ని అంబులపొదిలో దాచుకుంటోంది.

జాగ్వార్ ఆఖరు శ్వాస వదిలేసింది.

ఆమె వెనుదిరిగి ప్రతాప్‌ను సమీపించింది, అతని చేయి అందుకొని తన వెంట రావల్సిందిగా సైగ చేసి చెప్పింది.

అర క్షణంలో ఒక నిర్ణయానికి వచ్చి, ఆమె వెంట బయలుదేరాడు ప్రతాప్.

# 8

బధకంగా తల అటు యిటు కదిలించాడు చందూర్.

కన్ను రెప్పల మీద టన్ను బరువు వుంచినట్టుగా అన్పిస్తోంది. నెమ్మదిగా కళ్ళు తెరిచాడు.

ఏదో దుర్వాసన ముక్కు పుటాల్ని బ్రద్దలు చేస్తోంది. రాతి గోడలు దృఢంగా కన్పిస్తున్నాయి. చమురు దీపం ఒక మూలగా వుంది. దాని వెలుగు సరిగా లేదు.

నెమ్మదిగా లేచి కూర్చున్నాడు చందూర్.

చేతులు రెండూ తన స్వాధీనంలోకి వచ్చినట్టు అర్థమైంది. అయినా భుజాలు ఇంకా బాధపెడుతూనే వున్నాయ్. లేచి నిలబడి చేతుల్ని విదిలించాడు.

అప్పుడు చూసాడు, ఒక ప్రక్కగా పడున్న జెనీసాని చక చక దగ్గరగా వెళ్ళాడు.

"జెనీసా..." భుజం పట్టుకుని కదుపుతూ నాలుగైదుసార్లు పిలిచాడు. లాభం లేకపోయింది. మత్తుగా నిద్రపోతూనే వుందామె.

జరిగిపోయిన సంఘటనలు ఒక్కొక్కటే గుర్తుకొస్తున్నాయ్ చందూర్‌కి. యూరోపియన్ వృద్ధుని రూపం కళ్ళముందు మెదిలింది.

వృద్ధుడు బలవంతంగా తనకు మత్తుమాత్రలు మింగించాడు. ఆ తర్వాత ఏమైంది? ఇది ఏ ప్రాంతం? తను రొడీషియాలోనే వున్నాడా? అసలు యిది ఆఫ్రికా ఖండమే కాదేమో!

వాచీలో టైం చూసుకోబోయాడు డిటెక్టివ్. వాచీ లేదు.

పాంటు జేబుల్లో తడుముకున్నాడు. ప్రత్యర్థులు తన వద్ద గుండుసూదికూడా మిగల్చకుండా తీసేసుకున్నారని తెల్సుకున్నాడు.

పన్నెండు అడుగుల పొడవు, పది అడుగుల వెడల్పు కల్గిన ఆ గది గోడల్ని మరొకసారి పరిశీలించి చూసాడు. ఒకవైపు గోడకు పది అడుగుల ఎత్తులో వుంది చిన్న వెంటిలేటర్ ఒకటి.

గది నేల దుమ్ము ధూళితో నిండివుంది. ఒకచోట ఏవో టైర్లు, చెక్కపెట్టెలు పడున్నాయ్. అటువైపు

వెళ్ళి చెక్కపెట్టెలు ఖాళీవని తెల్సుకున్నాడు.

ఉడెన్ డోర్‌ని లాగి చూసాడు. అది బయట తాళం వెయ్యబడిందని అర్థమైంది. కారు నిలుపుకోవటానికి ఉపయోగించే గారేజ్‌లా వుందా గది.

ఇది పగలు కాదు. రాత్రే! టైం తెలియటం లేదంతే! ప్రత్యర్థులు తన్ను తక్కువగా అంచనా వేసుకున్నారు. ఇప్పటివరకు తను ఊహించినట్టే జరిగింది. ఇహ సైంటిస్ట్ విషయం మాత్రమే మిగిలివుంది.

గదిలో పచార్లు ప్రారంభించాడు డిటెక్టివ్. అంత క్రితం జెనీసాతో గడిపిన ప్రణయ క్రీడలు గుర్తొచ్చాయ్. మగాణ్ణి ఉద్రేకపర్చటంలో, ఆతర్వాత తృప్తిపర్చటంలో ఆమెకు ఆమే సాటి! నవ్వుకున్నాడు.

హఠాత్తుగా గదితలుపు తెరుచుకుంది.

డిటెక్టివ్ పచార్లు మాని గుమ్మంవైపు చూసాడు.

యూరోపియన్ వృద్ధుడు, మరో యిద్దరు నీగ్రో యువకులు లోనికొచ్చారు.

వృద్ధుడు ఆజ్ఞాపించాడు. నీగ్రో యువకుల్లో ఒకడు జెనీసావైపు కదిలాడు. రైఫిల్ భుజానికి తగిలించుకుని చేతిలోని వాటర్ బాటిల్ మూత తీసి, బాటిల్లోని నీరు మొత్తం జెనీసా ముఖంమీద గుమ్మరించాడు.

మత్తుగా మూల్గి, తల అటు యిటు కదిలించింది జెనీసా.

ప్రత్యర్థుల చర్యల్ని మౌనంగా గమనిస్తున్నాడు చందూర్.

# 9

చందూర్, జెనీసా ప్రక్కప్రక్కనే నడుస్తున్నారు.

వారి వెనుక రైఫిల్స్ ధరించిన నీగ్రో యువకులు

అడుగులేస్తున్నారు. అందరికంటే ముందు వృద్ధుడు వెళ్తున్నాడు.

ఎదురుగా అధునాతన పద్ధతిలో నిర్మింపబడిన రెండు అంతస్తుల భవనం వుంది.

భవనం ముందు విశాలమైన ఖాళీస్థలం వుంది. దాని మధ్యలో చిన్న రన్ వే నిర్మింపబడింది. రెండు సింగిల్ యింజన్ విమానాలు రన్ వేమీద ఆగివున్నాయ్.

చందూర్, జెనీసా భవనంలోకి ప్రవేశపెట్టబడ్డారు. వృద్ధుడు యిటు తిరిగేసరికి ఇద్దరూ ఆగిపోయారు.

విశాలమైన హాలు అది. నేల కన్పించకుండా ఎర్రటి తివాసీ పరచబడింది. ఒకప్రక్కగా చిన్న డయాస్ వుంది. దానిమీద యినుప టేబిల్, కుర్చీ వున్నాయ్.

డయాస్ కెదురుగానున్న గోడవారగా వరుసగా కుర్చీలు వేయబడ్డాయ్.

డయాస్ మీదకు చేరుకొని కుర్చీలో కూర్చున్నాడు వృద్ధుడు. చందూర్ ని, జెనీసాని గోడవారగానున్న కుర్చీల్లో కూర్చోవల్సిందిగా ఆజ్ఞాపించాడు.

నీగ్రో యువకులు గుమ్మం దగ్గర నిలబడ్డారు రాతి విగ్రహాల్లా.

ప్రత్యర్థుల కీలక స్థావరం అదేనని వూహించుకున్నాడు డిటెక్టివ్. భయంకరమైన అడవి మధ్యలో అత్యంత అధునికమైన భవనం...రన్ వే ... విమానాలు ... డయాస్! రియలీ యు ఆర్ ఎ బ్రిలియంట్!

వృద్ధుని పెదవులు కదిలాయ్. "మిస్టర్ చందూర్! మిమ్మల్ని చంపటం మాకిష్టంలేదు. మా ఆర్గనైజేషన్ మీ వంటివారిని చేర్చుకోవటానికి యిష్టపడుతోంది..."

ఆగాడు. "మీ సమాధానం ఏమిటి?"

చందూర్ సూటిగా చూసాడు వృద్ధుణ్ణి. "మిస్టర్ రారోవ్! నువ్వు వృద్ధునివి కాదు. నీ వయసు పదహారు దాటలేదు. ఏమంటావ్?"

అదిరిపడ్డాడు వృద్ధుని రూపంలోనున్న రారోవ్. "వాట్ ఎ బ్రిలియంట్ యూ అర్? ఈ విషయం మీకెలా తెల్సింది?"

"నాకు ఇంకా చాలా విషయాలు తెల్సు రారోవ్! ఒక దేశ రహస్యాల్ని మరొక దేశానికి అమ్మి డబ్బు సంపాదించే వృత్తిలో అగ్రగణ్యుడు షోలెన్ టాకివా.

అతనికోసం ఇంటర్‌పోల్ వేట ప్రారంభించింది. క్రిమినల్స్‌కి పజిల్‌గా తయారైవున్న ఇండియన్ స్పెషల్ ఏజంట్ మిస్టర్ విక్రమ్ ఇంటర్‌పోల్ కోరికను కాదనలేక టాకివాకోసం హంటింగ్ మొదలుపెట్టాడు.

అరవై దేశాలు తిరిమి టొకివాను కుక్కను కాల్చినట్లు కాల్చేసాడు విక్రమ్. అతని ఆత్మశాంతికోసం డయానా తిరిగి విజృంభించింది. నిన్ను అడ్డుపెట్టుకుని ఆమె కథ నడిపిస్తోంది.

మిస్టర్ రారోవ్! టొకివా నీ తండ్రి అనీ, డయానా, నీవు ఒకే రక్తం పంచుకు పుట్టారని తెలుసు నాకు."

ఎగశ్వాస పీల్చి వదిలాడు పదహారేళ్ళ రారోవ్.

"మిస్టర్ చందూర్! మిమ్మల్ని గురించి మా సిస్టర్ చాలా చాలా చెప్పింది. ప్లీజ్ ...మా ఆర్గనైజేషన్‌లో సభ్యత్వం తీసుకోండి.

మీరు నాకు మాత్రమే విధేయులైవుంటారు. సంస్థకొచ్చే ఆదాయంలో పది పర్సెంట్ వాటా, నెలకు లక్ష

అమెరికన్ డాలర్లు జీతం మీకివ్వబడతాయ్. హైకమాండ్ ఆర్డర్స్‌ని మీరు ఎటువంటి పరిస్థితుల్లోనూ ఎదిరించకుంటే చాలు! బాగా యోచించి...వివేకంగా యోచించి సమాధానం ఇవ్వండి!"

చిన్నగా నవ్వాడు చందూర్. "రారోవ్! పిట్ట కొంచమైనా కూత ఘనంగానే వుంది. నా ప్రక్కనున్న జెనీసా ...ఇటువంటి ప్రాస్టిట్యూట్స్ అవసరం మీ సంస్థకు ఎందుకు కలిగింది?"

"ఆ విషయం మా సిస్టర్‌ని అడగాలి."

తిరిగి నవ్వాడు డిటెక్టివ్. "ఈ జెనీసా మీ సిస్టర్ డయానా కాదా?"

తన ముందున్న బల్లమీద పిడుగు పడ్డట్టు అదిరిపడ్డాడు రారోవ్.

# 10

గూడెంలో ఎటువైపు చూసినా కోలాహలంగా వుంది.

గూడెం మధ్యనున్న దేవతావిగ్రహం ముందు స్త్రీ పురుషులు గుంపులుగుంపులుగా కన్పిస్తున్నారు. స్త్రీలు బిగ్గరగా ఏవో పాటలు పాడుతున్నారు. మగవాళ్ళు లయబద్ధంగా డ్రమ్స్ వాయిస్తున్నారు. కుల పెద్ద కాబోలు... విగ్రహం ముందు నిల్చుని ఏవో మంత్రాలు వల్లిస్తున్నాడు.

నాయకుని గుడిసెలో అతని కూతురు సిగ్గుతో ముడుచుకు పోతోంది. ఆమెను ముస్తాబు చేస్తున్నారు నలుగురు యువతులు.

మరొక గుడిసెలో ప్రతాప్ పరిస్థితి మరీ ఘోరంగా వుంది. అతని దుస్తులు తీసివేసారు. జంతుచర్మాలతో, పక్షుల ఈకలతో అలంకరిస్తున్నారు.

మరొక ఘడియలో ప్రతాప్ వివాహం గూడెం నాయ కుని కూతురితో జరుగనున్నది.

పచ్చివెలక్కాయ కంఠంలో ఇరుక్కున్నట్టు బాధ పడుతున్నాడు ప్రతాప్. అతను వూహించని పరిస్థితి ఎదురైంది. అక్కణ్నుంచి పారిపోవాలని చూస్తున్నాడు. సమయం అనుకూలించటంలేదు. ఆటవిక యువకులు అతణ్ణి వదలటంలేదు.

పావుగంట గడిచింది.

ప్రతాప్‌ని అలంకరించటం పూర్తయ్యింది.

మెరుపులా ఏదో యోచన ప్రతాప్ బుర్రలో మెరిసింది. తన చుట్టూ వున్న ఆటవిక యువకులకు సైగచేసి చెప్పాడు, అందరినీ గుడిసెలోంచి బయటకు వెళ్ళమని, తను దైవప్రార్థన చేసుకోవాలని.

ఆటవిక యువకులు ఒకరి ముఖా లొకరు చూసుకు న్నారు. రెండు నిమిషాల తర్వాత అందరూ ఒక నిశ్చ యానికి వచ్చి గుడిసెలోంచి బయటకు నడిచారు.

వెదురుబొంగుల తలుపు మూసి గడియ బిగించాడు ప్రతాప్. అతని గుండెలు దడదడలాడుతున్నాయ్.

పరిస్థితులు ఎదురుతిరిగినప్పుడు పాపపుణ్యాల గురించి యోచించటం మూర్ఖత్వం అవుతుందని అతనికి తెలుసు. గుండెను రాయిచేసుకొని గుడిసెలో వెలుగుతున్న చమురు దీపంవైపు అడుగులు వేసాడు.

క్షణాలు భారంగా కదులుతున్నాయ్.

గుడిసెకు నిప్పంటుకుంది.

గుడిసె బయటనుంచి కేకలు ప్రారంభమయ్యాయ్. ప్రతాప్ తలుపు తెరిచాడు. భయం నటిస్తూ గుడిసెలో ఒక ప్రక్క వదిగి నిల్చుండిపోయాడు.

ఆటవిక యువకులు ప్రతాప్‌ని గుడిసెలోంచి బయటకు లాక్కుపోయారు. మంటలు ఆర్పే ప్రయత్నాలు మొదలయ్యాయ్.

నిమిషాలమీద గూడెంలోని పిల్లలు, వృద్ధులు, ఆడ, మగ అందరూ మండుతున్న గుడిసె ముందు చేరిపోయారు. కేకలు, అరుపులు మిన్నుముట్టాయ్.

మంటలు విజృంభించాయ్. అందరూ చూస్తుండగానే మొదటి గుడిసె దగ్ధమైపోయి, మంటలు రెండో గుడిసె వైపు ప్రాకాయ్.

తన విషయం ఎవరూ పట్టించుకోవటం లేదని అర్థమైంది ప్రతాప్‌కి. నెమ్మదిగా చీకట్లోకి తప్పుకొని, నిమిషాలమీద అడవిలోకి ప్రవేశించాడు. ఆత్మరక్షణకు ఉపకరిస్తుందనే ఉద్దేశ్యంతో ఓ గుడిసె చాటున చిక్కిన విరిగిపోయిన బరిసె తెచ్చుకున్నాడు.

చకచక నడుస్తున్నాడు ప్రతాప్. ప్రయాణం యెటువైపు సాగుతున్నదో తెలియదు. వెనక్కి తిరిగి చూడకుండా అరుమైళ్ళ దూరం నడిచాడు.

హఠాత్తుగా "ధన్ ..." మంటూ గన్ ప్రేలిన చప్పుడు దూరంనుంచీ విన్పించింది.

టక్కున ఆగిపోయాడు ప్రతాప్.

ఎవరు ప్రేల్చారు గన్? సమీపంలో ఎక్కడో నాగరికులు వున్నారు. ఎవరైనా వేటకోసం వచ్చారేమో!

మరొక దారివెంట వెళ్ళటం యిష్టంలేక గన్ ప్రేలిన చప్పుడు విన్పించిన దిశగానే ప్రయాణం సాగించాడు.

# 11

చందూర్‌వైపు తల తిప్పి మందహాసం చేసింది, అప్పటివరకు జెనీసాలా వ్యవహరించిన డయానా.

చటుక్కున కుర్చీలోంచి లేచి డయాస్ మీదకు చేరు కుంది. తన తమ్ముడు కూర్చునున్న కుర్చీప్రక్కనే నిలబడిం దామె.

"మిస్టర్ చందూర్! మీ మేధస్సు ఎలాంటిదో నాకు తెలుసు. అయినా నన్నెలా అనుమానించగలిగారో, తెల్సుకోలేక పోతున్నాను. అభ్యంతరం లేకుంటే చెప్పండి?" అడిగింది.

డిటెక్టివ్ పెదవులు కదిలించాడు. "మిస్ డయానా! మీ తండ్రి వివరాలు ఇంటర్‌పోల్ ఫైల్స్‌లో వున్నాయ్. ఆయన వివరాలు మాత్రమే కాదు, ఆయన కుటుంబ సభ్యుల వివరాలుకూడా ఆ శాఖ సేకరించింది. నీవు నీ సోదరునితో కల్సి రకరకాల నేరాలు చేస్తూ ప్రపంచ మంతా తిరుగుతున్న సంగతి ఇంటర్‌పోల్ ఏజంట్సుకి తెలుసు.

వారికి తెల్సిన సమాచారం ప్రకారం నీ పేరు గ్లాసీ. డయానాలా క్రొత్త అవతారం దాల్చిన యువతి నీవే అయివుండాలని నేను ఈ ఎసైన్‌మెంటులో పాల్గొ న్నపుడే అనుమానించాను.

అంతక్రితం ఇంటర్‌పోల్ క్రైమ్స్ ఇన్వెస్టిగేటర్ - డయానాలా వ్యవహరిస్తున్న నీతో పరిచయం పెంచు కున్నాడు. నీ ఎడమచేతికి ఆరువ్రేళ్ళు వున్న సంగతి తెల్సుకుని హెడ్ క్వార్టర్స్‌కి మెసేజ్ పంపించాడు. ఆ తర్వాత అతన్ని నీవు చంపేసావ్. అది వేరే విషయం.

నాకు తెల్సిన ప్రాస్టిట్యూటు జెనీసా యెడమచేతికి కూడా ఆరువ్రేళ్ళు వున్నాయ్. జెనీసా, డయానా అయి వుండాలని ఆ క్షణాల్లోనే అన్పించింది. అనుమానం తీర్చు

కోవటానికి సాలిస్‌బరి వచ్చాను. నా సందేహం తీరి పోయింది. అరవ ప్రేలును ఆపరేట్ చేయించుకున్నావ్. అది గమనించీ మౌనంగా వుండిపోయాను."

"ఎందుకు?" నవ్వింది డయానా వురఫ్ క్లాసీ. "మీకు కావల్సిన స్త్రీని నేనే అని తెలిసికూడా ఎందుకు ఊరు కున్నారు?"

"నువ్వు కిడ్నాప్ చేసిన భారత సైంటిస్టు విషయం తెల్సుకోవటానికి."

దీర్ఘంగా గాలి పీల్చి వదిలిందామె. "మిస్టర్ చందూర్! మన పరిచయం ఈ నాటిది కాదు. సైంటిస్ట్ నా అధీనంలో నున్నమాట నిజమే. గతం మర్చిపోదాం! మీతో చేయి కలపటానికి నేను యిష్టపడుతున్నాను."

తల అడ్డంగా ఊపాడు చందూర్. "నీవంటి ట్రబుల్ మేకర్స్‌ని ఏరివెయ్యటం నా వృత్తి. మనం ఒకేజాతి పక్షులం కాదు. ఒకే చెట్టుమీద నివసించటం జరగదు."

"ట్రబుల్ మేకర్స్..." ఒత్తి పలికిందామె. "నిజమే. ఎందరికో మేము ట్రబుల్ యిస్తున్నాం. ప్రస్తుతం నా అనుచరులు ప్రపంచం నలుమూలలా వున్నారు. ఇంకా మీవంటి మేధావుల అవసరం నాకెంతైనా వుంది. మిస్టర్ చందూర్! మీ కిష్టమైతే నాకు బాడీగార్డ్‌గా వుండండి. అనతికాలంలో వరల్డ్ గవర్నమెంటు స్థాపించటానికి ప్రయత్నిద్దాం!"

క్లాసీ జీవితాశయం ఎంతటి భయంకరమైనదో అర్థ మైంది డిటెక్టివ్‌కి.

చటుక్కున జుత్తులో ప్రేళ్ళు దూర్చి చిన్న మెటల్ బాల్‌ని తీసాడు. మరుక్షణంలో మెటల్ బాల్ గుమ్మం

ముందు పడి బ్రద్దలైంది. విపరీతంగా పొగ బయలుదేరిం దక్కడ.

డిటెక్టివ్ లేచి డయాస్ వైపు పరుగెత్తాడు.

"ధన్..." మంటూ ప్రేలింది రైఫిల్. బుల్లెట్ డిటెక్టివ్ భుజాన్ని రాసుకుంటూ వెళ్ళి గోడను గుద్దుకుంది.

"షూట్...కిల్ హిమ్..." అరుస్తోంది క్లాసీ.

గుమ్మంవద్ద నున్న నీగ్రో యువకులు గన్స్ ఉపయోగించలేక పోతున్నారు. పొగ వారిని ఉక్కిరిబిక్కిరి చేస్తోంది. మొదట రైఫిల్ ప్రేల్చిన వ్యక్తే తిరిగి ట్రిగ్గర్ నొక్కాడు.

"ధన్..." మనే చప్పుడు ఆ కాంక్రీటు భవనంలో పిడుగుపాటులా ధ్వనించింది.

వెంటనే చావుకేక విన్పించింది.

కెవ్వున అర్చింది క్లాసీ.

# 12

దూరంగా కన్పిస్తున్న విద్యుత్ దీపాల మీద దృష్టి నింపి వేగంగా పరుగెత్తుతున్నాడు ప్రతాప్. విరిగిన బరిసెను గట్టిగా పట్టుకొని రకరకాల యోచనలతో దూసుకెళ్తున్నాడు.

భయంకరమైన క్రూర మృగాలతో అంతకంటే భయంకరమైన ఆటవికులతోను నిండిన అడవిమధ్య ఎలక్ట్రిక్ దీపాలు ఎలా వచ్చాయ్? గన్స్ ప్రేలుళ్ళని ఏ విధంగా వూహించుకోవాలి?

అనవసరమైన విషయాల్లో తల దూర్చటం వల్ల క్రొత్త ప్రమాదాలు ఎదురయ్యే ప్రమాదం వుంది. తను మృత్యుముఖానికి వెళ్ళటం లేదు కదా!

ఆలోచనలతోబాటు పరుగుకూడా ఆపలేదు ప్రతాప్. మరో రెండు నిమిషాల తర్వాత కాంక్రీటు భవనం ప్రాంతాలకు వచ్చాడు.

విద్యుత్ ఉత్పత్తి చేసే జనరేటర్ చప్పుడు విన్పించి ఆగిపోయాడు. ఎగశ్వాస పీల్చి వదిలి, చెట్లు దూసుకుంటూ చీకట్లో ముందుకు కదలసాగాడు.

ఎత్తుగా నున్న ప్రహారీ గోడ గంభీరంగా కన్పిస్తోంది. దాని కటుప్రక్క నుంచి విన్పిస్తోంది జనరేటర్ పనిచేస్తున్న ధ్వని. రన్‌వే మీద ఆగివున్న విమానాలు అస్పష్టంగా కన్పించాయ్ ప్రతాప్‌కి.

అతని ఆలోచనలు మరో దారి పట్టాయ్.

మెయిన్ గేటుకు దూరంగా ప్రహారీ గోడను ఆనుకొని క్రీనీడలో నిలబడ్డాడు. ఇంటర్‌పోల్‌కి పజిల్‌గా తయారై వున్న డయానా రహస్య కీలక స్థావరం యిది కాదని నమ్మకం ఏమిటి? అదే నిజమైతే తను సరైన చోటుకే వచ్చాడన్న మాట.

"హేండ్సప్!"

అదిరిపడి చేతులెత్తాడు ప్రతాప్. బరిసె అప్రయత్నంగా జారిపోయింది.

చీకట్లోంచి ముందుకొచ్చాడు జోమో. ఆటవిక యువకుని వేషంలో నున్న ప్రతాప్‌ని పరిశీలనగా చూశాడు.

"ప్రతాప్! ఈ వేషం నీకు చాలా బావుంది" నవ్వాడు. "చేతులెత్తమని నేను యింగ్లీష్‌లో చెప్పిన విషయం నువ్వు అర్థం చేసుకోగలిగి, ఆచరించగలిగావంటే అప్పుడే అనుకున్నాను, నువ్వు ఆటవిక యువకుడు కాదని. బైదిబై—ఎలా బ్రతికావ్?"

ఆఫ్రికన్ కోబ్రాలా బుస వదిలాడు ప్రతాప్.

"శాబ్రేమేడ్ జోమా! నిరంతరం నీతిని వరించటానికే యిష్టపడుతుంటుంది విజయలక్ష్మి. నీ పాపం పండి పోయింది. అందుకే మనం తిరిగి కల్సుకోవటం జరిగింది."

క్రూరంగా నవ్వాడు జోమా. అతని చేతిలోని ఆటో మేటిక్ సేఫ్టీ కాచ్ క్లిక్ మంది.

"ఆరిపోయే దీపానికి వెలుగు ఎక్కువ. దేవుని మీద నమ్మకం వుందా?"

"అంతిమ దైవ ప్రార్థన చేసుకునే వాణ్ణి కాను నేను నీ చేతుల్లో చావటం నా కిష్టం లేదు."

మరోక అడుగు ముందు కొచ్చాడు జోమా. "ఇండి యన్స్‌కి అరుపు లెక్కువని నాకు తెలును. అయాం వెరీ సారీ! యు ఆర్ గోయింగ్ టు డై..."

జోమా మాటలు పూర్తికాక మునుపే మెరుపులా మెరిసాడు ప్రతాప్. భూమిని బలంగా కాళ్ళతో తన్ని స్ప్రింగ్‌లా పైకెగిరి కాంపౌండ్ వాల్ మీద నిల బడ్డాడు.

అదిరిపడి ట్రిగ్గర్ నొక్కేశాడు జోమా. అప్పటికే అటు వైపు దూకేశాడు ప్రతాప్ ముందు వెనుకలు ఆలోచించ కుండా. బుల్లెట్ అతని మీదనుంచి దూసుకుపోయింది— గాల్లోకి.

మెయిన్ గేటువైపు పరుగెత్తాడు జోమా.

గేటు ముందున్న సెక్యూరిటీ గార్డ్స్ రైఫిల్స్ సరి చేసు కున్నారు. జోమాని గుర్తించి తిరిగి కూల్ అయ్యారు.

"శత్రువు మన స్థావరంలోకి ప్రవేశించాడు. వెళ్ళండి వెతకండి...కన్పిస్తే నిర్దయగా కాల్చెయ్యండు......"

అరుస్తూ గేటు దాటి ముందుకు పరుగెత్తాడు శ్రీమా.

అతని వెనుకే దూసుకెళ్ళారు గార్డ్స్.

# 13

భవనం పై భాగంలోంచి రైఫిల్స్ ధరించిన క్లాసీ అనుచరులు గబగబ క్రిందికు పరుగెత్తుకొస్తున్నారు. అపాయాన్ని సూచించే అలారం భవనంలోని అన్ని గదుల్లోనూ ఆగకుండా మ్రోగుతోంది.

కుర్చీలో వెనక్కి వాలిపోయి వున్నాడు రారోవ్. అతని నుదురుగుండా ప్రయాణం చేసింది బుల్లెట్. బుల్లెట్ చేసిన గాయం వికృతంగా నల్లగా కన్పిస్తోంది.

తమ్ముణ్ణి...తన తమ్ముణ్ణి ఆ స్థితిలో చూడవలసి వస్తుందని వూహించనైనా లేదు క్లాసీ. ఆమె మెదడు మొద్దుబారిపోయి చాలా సేపైంది. బల్లమీద, నేలపైన ఒలికిన రారోవ్ రక్తం చూస్తుంటే ఆమెకు దుఃఖం ఆగటం లేదు.

అప్పటికే ఆ హాల్ పొగతోనూ, క్లాసీ అనుచరులతోను నిండిపోయి వుంది.

"మిస్ డయానా వురఫ్ క్లాసీ..." లో గొంతుకతో చెప్పాడు చందూర్. "మర్యాదగా నీ అనుచరుల్ని లొంగిపొమ్మని చెప్పు! లేకుంటే మిగిలివున్న నీ ప్రాణాలుకూడా దక్కవు."

గిరుక్కున ప్రక్కకు తిరిగింది క్లాసీ. దట్టంగా వున్న పొగలో అస్పష్టంగా కన్పించింది చందూర్ ఆకారం.

"మిస్టర్ చందూర్ మీ నెత్తురు త్రాగేవరకు నా కోపం చల్లారదు..." కోపంతో కొబ్రాలా కాస్సేపు బుసలు కొట్టిందామె.

"శత్రువు నా ప్రక్కనే డయాస్ మీద వున్నాడు. నేను చచ్చినా పర్వాలేదు... ఫైర్!" అరిచేసింది.

రైఫిల్ బోల్టులు విచిత్రంగా చప్పుడు చేయసాగాయ్. "ధన్...ధన్...ధన్..."మనే ధ్వనులు అధిక మయ్యాయ్ క్షణాలమీద.

భీకరంగా గావుకేక పెట్టాడు చందూర్. వెంటనే కంఠం మార్చి, క్లాసీ కంఠాన్ని అనుకరిస్తూ "శత్రువు చచ్చాడు" అంటూ అరిచాడు.

డిటెక్టివ్ ఎత్తు గ్రహించేసింది క్లాసీ. అయినా ఏం చెయ్యలేకపోయింది.

ఆమె నోరు డిటెక్టివ్ నొక్కేసి వున్నాడు. డయాస్ మీద వున్న బల్ల క్రిందున్నారు యిద్దరూ. క్లాసీ డిటెక్టివ్ చేతుల మధ్య ఒడ్డునపడిన చేపలా గింజుకుంటోంది.

కాల్పులు ఆగిపోయాయ్ తాత్కాలికంగా. క్లాసీ అనుచరులు డయాస్ వైపు పరుగెత్తుకొస్తున్నారు. వారి బూట్లు చేస్తున్న ధ్వని ఆ హాల్లో ప్రతిధ్వనిస్తోంది.

పొగ యింకా విడిపోలేదు.

క్లాసీ అనుచరులు ఒకరికొకరు గుద్దుకుంటూ అటు ఇటు తిరుగుతున్నారు. దగ్గకుండా ఒక్కరైనా వుండలేకున్నారు. అందరి కళ్ళవెంబడీ వేడినీళ్ళు ఆగకుండా కారిపోతున్నాయ్.

ఇద్దరు వ్యక్తులు హాల్లోంచి బయటకు వెళ్ళటం క్లాసీ అనుచరులు ఆలస్యంగా గమనించారు. ఆ ఇరువురిలో ఒక వ్యక్తి చందూర్. రెండో వ్యక్తి తమ యజమానురాలు అందరి గుండెలూ అదిరాయ్. రైఫిల్ బోల్టులు మూస్తూ గుమ్మంవైపు పరుగెత్తబోయారు. అప్పటికే ఆలస్యం అయిపోయింది. తలుపులు మూసుకుపోయాయ్.

# 14

భవనం పడిప్రక్కనున్న గాజు కిటికీ భళ్ళున బ్రద్దలైంది. మరు నిమిషంలో ఓ ఆకారం పై అంతస్తునుండి పగిలిన కిటికీగుండా క్రిందకు దూకింది. ఆ ఆకారం చేతులు వెనక్కి విరిచి కట్టబడున్నాయ్.

అదే సమయంలో ఆ ప్రాంతానికి చేరుకున్న జోమా ఆ ఆకారాన్ని గుర్తించి తృళ్ళిపడ్డాడు.

"మై డియర్ ఇండియన్ సైంటిస్ట్! గెటప్...పిచ్చి వేషాలు వేసావంటే కాల్చేస్తాను. మర్యాదగా లేచి నిలబడు."

ఇండియన్ సైంటిస్ట్ భరద్వాజ బోర్లా తిరిగి, మొదట మోకాళ్ళమీద లేచి, ఆతర్వాత నింపాదిగా లేచి నిల్చున్నాడు. నడుము కలుక్కుమంది. ఆ బాధను గురించి యోచించకుండా దడదడలాడే గుండెలతో యిటు తిరిగాడు.

ఎదురుగా రివాల్వర్‌తో కాలరుద్రునిలా నిలబడున్న జోమా కన్పించాడు.

కసిగా నవ్వాడు జోమా. "పారిపోవటానికి సరైన సమయం ఎంచుకున్నారు. కాని, మీ ప్రయత్నం భగ్నమైంది. ఊ...అలాగే ముందుకు రండి!"

రెండడుగులు ముందుకేసాడు భరద్వాజ.

అంతే! జోమా నెత్తిన బలమైన దెబ్బ పడింది. పిడుగుపాటులాంటి దెబ్బ!

బిగ్గరగా అరవబోయి వ్యవధి చాలక కొండ చిలువలా మెలికలు తిరిగిపోతూ నేలకు ఒరిగిపోయాడు జోమా. అతని తల రెండుగా పగిలిపోయింది. చిక్కటి నెత్తురులో

అప్పటికే అతని దుస్తులు తడిసిపోయాయ్,

చేతుల్లోని రాతిబండను ప్రక్కన పడేసాడు ప్రతాప్. చటుక్కున ముందుకు దూకి సైంటిస్ట్, జోమాల మధ్య పడున్న రివాల్వర్ని అందుకున్నాడు.

సెక్యూరిటీ గార్డ్స్ యిద్దరూ అటువైపు పరుగెత్తుకొస్తున్నారు. జోమా అక్కడున్నారని వారికి తెలుసు. అందుకే రైఫిల్స్ ప్రేల్చకుండా దూసుకొస్తున్నారు.

అరక్షణమైనా ఆలోచించలేదు ప్రతాప్. వరుసగా రెండుమార్లు ట్రిగ్గర్ నొక్కాడు.

గార్డ్స్ వికృతంగా అరుస్తూ వెనక్కు విరుచుకొపడ్డారు.

"ప్రతాప్!"

తన చెవుల్ని తానే నమ్మలేకపోయాడు ప్రతాప్. అది చందూర్‌గారి కంఠమే. వేగంగా కదిలాడు శబ్దం విన్పించిన వైపు. ఏవో పూలచెట్ల చాటున కన్పించారు చందూర్, క్లాసీ.

"సర్, ఈవిడ..." ఆగాడు ప్రతాప్.

"డయానా వురఫ్ క్లాసీ. ఈ డెవిల్‌ని తీసుకెళ్ళి ఓ ప్లెయిన్‌లోకి చేర్చు మొదట. ఈమె అనుచరులు భవనం నిండా వున్నారు...మూవ్! సైంటిస్ట్ భరద్వాజకోసం తిరిగి నేను భవనంలోకి వెళ్ళాల్సి వుంది..."

"సర్...భరద్వాజగారు తప్పించుకున్నారు. ఇప్పుడు యిక్కడే వున్నారు" చెప్పాడు ప్రతాప్.

## 15

సైంటిస్ట్ భరద్వాజను తీసుకొని రన్‌వేమీద ఆగివున్న ప్లెయిన్స్‌వద్దకు వచ్చాడు ప్రతాప్. అదే సమయంలో

క్లాసీని తీసుకొని అక్కడకు చేరుకున్నాడు చందూర్.

సైంటిస్ట్ చేతులకున్న కట్లు విప్పేసి, వాటినే ఉపయోగించి క్లాసీ చేతుల్ని వెనక్కి విరిచి కట్టేసాడు ప్రతాప్.

ప్రతాప్ ప్లెయిన్ నోస్‌వైపు పరుగెత్తాడు. గట్టిగా తిప్పాడు ప్రొఫెల్లర్‌ని. రెండవసారి త్రిప్పిన వెంటనే స్టార్టయ్యింది యింజన్. అక్కడున్న రెండు విమానాలూ సింగిల్ యింజన్‌తో నడిచేవే.

"ధన్...ధన్..." మంటూ ప్రేలుళ్ళు ప్రారంభమయ్యాయ్. భవనం టెర్రస్ మీదకు చేరుకొని రైఫిల్స్ ప్రేలుస్తున్నారు క్లాసీ అనుచరులు.

అప్పటికే సైంటిస్ట్‌ని, క్లాసీనీ ప్లెయిన్‌లోకి చేర్చి, తనూ చేరుకున్నాడు చందూర్. "ప్రతాప్! క్విక్..." అరుస్తున్నాడు.

రెండుక్షణాల్లో ప్లెయిన్‌లోకి చేరుకున్నాడు ప్రతాప్. చందూర్ అధ్వర్యంలో ప్లెయిన్ ముందుకు కదిలింది, రన్‌వే మీద.

భవనం పైభాగంలో నున్న క్లాసీ అనుచరులు హాండ్ గ్రనేడ్స్ విసిరారు. లాభం లేకపోయింది. రన్‌వేమీద పడి ప్రేలిపోతున్నాయ్ గ్రనేడ్లు.

మధ్యమధ్యలో రైఫిల్స్ గర్జిస్తున్నాయ్.

రన్‌వే చివరకు వెళ్ళి హాఠాత్తుగా గాల్లోకి లేచింది ప్లెయిన్. ఏటవాలుగా వెయ్యిఅడుగుల ఎత్తుకు దూసుకెళ్ళింది క్షణాలమీద.

లెఫ్ట్ బాంక్ టర్న్ చేసాడు చందూర్. ఇంజన్ ప్రతాప్‌కి అప్పగించాడు.

"ప్లెయిన్‌ని తిరిగి ఆ భవనంమీదకు తీసుకెళ్ళు"

అన్నాడు కాళ్ళకున్న బూట్లు విప్పదీస్తూ.

ఆశ్చర్యపోయింది క్లాసీ. ఏమిటి చందూార్ ఉద్దేశ్యం? పారిపోవటానికి అవకాశం చిక్కినా, తిరిగి మృత్యు ముఖానికి వెళ్ళటంలో డిటెక్టివ్ పథకం ఏమై వుండొచ్చు?

సైంటిస్ట్‌కి అసలు ఏమీ అర్థం కావటంలేదు.

ప్రతాప్ క్షణాలమీద ప్లెయిన్‌ని ట్రబుల్ మేకర్స్ కీలక స్థావరంమీదకు తీసుకొచ్చాడు.

ఒక బూట్‌ని ఏదో లాగేసి భవనంమీద పడేసాడు చందూార్. రెండో బూట్ రన్‌వేమీద ఆగివున్న మిగిలిన ప్లెయిన్ మీద పడి; వెంటనే బ్రద్దలైంది భయంకరంగా.

భవనంమీద పడిన బూట్ ఆ తర్వాత ప్రేలింది భూనభోంతరాళాలు దద్దరిల్లేలా.

ప్రతాప్ నడుపుతున్న ప్లెయిన్ అప్పటికే ఆ ప్రాంతం నుంచి దూరంగా వచ్చేసింది.

చందూార్ దూరదృష్టి యెలాంటిదో అర్థమైంది మిగిలిన ముగ్గురికీ.

ప్లెయిన్ వేగంగా ముందుకు దూసుకెళ్తోంది.

—: ఐ పో యిం ది :—



[మొదటి భాగము]

అది మిలటరీ సెంట్రల్ జైల్!

డెహెరాడూన్ పొలిమేరల్లో నిర్మించబడ్డ రాతి కట్టడం!

జైలు గోడలు తాటి చెట్టంత ఎత్తు ఉంటాయ్.

గోడల మందం నాలుగడుగులు.

గోడల ఆవలివైపు ఏడడుగుల దూరం పరచుకున్న కందకాలు!

కందకపుటంచుల పొడవునా కంటికి కనిపించని అతి

సన్నని రాతి తీగల ఫెన్సింగ్ వుంటుంది...

సెల్ లో వెల్లకితలా పడుకొని ఆలోచిస్తున్నాను.

ఆరు నెలలయింది _ దగ్గరగా జరిగిపోయినట్లున్న ఆ నాలుగు గోడల మధ్యా నేను ప్రవేశించి.

ఎంత గౌరవంగా బ్రతికేవాడిని ఆర్నెల్ల క్రితం!

యిప్పుడూ బ్రతుకుతున్నాను.

ఒకే తేడా___

ఇన్నాళ్ళు బ్రతకడాన్కి మాత్రమే తినేవాడిని.

యిప్పుడు తినడానికి మాత్రమే బ్రతుకుతున్నాను జైలులో.

జీవితంమీద రోతపుడుతోంది...

అలవాటుగా మీసాలను మునివేళ్ళతో స్పర్శిస్తూ ఆలోచిస్తున్నాను.

ఎందుకు చేసా నా దగుల్బాజీ పని?

ఆ సంఘటన జ్ఞాపకం వస్తోంది.

ఒళ్ళంతా చెమటలు పట్టసాగింది.

ఏదో బలహీనత నన్ను వరిస్తోంది.

తోడు ఎవరూ లేరు, కష్టం చెప్పుకొని గుండె బరువు దించుకోడాన్కి.

సెల్ కి ఒక్కడే.

పగలూ, రాత్రీ గదిలో ఒంటరిగా___భయంకరమైన వంటరి తనంలో___కళ్ళు మూసుకున్నాను.

గణగణ గంట ఎక్కడో మ్రోగింది.

క్లిక్ మన్న శబ్దం...తర్వాత 'బర్' మన్న ధ్వని...

నెమ్మదిగా కళ్ళు తెరిచాను.

భుజానికి యిషాపూర్ రైఫిల్ తగిలించుకొని, ఖాకీ దుస్తులు ధరించిన ఓ వ్యక్తి కటకటాలు తెరిచి మౌనంగా మరో గదివేపు మళ్ళాడు.

సాయంత్రం అయిదయిందన్నమాట.

"టైం ఫర్ టీ!"

తాత్కాలికమైన ఆట విడుపు సమయమది.

టీ తాగి లైబ్రరీకి వెళ్ళొచ్చు. లేదా టి. టి. రూంకు వెళ్ళి టేబుల్ టెనీస్ ఆడుకోవచ్చు.

ఆ రెండు సదుపాయాలు, ఉన్నాయ్ జైల్లో,

అలస్యంగా కూడా ఆరు గంటలకల్ల తిరిగి సెల్ లోకి రావాలి.

అలస్యం జరగదసలు.

వీపులో దేనితోనో గుచ్చుతూ, నోటితో అరుస్తూ ముందుకుతోసే వాళ్ళుంటారు.

సెల్ లోంచి బయటకి నడిచేను.

ఓసారి బద్ధకంగా ఒళ్ళు విరుచుకొన్నాను.

టీ మగ్ పట్టుకుని ఖైదీల 'క్యూ'లో నిలబడ్డాను.

ఆ క్రియ మొదట్లో ఎంతో హీనంగా అనిపించేది.

అలవాటయిందిప్పుడు.

ఓ వ్యక్తి సెర్వ్ చేస్తున్నాడు టీ.

అయిదు నిముషాల తర్వాత నావంతు వచ్చింది.

టీ మగ్గు పట్టుకొని దూరంగా కాంపౌండ్ వాల్ వేపు నడిచేను.

ఆరోజు ఎవరితోనూ మాట్లాడాలనిపించటం లేదు.

టీ మగ్గులు చేతుల్లో పట్టుకొని అక్కడక్కడ ఖైదీలు గుంపులు గుంపులుగా చేరి ఆనందంగా మాట్లాడుకోవడం గమనించేను.

బ్లాక్ టీ చప్పరిస్తూ మధ్యమధ్యలో ఆకాశంలో ఎగురుతున్న పక్షుల వంక ప్రేమగా చూస్తున్నాను.

తేనీటిపానం పూర్తయింది.

రంగులూడిపోయిన మగ్గుని శుభ్రంగా కొళాయిదగ్గిర కడిగి, సెర్వర్ కెదురుగా వున్న టేబుల్ మీద పెట్టి లైబ్రరీగదివేపు నడిచేను.

ఆ గదిముందు ఓ వ్యక్తి — టేబుల్ వెనక కూర్చున్నాడు. టేబుల్ మీద రిజిష్టరు పుస్తకం వుంది. దాని ప్రక్కనే ఓ పెన్ వుంటుంది. పెన్ క్యాప్ ని దారంతో కట్టేశారు టేబుల్ చివరికి. వేళాకోళానికి క్యాప్ లేకుండా పెన్ ఎవరూ ఎత్తుకుపోడని వాళ్ళ ధైర్యం.

టైమ్ నోట్ చేసి సంతకం చేసి లోనికి వెళ్ళాలి.

“ఎంత?” అడిగేను పెన్ చేతిలోకి తీసుకొని.

“ఏమిటి?”

“టైం”

“పదూ పది.”

రిజిష్టర్లో రాయబోయాను, ఊహు. వ్రాయడం లేదది. పరిశీలించాను పెన్నుని. పాళీ విరిగి వుంది. ఏ ఖైదీయో ఒళ్ళుమండి కామ్ గా విరిచేసుంటాడు.

“దూస్ రా హైహాంక్యా?” అడిగేను లైబ్రరీ ఏటెండర్ని.

అతను నవ్వుతూ ఓ బాల్ పెన్ అందించేడు.

టైం నోట్ చేసి సంతకం చేసాను. పెన్ తిరిగి యివ్వబోయేను. ఆ టెండర్ ఎందుకో ఓసారి అటూ ఇటూ చూసేడు.

“అది మీ దగ్గరే వుంచండి” అన్నాడతను.

“ఏం...ఏదో అడగబోయేను.

"ప్లీజ్! ఏం మాట్లాడొద్దిక్కడ. సెల్‌లోకి వెళ్ళిన తర్వాత రీఫిల్ చూడండి. మీ కుపయోగపడుతుంది. దాచండిప్పుడు వెంటనే. మూవ్ ఆన్ ప్లీజ్." తగ్గు స్వరంలో వెలువడ్డ అతని మాటల్లో కంగారు ధ్వనించింది.

నాకంతా అయోమయంగా వుంది.

అతని మాటల్లోని ఒక్క పదం కూడా సరిగా నాకర్థం కాలేదు.

అలాగని యిప్పుడేమీ అడగొద్దంటున్నాడు.

రిజిష్టరులోకి చూస్తున్నట్లు నటిస్తూ చటుక్కున ఆ బాల్ పెన్‌ని గళ్ళనిక్కర్ జేబులోకి తోసేను.

నా మెదడులో ప్రశ్నలు పాము పిల్లల్లా కదిలాయ్.

ఎందుకో నాకా బాల్ పెన్ రీఫిల్?

జైల్లో కూర్చుని స్వీయ చరిత్ర రాసుకోడానికా?

అన్యమనస్కంగా ముందుకి నడిచేను.

* * *

ఆ రోజు ఏ పుస్తకంమీదా పోలేదు మనసు.

రాక్స్‌లోని పుస్తకాలన్నీ సగం బయటికి లాగి 'చూసి' వదిలేస్తున్నాను.

టైటిల్స్ మసగ్గా కనబడుతున్నాయారోజు, నాకు.

రీఫిల్ గురించి ఆలోచిస్తున్నాను.

"సెల్‌లోకి వెళ్ళిన తర్వాత ఆ రీఫిల్ చూడండి"

'అతని' మాటలు ప్రతిధ్వనిస్తున్నాయ్ మెదడులో.

కనీసం 'రైఫిల్' అయినా కాదు. రీఫిల్ ఏం చేసుకోను!

మరో మువ్పావు గంట ముళ్ళమీదునట్లు గడిపేను.

ఎందుకో గుండె వేగంగా కొట్టుకుంటోంది.

గోడగడియారం కేసి చూసేను.

ఆరుకి యింకా మూడు నిముషాలుంది.

ఎక్సయిట్ మెంట్ తో బయటని నడిచేను.

గుమ్మంలో అతని వేపు చూసేను.

అటెండర్ యిప్పుడు నావేపు చూడ్డంలేదు.

ఏదో యింగ్లీష్ మాగజైను అతని ముఖానికి అడ్డంగా వుంది.

ఆరు బయటికి వచ్చి సెల్ వైపు నడిచేను పెద్దపెద్ద అంగలో.

శీతాకాలం కావటంవల్ల అప్పటికే చీకటి పడింది.

అయితే వరండాలోని లైటింగ్ జైలు గదుల్లోకి సగం వరకు ప్రసరిస్తుంది.

ఏడు గంటల వరకు వుంటుందా కాంతి.

తర్వాత డిమ్ లైటింగ్ వరండాలో.

సెల్ లోకి నడిచేను. తలుపులు మూయబడ్డాయ్.

అటూ ఇటూ తిరుగుతారు సెంట్రీలు. ఆ పెన్ అప్పుడే తెరిస్తే బావుండదు. జేబుమీద చెయ్యివేసి గట్టుమీద పడుకున్నాను.

నిముషాలు యుగాల్లా గడుస్తున్నాయి.

అలా చాలా యుగాలు గడిచేయి.

బూట్ల అలికిడి దూరమయింది.

వాళ్ళెక్కడికి వెళ్ళారో నాకు తెలుసు.

చటుక్కున జేబులోంచి తీసానది.

స్క్రూ తిప్పాను. బయటికి లాగాను రీఫిల్.

నా కళ్ళు పెద్దవయ్యాయ్.

రీఫిల్ చుట్టూ ఓ కాగితం చుట్టబడి వుంది.

గబగబా విప్పానది.

చిన్న సైపు అక్షరాల్లో అచ్చు వేయబడ్డ కాగితమది.

చదవసాగాను.

"మేజర్ భయంకర్!

నమస్తే! ఆర్నెల్ల క్రితం ఓ అర్ధరాత్రి విపరీతంగా తాగి ఆర్మియానిట్ పార్టీ నుంచి బయటకు వచ్చారు. మీ గుడారానికి దూరంగా ఉన్న నిర్మానుష్య ప్రదేశంలో ఓ సివిలియన్ కనబడితే ఉద్రేకంతో ఆమెను రేప్ చేశారు. ఆ అమాయిక యువతి ఆ అవమానం భరించలేక అందాన్ని జుర్రుకొని మీరు మత్తుగా పడివుండగా మీ ఎదురుగా ఆమె చెట్టుకు ఉరి వేసుకొని ఆత్మహత్య చేసుకొంది. మార్షల్ లా ఇరవై యేళ్ళు శిక్ష విధించింది మీకు.

మీ నేరానికి పూర్తిగా మీరు బాధ్యులు కారు. అప్పటికి మీలో వున్న ద్రవపదార్థంకూడా కారణం. జైల్లో యిప్పుడు మీరు పశ్చాత్తాప పడుతున్నారు. కళ్ళు కానక చేసిన వికృతానికి విలపిస్తున్నారు. అయితే దానితో చట్టానికి సంబంధంలేదు.

యిప్పుడు ముప్పై యేళ్ళు వయసు మీకు. అంటే విడుదల కాలానికి యాభై యేళ్ళ వయసుతో జైలునుంచి మీరు బయటకు వస్తారు. ఊహించడానికే భయంకరమైన విషయమిది.

మీమీద మాకు సానుభూతి వున్నది. మీ స్నేహం సహకారం కూడా కావాలి మాకు. ఎప్పుడో కాదు, రెండవరోజున—నలభై ఎనిమిది గంటల్లో.

యిష్టమైతే ఆ విషయం మాకు తెలియడానికి గుర్తుగా పెన్ తిరిగి అతని కివ్వొద్దు. యిరవయ్యేళ్ళు జైల్లో నవ్వుతూ

కృంగి కృశించిపోగలను అనుకుంటే ఆ పెన్ మీరు తిరిగి అతని కిచ్చేయండి ఈ కరపత్రం నమిలి మింగేయండి మీ సేనలో...

ఎన్. డబ్ల్యూ. ఓ."

చేతో ఆ వుత్తరం రాస్తే అంత తక్కువ చోటు సరిపోయి వుండేది కాదు.

ఎవరి N. W. O.?? హౌ కెన్ ఇట్ పాసిబుల్?

ఎలా విడిపిస్తారు యింత కట్టుదిట్టమైన మిలిట్రీ జైల్లోంచి?

మెయిన్ గేట్ బయటా, లోపలా ఉన్న గ స్త్రీదళాలు ప్రత్యేకంగా శిక్షణ యివ్వబడ్డవాళ్ళు.

వారి చేతుల్లోని ఇషాపూర్ ఆటోమెటిక్ రైఫిల్స్ వికృతంగా గర్జించి కాప్టర్ ని తలక్రిందులు చేస్తాయి.

ఏ క్రేన్ లాంటి యంత్రంతోనో జైలుగోడల బయటకి లాగేసుకుంటారా? ఛ! ఎంత సిల్లీగా ఆలోచిస్తున్నాను! గోడ అవతల కందకాలు, ఎలక్ట్రిక్ ఫెన్సింగ్, కనురెప్ప వాల్చని సెంట్రీలు...యింకా ఎవరికీ తెలియని ఏర్పాట్లు ఎన్నో వుండొచ్చు.

మరి...?

ఇంతకూ నానుండి ఏ సహాయం కావాలి వాళ్ళకి?

ఆలోచనలు జోరీగల్లా కదుల్తున్నాయ్ మస్తిష్కంలో.

ఏది ఏమైనా స్వేచ్ఛ పొందడానికే నిశ్చయించుకున్నాను నేను.

ఆర్నెల్ల యిక్కడి ఎండుజీవితం 'నో' అని చెప్పనివ్వదు నన్ను.

*　　*　　*

మధ్యరాత్రి. ఎవరో పొడిచినట్లయి ఉలిక్కిపడి కళ్ళు తెరిచాను.

"మేజర్!"

అన్న స్వరం లీలగా వినిపించింది సెల్‌లో. బిత్తర పోయి అటూ ఇటూ చూసాను చీకట్లో.

మరోసారి వినిపించింది అదే పిలుపు!

చటుక్కున లేచి కూర్చున్నాను.

ఆశ్చర్యం!

కింద మూడడుగుల వెడల్పు, ఏడడుగుల లోతూ గల గొయ్యి!

గోతిలోంచి ఒకతను చూస్తున్నాడు.

"కమాన్ మేజర్ సాబ్? ఆలస్యం చేయకండి" అన్నాడతను.

అతని చేతిలో ఫాన్ ఆకారంలో వున్న డ్రిల్లింగ్ మెషీన్ వుంది.

తలకు హెల్మెట్, చేతులకు గ్లోవ్స్, దుమ్ము కొట్టుకు పోయాయి అతని దుస్తులు.

సొరంగంగుండా వెళ్ళాలన్నమాట యిప్పుడు నేను!

హౌ సింపుల్ ఎస్కేప్ ఇట్ ఈస్!

ఆలస్యం చేయలేదు నేను. వరండాలోని డిమ్‌లైట్లతో మసకచీకటిగా వుంది. మాసిపోయిన తలగడ దుప్పటికి చుట్టి, సొరంగంలోకి దూకి దుప్పటి గోతిని కవర్ చేసే టట్లు అమర్చాను.

"మేజర్ సాబ్! వెడల్పు తక్కువ. మోకాళ్ళమీద పాక్కుంటూ ఒకరి వెనకాల ఒకరు కదలాలి మనం. స్టార్ట్ యువర్ క్రాలింగ్ ఫస్ట్. మీ వెనకాల జరుగుతూ

నేను టార్చిలైట్ ముందుకి చూపిస్తాను.'' తగ్గు స్వరంలో అన్నాడతను డిగ్గింగ్ మెషీన్ వీపుకి తగిలించుకొని, టార్చిలైటు చేతిలోకి తీసుకుంటూ.

తల ఊపి ముందుగా గోతిలోంచి, హారిజాంటల్ గా వున్న ఆ సొరంగంలోకి శరీరాన్ని దూర్చి, మోకాళ్ళ ఆధారంతో ప్రాకటం ప్రారంభించేను. వెనుకనుంచి టార్చిలైటు కాంతి కనబడుతోంది.

ఆర్మీవాళ్ళకి మోచేతులూ, మోకాళ్ళూ గట్టిపడి పోతాయి. యుద్ధభూమిలో రాళ్ళున్నా, గాజుపెంకు లున్నా అలా క్రాలింగ్ చేయడం కనీసపు అలవాటు. అయితే అది బహిరంగ ప్రదేశాల్లో.

ఇరుకైన ఈ సొరంగంలో దేకడం కష్టంగా వుంది. అందులోనూ నా ఛాతీ వెడల్పు. బాగా భుజాలు అంచు లకు ఒరుసుకుపోతున్నాయి. చిన్నచిన్న మట్టిపెళ్ళలు రాలుతున్నాయి. పదిహేను నిముషాలు గడిచాయి.

"మిస్టర్! ఎంతదూరం యింకా?'' అడిగేను మోచేతు లకు మామూలుగా పని కల్పిస్తూ. చెమట పడుతోంది, గాలి లేకపోవడంవల్ల. తల వెనక్కి తిప్పి అతన్ని చూడ్డా నికి వీలుకాదు.

"మేజర్ సాబ్! ఇంకో రెండు ఫర్లాంగులు'' వెనుక నుంచి అతని కంఠం పలికింది.

వేగం పెంచాను. మరో పదినిముషాలు గడిచేయి.

సొరంగం అంచులకు వచ్చాను. చల్లగా గాలి తగలడం చూసి అదే 'ఎండింగ్' అని ఊహించాను. తల బయటకి పెట్టి చేతులు గోతిచుట్టూ ఆన్చి పైకి గెంతాను. చేతులూ, కాళ్ళూ దులుపుకుంటూ చుట్టూ చూసాను. అది ఓ బహి రంగ ప్రదేశం!

చెట్లూ, చేమలూ కనబడుతున్నాయి.

బయటి ప్రపంచంలోకి వచ్చాను.

ఎంతో హాయిగా వుంది.

పరిగెట్టాలని వుంది ఆనందంగా.

బహుశా జైలుకు నాలుగైదు ఫర్లాంగుల దూరంలో వుండొచ్చు ఆ ప్రాంతం.

టార్చిలైట్ వ్యక్తి కూడా బయటికి వచ్చేడు.

"మిస్టర్!" పిల్చానతన్ని.

"ఎస్. మేజర్."

"నీ పేరు తెలుసుకోవచ్చా. నువ్వేనా ఎన్. డబ్ల్యు. ఓ.?"

"మేజర్ సాబ్! నా పేరు మీ కంతగా ఉపయోగ పడదు. ఇకపోతే N. W. O. అంటే న్యూ వరల్డ్ ఆర్గనైజేషన్. ఓ అరగంటలో మీకే అన్ని వివరాలు తెలుస్తాయి" అన్నాడు ముందుకి నడుస్తూ.

"న్యూ ... వ ... ర ... ల్డ్ ... ఆర్గనైజేషన్" గొణుక్కుంటూ అతని వెనుకే నడిచాను.

పొదల్లో వున్న ఓ అంబాసిడర్ వైపు అతను కదిలాడు. దానిమీద కప్పిన ఆకులూ, కొమ్మలూ తొలగించి; లోపల్నించి ఓ నీలంరంగు సూటు తీసి నన్ను తొడుక్కోమని సైగ చేసాడు. రెండు నిముషాల్లో రెడీ అయ్యాను.

"ఎక్స్క్యూజ్ మీ మేజర్!" అంటూ అతను నా కళ్ళకు గంతలు కట్టాడు. కారు బాక్ సీటులో నన్ను కూర్చోపెట్టాడు. ఫ్రంట్ డోర్ తెరచిన శబ్దమైంది.

కారు స్టార్టయింది.

"మిస్టర్" పిల్చాను.

"ఎస్ మేజర్."

"థాంక్యూ వెరీ మచ్" నొక్కి పలికాను.

చిన్నగా నవ్వు వినిపించింది.

"ఇట్సాల్ రైట్ సర్! అయినా అసలు వ్యక్తులకి మీ థాంక్స్ అందాలి." అతని చివరి మాటలతో వేగం పుంజుకుంది వాహనం.

*  *  *

సిటీలోని ఓ భవనంలోకి తీసుకెళ్ళి నన్ను ఓ కుర్చీలో కూర్చోపెట్టాడు అతను. నా కళ్ళ గంతలు విప్పి అక్కడ్నుంచి మాయమయ్యాడు.

అది ఒక హాలు. నారోలాక్ పెయింటెడ్ గోడలు. ఖరీదైన వర్ణచిత్రాలు వ్రేలాడుతున్నాయి గోడకి.

"వెల్ కమ్ టు వార్ డెవిల్" అన్న మాటలు వినబడ్డాయి.

వెనక్కి తిరిగి చూసాను. కర్టెన్ తెరచుకుని ఓ నలభై యేళ్ళతను గదిలోకి వచ్చాడు.

పరీక్షగా చూసేను అతనికేసి.

ఎరుపురంగు సూటులో వున్నాడతను. పచ్చటి శరీరచ్ఛాయ. తలవెంట్రుకలు అక్కడక్కడా నెరిసాయి. దట్టమైన కనుబొమలు, అయస్కాంతం జ్ఞప్తికి తెచ్చే కళ్ళు...అక్కడక్కడా తెల్లబడిన మీసాలు...ముఖంలో వర్చస్సు కనబడుతోంది. సూట్ లో నీటుగా వున్నాడు.

"నా పేరు బెనర్జీ ఖండేవాల్" అంటూ ముందుకువచ్చి కరచాలనం చేసాడతను.

"మిస్టర్ బెనర్జీ! మీరు చేసిన సహాయం అపూర్వం. పోతే నాలో చాల సందేహాలున్నాయి. హోప్ యు విల్ క్లారిఫై దెమ్" అన్నాను కుర్చీలో విశ్రాంతిగా వెనక్కి

జార్లపడి, మీసాలు తడుముకుంటూ.

"ష్యూర్ మిస్టర్ భయంకర్! కాని ముందు నేనే అన్ని వివరాలు మీకు చెబుతాను. తర్వాత మిగిలి వుంటే మీ సందేహాలు తీర్చుకోవచ్చు. అన్నిటికంటే ముందు మీరు కాఫీ తీసుకోవాలి. బాగా అలిసిపోయారు మీరు. ఓ. కే.?" అన్నాడు బెనర్జీ ఖండేవాల్, టీపాయ్ వెనుక సోఫాలో కూర్చుంటూ.

నవ్వుతూ తల ఊపాను. సోఫాకి అమర్చబడ్డ కాలింగ్ బటన్ నొక్కాడు బెనర్జీ. కర్టెన్ తొలగించుకొని తెల్ల దుస్తుల్లో సెర్వర్ వచ్చి కాఫీ అందించాడు నాకు.

కాఫీ చప్పరించసాగాను.

బ్రూ కాఫీ!

అంత చక్కటి కాఫీ తాగి చాల రోజులయింది.

రెండు నిముషాల్లో ఖాళీ కప్పుతో బయటకి నడిచేడు.

"మిస్టర్ భయంకర్! న్యూ వరల్డ్ ఆర్గనైజేషన్‌కి సంబంధించిన ఒక ముఖ్యవ్యక్తిని నేను. ఎంతోమంది రహస్యంగా అందించే సహకారంతో మా సంస్థ నడుస్తోంది మేజర్!

ప్రపంచ దేశాలన్నీ కలిపి ఒక్కటే రాజ్యంగా ఐక్యం చెయ్యడం మా లక్ష్యం! దానికోసం ఓ మాష్టరు ప్లాన్ రూపొందించాం.

ప్రతిదేశం ఒక రాష్ట్రం అయి, దేశాలన్నీ కేంద్ర ప్రభుత్వం క్రింద నడవాలి. కేంద్రప్రభుత్వంలో అన్ని దేశాలకు సంబంధించిన ప్రజాప్రతినిధులూ వుంటారు.

సంఘంలో మనిషికి మరో మనిషి అవసరం ఎప్పుడూ వుంటుంది. అలాగే ఎంత భాగ్యవంతమైన దేశమైనా కొన్ని విషయాలలో మరో దేశంపై ఆధారపడక తప్పదు

మేము రూపకల్పన చేసిన కొత్త ప్రపంచం ఏర్పడితే, దేశానికీ దేశానికీ మధ్య బిజనెస్ దృష్టి వుండదు. మిస్టర్ భయంకర్! ప్రపంచ ప్రజల మధ్య సోదర భావంతో ఉత్పత్తులు ఒక ప్రాంతనుంచి మరో ప్రాంతానికి బదిలీ అవుతుంటాయి.

"ఆలోచించండి మేజర్! ప్రపంచమంతా ఒకే రాజ్యం అయినప్పుడు యిప్పటిలాగా ఒక దేశం మరో దేశంమీద యుద్ధం ప్రకటించే అవుసరం వుండదు. మనిషి పాస్‌పోర్టు వీసాల్లాంటి నిబంధనలు లేకుండా నిజమైన స్వేచ్ఛతో ప్రపంచమంతా పర్యటిస్తూ, మానసికంగా అభివృద్ధి చెందుతాడు.

ఐక్య విజ్ఞానం, వనరులు అన్నివైపులకూ సరఫరా అవుతుంది. ఈనాడు మనిషి ఆర్థికంగా నిలబడగలిగి జీవిస్తున్నా అతనికి అసలైన భయం మరొకటి వెన్నంటుతూనే వుంది.

అదే_జీవితానికి గ్యారంటీ లేదు.

బ్రతికినన్నాళ్ళు మరో మనిషివల్ల ప్రమాదం ఉండనే వుంది.

ఏ క్షణంలోనైనా విదేశీయుడు బాంబులు కురిపించొచ్చు!

ఈ ముసలాన్నుండి రక్షించాలి!

పెరిగిన శాస్త్రీయ జ్ఞానం మానవుడి అంతాన్ని చూడ్డం కోసమే ఎదురు చూస్తూ మాటువేస్తోంది.

నీదోజాతీ, నాదోజాతీ_ఉన్నతం ఎక్కువ, అన్ని భేద భావాల్ని రూపుమాపడానికి మా ప్రణాళిక కృషి చేస్తోంది మిస్టర్ భయంకర్!

దానికి ముందుగా 'నీదో దేశం, నాదో దేశం' అన్న తేడాను అణిచివేయాలి. మానవుడి శాస్త్రీయ శక్తులు దొడ్డిదారి పయనించకుండా సన్మార్గంలో, నిస్వార్థంతో కృషి చేస్తే అయిదు సంవత్సరాల్లో మానవుని జీవన ప్రమాణం ఊహించని స్థాయికి పెరుగుతుందనీ, ప్రతీ మనిషి మినిమమ్ లక్సరీస్‌తో బ్రతుకుతాడనీ ఈ న్యూ వరల్డ్ ఆర్గనైజేషన్‌లో పని చేస్తున్న మేధావులు అభిప్రాయం వెలిబుచ్చారు మిస్టర్ భయంకర్!

ఇది చాల పెద్ద ప్రణాళిక. దాన్ని మనం సాధించగలిగితే కొత్త ప్రపంచ వీరులు మన పేర్లు నాలుగు కాలాల పాటు చెప్పుకుంటారు. జీవితంలో ఏదో సాధించామన్న తృప్తి మనల్ని అలుముకుంటుంది.

ఈ మరో ప్రపంచ సాధనలో మీ చేయూత కావాలి మేజర్! N. W. O. సవినయంగా కోరుతోంది మీ సేవలు'' అంటూ ఆగాడు బెనర్జీ ఖండేవాల్.

అతని వాగ్ధాటికి ఆశ్చర్యపోయాను.

''మిస్టర్ బెనర్జీ ఈ ఆశలు కొంత వరకు ఐక్యరాజ్య సమితివి'' అన్నాను సాలోచనగా.

''ఇట్ ఈజ్ ట్రూ మేజర్! కాని అది ఎంత బలహీనంగా పని చేస్తోందో మనకు తెల్సు. బాంగ్లాదేశీయుల్ని, పాకిస్తానీయులు చిత్రవధలు చేసినప్పుడు అడ్డుకోలేకపోయింది. అగ్రరాజ్యాల వీటో, నాటో, సీటో అధికారుల ముందు అది బలహీనమౌతోంది'' అంటూ ఆగి టీపాయి మీద మంచినీళ్ళ గ్లాసు అందుకున్నాడు ఖండేవాల్.

''మిస్టర్ బెనర్జీ! ఈ ప్రణాళికకు అభివృద్ధి చెందిన దేశాలు అనుమతించకపోవచ్చు. వాటి అణుశక్తితో మనల్ని

బెదిరించవొచ్చు."

"చక్కని సందేహం మిస్టర్ భయంకర్! అయితే న్యూవరల్డ్ ఆర్గనైజేషన్ యంత్రాంగం ఎంత పెద్దదో, మీకింకా వివరించలేదు. పైగా ఈ సంస్థ యిప్పటికే చాల దేశాల్లో అనుబంధ సంస్థలు ఏర్పడ్డాయ్. కొన్ని కొన్ని దేశాల్లో మేధావులు రహస్యంగా కల్సుకొని యింకా కొంత మందిని కలుపుకుంటూ రహస్య సమాలోచనలు చేసి రిపోర్టులు మాకు పంపుతున్నారు.

మానవుడి తీయని కల ఈ కేంద్ర ప్రపంచ సాధన! "నిస్వార్ధం, చిత్తశుద్ధి" కోరుతూ, దానినే జాతీయ గీతంగా ఆలాపిస్తున్నారు మా సభ్యులు అహోరాత్రులూ కృషి చేస్తున్నాం లక్ష్యంకోసం.

ఇంకా అణుశక్తి శాస్త్రజ్ఞులను మన సంస్థలో చేర్చుకో డానికి N. W. O. అవిరళ కృషి జరుపుతోంది. చక్కని ఫలితాలు అతి త్వరలోనే వస్తాయని మా రిపోర్ట్లు చెబుతున్నాయి కానీ మీరు చెయ్యాల్సిన సహాయం మరోటి వుంది మిస్టర్ భయంకర్!" అంటూ ఆగి పైలూజ్ చేసుకున్నాడు ఖండేవాల్ బెనర్జీ.

"క్షమించాలి మిస్టర్ బెనర్జీ. మే ఐ హావ్ ఎ సిగరెట్?"

"వైనాట్?" బెనర్జీ జేబులోంచి గోల్డ్ ఫ్లాక్ పాకెట్ బయటకి తీసి, ముందుకు వంగి ఓ కింగ్ సిగిరెట్ నాకందించేడు.

ఇద్దరం సిగరెట్లు ముట్టించాం.

"గో ఆన్ మిస్టర్ బెనర్జీ! ఇట్ ఈజ్ డామ్ ఇంటరెస్టింగ్!"

"థాంక్యూ ఫర్ ది కాంప్లిమెంట్ మేజర్! మీ ప్రస్తావనకు వస్తాను. చాలా తాజా విషయం. పేపర్లలో మీరు చూసేవుండాలి. శాస్త్రజ్ఞుడు యిప్పుడు ప్రకృతి శక్తులని ఎదిరించగలుగుతున్నాడు. ఎదిరించడమే కాదు, వాటిని తన కుపయోగపడేట్లు మలుచుకోగలుగుతున్నాడు. ప్రకృతి సిద్ధంగా ఉత్పన్నమయ్యే ఉరుములు, మెరుపులు, పిడుగుల్లాంటి వాటిని మనిషి కంట్రోల్ చేసి వాటిని తన యిష్టం వచ్చినట్లు ఉపయోగించుకోడానికి వీలున్నది.

మేఘాల్లో ఒరపిడి సృష్టించి వర్షాలు కురిపించవచ్చు. ఆర్టిఫిషియల్ రైన్స్‌తో విరివిగా పంటలు పండించుకోవచ్చు యివన్నీ సిద్ధాంత రీత్యా నిరూపించేడు చైనీ సైంటిస్ట్ హాయాంగ్ హా. ప్రాక్టికల్ గా ప్రపంచాన్కి చూపించడాన్కి యునైటెడ్ అరబ్ రిపబ్లిక్‌లో వున్న "అరేబియన్ ఎడారి"లో వుంటూ ఎండలు మండే ఆ ఎడారిలో కుంభవృష్టి కురిపించే ప్రయత్నాల్లో ఉన్నాడు.

మేజర్ భయంకర్! హాయాంగ్ హాని మీరు ఇండియా తీసుకురావాలి. అతన్ని కొన్ని దుష్టశక్తులు లేదా అతని ప్రభుత్వం కొన్ని దేశాల్లో వరదలు సృష్టించి భీభత్సం చేయడాన్కి పావుగా వుపయోగించవచ్చు.

ఆయన న్యూ వరల్డ్ ఆర్గనైజేషన్‌లో చేరితే మన ఆశయాలు త్వరితగతిని నెరవేరుతాయి. హాయాంగ్ హా వివేకంగా ఆలోచిస్తే ప్రపంచాన్ని సస్యశ్యామలం చేయగలడు.

ఆ సైంటిస్టు చుట్టూ చైనా మిలటరీ కాన్‌సెంట్రేషన్ కాంప్ ఉంది. సెక్యూరిటీ ఫోర్స్ విపరీతంగా వుంది. ఆర్మీ ఫీల్డ్‌లో మీకు ఎంతో పరిచయముంది. పద్మవ్యూహాం

లాంటి ఆ శత్రువ్యూహాన్ని మీరు ఛేదించుకొని హాంగ్‌యాంగ్‌హాని వెంటబెట్టుకొని రావాలి నయాన్నో భయాన్నో, మీరు ఈ ఎస్సయిన్‌మెంట్ టేకవ్ చేయడానిక్కి కన్సెంట్ తెలిపితే మీకు ఎన్నో విధాలుగా సహాయపడ్డానికి ఒక అసిస్టెన్సీ చేకూర్చుతాను.''

''ఎవరతను?'' అన్నాను సిగరెట్ పీక యాష్‌ట్రేలో నొక్కి.

''అతను కాదు ఆమె'' అన్నాడు నవ్వి బెనర్జీ.

''చురుకైన యువతి. మిస్ శర్మిష్ఠా! ఆమెను యిప్పుడే మీకు పరిచయం చేస్తాను.''

సోఫా ప్రక్కన వున్న స్విచ్ మరోసారి నొక్కాడు బెనర్జీ. కర్టెన్ తొలగించుకొని నవ్వుతూ ఓ యువతి లోపల్కి వచ్చింది.

ఆమెకేసి తేరిపార చూసాను.

వయస్సు ఇరవై రెండు వుంటుంది.

విస్కీరంగు శరీరచ్ఛాయ.

విల్లులా వంపులు తిరిగిన కనుబొమ్మలు.

నీలిరంగు కళ్ళు,

సన్నగా మొనదేలిన ముక్కు.

చెర్రీస్ పెదిమలు.

రాగిరంగు జుట్టు భుజాలదాకా వ్రేలాడుతోంది.

రక్తవర్ణం టెరీవుల్ బెల్‌బాటమ్ పాంట్‌మీద ఫుల్‌హాండ్స్ పచ్చని పువ్వుల షర్టు ధరించింది.

ఆఖరి బటన్‌వద్ద షర్టు ముడివేయబడి వుంది.

ఫుల్ స్లీవ్స్ మోచేతులదాకా మడత పెట్టబడ్డాయి.

షర్టుని తన్నుకొస్తోంది ఆమె స్తనసంపద.

స్టన్నింగ్ బ్యూటీ ఆమెది.

"మీట్ మేజర్ భయంకర్!" అన్న బెనర్జీ కంఠం వినబడి ఉలిక్కిపడ్డాను.

"హౌ ప్లీస్ టు సీ యూ మేజర్!" అందామె తన లేత హస్తం ముందుకు జాపి.

ఆమె కమలహస్తాన్ని నా మోటుచేత్తో కలపా లనిపించలేదు.

"అయ్ ఫీల్ మోర్ దాన్ ఇట్" అంటూ పలక రింపుగా నవ్వుతూ శన్యోరా అరచేతిని ముద్దుపెట్టుకొని వదిలేసాను.

శన్యోరా హైహీల్స్ శబ్దం చేసుకుంటూ సోఫాలో బెనర్జీ ప్రక్కగా కూర్చొంది.

"మిస్. శన్యోరా. నీ పేరు విచిత్రంగా వుంది. ఆర్ యూ ఎన్ ఇండియన్" అడిగేను సందేహం బయట పెడుతూ.

"మై డియర్ మేజర్! మీ పేరూ విచిత్రంగానే వుంది. పేరుకు తగ్గట్టు మీ ఆకారం భయంకరంగా లేదు" అంది నవ్వుతూ శన్యోరా.

బెనర్జీ కలగజేసుకున్నాడు. "మిస్టర్ భయంకర్! శన్యోరా భారతీయురాలే. ఆమె తండ్రి ఫ్రెంచి దేశీ యుడు. తల్లి ఇండియన్. సిటిజన్ షిప్ ఇండియన్. కాని, యిప్పుడామెకు ఆత్మీయులు ఎవరూ లేరు. ప్రభుత్వం ఆమెకోసం వేటాడుతోంది."

"డిసీజ్ ది హెల్ విత్ యూ అంకుల్! నాకు నువ్వున్నావ్. ప్రపంచ ప్రజలున్నారు. ప్రస్తుతం యెదు రుగా—'కూర్చున్నా,' నిలబడితే చెట్టంత వుండే మేజర్

భయంకర్ వున్నారు,'' అంది శనోర్యరా నవ్వేస్తూ.

''మిస్టర్ బెనర్జీ! మీ చివరి మాటలు నా కర్థం కాలేదు'' అన్నాను అతనివేపు పజిల్డ్ గా చూస్తూ.

బెనర్జీ ఆమె తల నిమురుతూ తల పంకించాడు. ''ఎస్. మిస్టర్ భయంకర్! భారతప్రభుత్వం శనోర్యరాకోసం వలలు పట్టుకు నిలబడింది. కొద్దిరోజుల క్రితం ఈమె భారత గూఢచారిణి.''

''వ్హాట్...!'' అప్రయత్నంగా అన్నాను.

''ఇట్స్ ట్రూ మేజర్! శనోర్యరా ఇండియా సీక్రెట్ సర్వీస్‌లో గూఢచారిణిగా పనిచేసేది. ఆమెకు ఓ ఎస్సయిన్‌మెంటు అప్పగించబడింది. అయితే దురదృష్టం కొలదీ పరిస్థితులామెకు యెదురు తిరిగాయ్. ఆ కేసులో ఆమె నెగ్గలేకపోయింది. ప్రత్యర్థులు తప్పించుకోడంలో శనోర్యరా హస్తం వుందని అనుమానపడింది, ఇండియన్ సీక్రెట్ సర్వీస్. కత్తికి రెండువైపులా పదును వున్నట్లు కొన్ని సంఘటనలు ఆమెపై నేరాన్ని బలపరిచాయి. శిక్షించబోయింది ప్రభుత్వం. అయితే అంతకుముందే N. W. O. ఆమెను రక్షించగల్గింది'' అంటూ ఆగాడు బెనర్జీ.

రెండు క్షణాలు మౌనంగా వుండిపోయాను.

''శనోర్యరా! మొదటి చూపులో నిన్ను తక్కువ అంచనా వేశాను, గూఢచారిణివని తెలియక. ఇప్పుడు ప్రస్తుతం నాకప్పగించబడిన కేసును నీవే సక్సెస్ చేయగలవేమో అనిపిస్తోంది. వై డిజన్ట్ యు టేకప్?'' అడిగాను ఆమెను ఉద్దేశిస్తూ.

''మీ నమ్మకానికి కృతజ్ఞతలు మేజర్! నాకు ఎస్పియ

నేజ్ యాక్టివిటీస్‌లో అనుభవం వుంది కాని, ఆర్మీ ఫీల్డ్‌తో టచ్ లేదు. హాంగ్‌యాంగ్ హో చుట్టూ చైనా రక్షకదళా లున్నాయని చెప్పా డంకుల్."

మరో సిగరెట్టు తీసుకొని ముట్టించాను.

దమ్ము గట్టిగా లాగి, యిద్దరివైపూ చూసాను.

"మిస్టర్ బెనర్జీ! మీరు నాకు చేసిన సహాయం మర్చి పోలేను. అరబిక్ ఎడారికి వెళ్ళడాని కొప్పుకుంటు న్నాను. కానీ, ఓ విషయం. నేనో యువతిని రేప్ చేసి జైలుకెళ్ళాను. అప్పట్నుంచీ మానసికంగా కృంగి పోయేను. నా శక్తులు మరుగుపడిపోయాయి. మీకు విజయం చేకూర్చగలనో, లేదో?"

"ఇట్ ఈస్ సిల్లీ భయంకర్! యుద్ధంలో మీరు ఎంతోమంది మనుషులను చంపివుంటారు. మీకంత సున్నిత మైన మనస్తత్వం వుండకూడదు. అడ్వెంచర్ లైఫ్‌లో ప్రవేశిస్తున్నాం. ముందు నా కంగ్రాట్స్ అందుకోండి" అంది శనోర్యా సంతోషంగా.

"థాంక్యూ ఫర్ యువర్ కన్సెంట్ మేజర్! మిమ్మల్ని మీరు తక్కువ అంచనా వేసుకోవద్దు. ఇన్‌ఫీ రియారిటీ కాంప్లెక్స్ మంచిదికాదు. ఎంత స్వయంకృషితో మీరు మేజర్ అయ్యారో గుర్తుంచుకోండి."

"మరో విషయం. మనం డెహ్రాడూన్‌లోని ఓ భవం తిలో రహస్యగదిలో వున్నాం. మీరు నాలుగురోజులు యిక్కడే వుండి ఆరోగ్యాన్ని పుంజుకోండి. ఈలోగా నేను మీ ప్రయాణాన్ని ఏర్పాట్లు చేస్తాను.

"ఇంకో విషయం జ్ఞాపకముంచుకోండి మేజర్! మీరు ఇండియన్ ఆర్మీలో బాధ్యత గల రాంక్‌లో వున్న వ్యక్తి.

పైగా యిప్పుడు పారిపోయి మరో నేరం చేసినట్టు. ప్రభుత్వం వదల్దు మిమ్మల్ని. వేటాడుతూ వుంటుంది యెక్కడున్నా. మీ రే దేశమైనా పారిపోయారని తెలిస్తే ఆ దేశ సహాయంతో అరెస్ట్ చేస్తుంది.

శన్యోరా కూడా అంతే! అయితే ఆమె గురించి పబ్లిక్ ప్రకటనలు వెలువడవ్. కారణం ఆమె సీక్రెట్ సర్వీస్‌లో వ్యక్తి గనుక. కేవలం ఏ దేశ పోలీసులు అయినా ఆమెను వేటాడతారు. అయితే మిమ్మల్ని ప్రకటనలు విని ప్రజలు కూడా వేటాడే ప్రమాదముంది. నూతన ప్రపంచం నిర్మాణ మయ్యేదాకా జాగ్రత్తగా వుండాలి మీరు. విష్ యూ ఎవెర్ సక్సెస్'' అంటూ నాతో మరోసారి కరచాలనం చేసి నిష్క్రమించేడు బెనర్జీ.

శన్యోరా, నేనూ మిగిలిపోయాం.

భవిష్యత్తు గురించి చర్చించుకోసాగాం.

* * *

ఓడ సముద్రాన్ని చీల్చుకుంటూ పయనిస్తోంది.

కలకత్తానుండి 'పోర్ట్ సుడాన్', 'మక్కా'ల మీదుగా సూయజ్ కాలువనుండి యిజ్రాయేలు వెళ్ళే పాసింజర్ షిప్ అది. షిప్‌లో కేటాయించబడ్డ గదిలో కూర్చున్నాం.

దొంగ పాస్‌పోర్ట్‌లతో బయలుదేరాం మేము, మారు వేషాల్లో.

ముస్లిం వేషాల్లో వున్నాం.

కుడివైపు మాని ఎడంవైపు దువ్వాను జుట్టు.

గడ్డం, మీసాలు కల్సిపోయాయి.

కళ్ళకు 'సూర్మా' తగిలించాను.

ముస్లిం లాంగ్ కోటు. తలకు ముస్లిం టోపీ.

పాస్‌పోర్టు ప్రకారం నా పేరు ఖయ్యూం. శన్యోరా సలీమాగా మారింది. పదిహేనురోజులు ప్రయాణం మాది. పోర్టు సుడాన్‌లో వున్న రెండో పెళ్ళాన్ని చూడ్డానికి వెళ్తున్నాం.

సలీమాగా మారిన శన్యోరా నల్లటి బురఖా ధరించింది ఘోషా పద్ధతిలో. ఇద్దరం కబుర్లు చెప్పుకుంటుండగా డెక్ మీద పరుగెడుతున్న చప్పుళ్ళు, యేవో కేకలూ వినబడ్డాయి.

ఉలిక్కిపడి లేచాను.

"ఏవిటీ గందరగోళం?"

"తెలియదు, వెళ్ళి చూద్దాం పద" అంది శన్యోరా.

ఇద్దరం కదిలొంచి వరండాలోకి పరిగెట్టాం.

ఎవరో యెదురువచ్చారు.

"మిస్టర్. వాట్ ఈజ్ గోయింగ్ ఆన్" అడిగేను అతన్ని.

"జానీ అనే కుర్రాడు సముద్రంలో పడ్డాడట" ఇంగ్లీషులో చెప్పి, బాత్‌రూమ్స్ వేపు వెళ్ళిపోయాడతను.

"ఎవరో కుర్రాడు పడిపోతే షిప్ ఆపలేదేమిటి?" గొణిగాను.

"మనం ఆపుదాం," అంది శన్యోరా.

మా కాళ్ళు నావిగేషన్ ఛాంబర్ వైపు పరిగెత్తాయి.

"మిస్టర్! షిప్ నాపాలి" అర్చాను.

నావిగేటర్ తాపీగా తలతిప్పి నావైపు చూసాడు.

"దేనికి? ఆపటం."

"సమ్‌బడీ హాజ్ ఫాలెన్ ఇన్‌టు సీ" అన్నాను కోపంగా.

"సారీ! కాప్టెన్ ఆర్డరు కావాలి."

"దేనికి?"

"షిప్ నాపడానికి."

"అతను మత్తుగా తాగి పడుకొని వుంటాడు. లేకపోతే ఈపాటికి షిప్ ఆగివుండాలి."

"ఐ కాన్ట్ హెల్ప్. ఆయన ఆర్డరు కావాలి. మీ యిష్టం వచ్చినట్లు చేస్తే నా ఉద్యోగం ఊడుతుంది. అసలు పాసింజర్సు ఈ గదిలోకి రాకూడదు, నో ఎంట్రీ బోర్డు చూడలేదా మీరు బయట?"

ఫట్ మంది అతని మెడ.

ఆ జూడో కాదెబ్బ శర్మ్యోరాది.

అతని తల నావిగేటింగ్ వీల్ మీదకి వాలిపోయింది.

"నా స్టాప్ ద షిప్ శర్మ్యోరా! నువ్విక్కడే వుండు. నేను డెక్ మీదకి వెళతాను" అంటూ సమాధానం వినకుండా పెద్ద శబ్దంతో మెట్లు యెక్కుతూ డెక్ మీదకి చేరుకున్నాను. అక్కడ వివిధరకాల దుస్తులు ధరించిన ప్రయాణీకులు గుంపులు గుంపులుగా రెయిలింగ్స్ వారగా నిలబడి సముద్రంలోకి చూస్తున్నారు.

హెల్ప్ మై చైల్డ్... హెల్ప్! హెల్ప్!

గుండెలు బాదుకుంటూ కేకలు పెడుతోంది ఓ నలభై యేళ్ళ బ్రిటిష్ యువతి. దూరంగా సముద్రంలో ఓ ఎత్తి చొక్కా కుర్రాడు నీటిలో కొట్టుకోడం నాకు కనిపించింది.

అతనికి కొద్దిగా ఈత వచ్చివుండాలి.

తేలడానికి విఫలప్రయత్నం చేస్తున్నాడు.

"ది గాలక్సీ ఆఫ్ రాస్కెల్స్! మానర్‌లెస్ యిడి

యట్స్! సిగ్గులేదూ, అలా చోద్యం చూడ్డానికి, కుర్రాడక్కడ ప్రాణాపాయంలో వుంటే" పిచ్చిగా కేకలు పెట్టాను, అందర్నీ ఉద్దేశించి.

"మిస్టర్! పరిగెట్టే నౌకలోంచి దూకడం ప్రమాదకరం. నౌక క్రిందిభాగాన్నే గుద్దుకుంటాం ఒకోసారి. సెకండ్ ఆఫీసర్, కాప్టెనూ విస్కీ తాగి నిద్రపోతున్నారు" నావీ దుస్తుల్లోని ఓ వ్యక్తి సంజాయిషీ ఇచ్చాడు.

"ఆల్ రైట్! షిప్ యిప్పుడు ఆగివుంది. నేను దూకుతున్నాను. నాకు సహాయం పంపడానికి ప్రయత్నించండి."

ముస్లిం లాంగ్ కోటు గబగబా విప్పేశాను.

రెయిలింగ్స్ ఎక్కి గాలిలో ఓ మొగ్గ వేసి దడాలున దూకాను.

అంతే! రెండు క్షణాల్లో శరీరాన్ని చల్లగా తగిలింది సముద్రం.

బారలు చాచి ముందుకు ఈదాను.

పోటు ఎక్కువగా ఉండటంవల్ల కెరటాలు విజృంభిస్తున్నాయ్.

కంగారుతో, నోట్లోకి నీరు వెడుతోంది.

క్షణక్షణానికీ ఆ కుర్రాడిలో శక్తి నశిస్తోంది...

ఒక్క నిముషం ఆలస్యమైనా ఒక ప్రాణి అనంత సాగరంలో కల్సిపోతుంది...

మొండిపట్టుదల ఆవహించింది నాలో.

చేతి కండరాలు బిగించి, పిచ్చిగా ముందుకి ఈదాను.

నీటిలోంచి తల పైకెత్తి అటూ ఇటూ చూసాను.

అంతే!

నా గుండెలు దడదడలాడాయి.

అప్పటిదాకా నీటిమీద చేతులతో తపతపా కొడుతున్న ఆ కుర్రాడు కనిపించలేదు.

"జా...నీ!" పిల్చాను గట్టిగా, నీటిపై తేలుతూ.

ఊహుఁ. జవాబులేదు.

నా శ్రమంతా...?

అతను ములిగిన స్పాట్ జ్ఞప్తికి తెచ్చుకుంటూ చటుక్కున నీటిలోకి జారాను.

మునుగీత ప్రారంభించాను.

ఎందుకో ఓసారి ఉలిక్కిపడ్డాను...

కాలికి ఏదో మెత్తగా తగిలింది!

షార్క్ చేపా?

నిర్ధారణ చేసుకోడానికి మరోసారి అటువైపే కదిపాను కాలు.

నో! ఏ జంతువూ కాదది.

జానీ!

అతని నిక్కరు తగిలింది కాలికి.

కనురెప్ప మూసేంతలోగా ఆ ఆకారాన్ని పట్టుకొని ఉపరితలానికి వచ్చాను.

జానీకి పధ్నాలుగేళ్ళుంటాయి.

పచ్చటి దేహం...

ఎఱ్ఱ నిక్కరూ, ఎఱ్ఱ చొక్కా ధరించాడు. అమాయికమైన ముఖం.

స్పృహ తప్పి వున్నాడు.

నీళ్ళు వెళ్ళివుంటాయి నోట్లోకి.

పొట్ట కొద్దిగా ఉబ్బివుంది...

ఫస్ట్‌ఎయిడ్ సముద్రతలంపై చెయ్యడం కష్టం.

జానీని వీపుమీద వుంచుకొని జాగ్రత్తగా ఈద సాగాను.

బలహీనమైన ఊపిరి వెచ్చగా నా వీపుకి తగుల్తోంది.

థాంక్ గాడ్!

జానీ బ్రతకడానికి అవకాశాలున్నాయి.

ఆశాదీపం నాలో వేడి రగిల్చింది.

వేగంగా డైవ్ చేయసాగాను.

*  *  *

"థాంక్యూ బ్రదర్! యు సేవ్‌డ్ మై సన్!" అందామె సంతోషం పట్టలేక నా చేతులు పట్టుకొని ఊపేస్తూ.

ప్రయాణీకులంతా నా చుట్టూ మూగి ధన్యవాదాలు తెలిపి వెళ్ళిపోయారు.

"ఇట్సాల్ రైట్ సిస్టర్! మీరు మెడికల్ రూంలోనే వుండటం మంచిది. జానీకి స్పృహ రాగానే ఎదురుగా మీరు కనబడాలి."

బ్రిటీష్ యువతి తల పంకించి, మరోసారి థాంక్స్ చెప్పి మెడికల్ రూంవైపు వెళ్ళిపోయింది. తర్వాత జ్ఞాపకం వచ్చింది నాకు, ఓ విషయం ఆమెను అడగడం మరిచానని.

అసలు జానీ ఎలా పడ్డాడు నీటిలో?

జారిందా కాలు?

అంతలో...

"హలో మిస్టర్ ఖయ్యాం. కంగ్రాచ్యులేషన్స్."

అన్న మాటలు వినబడ్డాయ్.

వెనుదిరిగి చూసాను.

కాప్టెన్!

నా ముఖం ఎర్రబారింది.

"మిస్టర్ కాప్టెన్! నీ దౌర్భాగ్యపు అభినందనలు నాకక్కరలేదు. నీ ఉద్యోగాన్కి నీళ్ళు వదులుకునే పరిస్థితి కల్పిస్తాను. ప్రయాణీకులంతా సాక్ష్యమున్నారు నాకు. అసహ్యించుకుంటున్నారంతా నిన్ను. డ్యూటీలో వుండగా మందుకొట్టి తలుపులు బిగించి నిద్రపోయావ్ నువ్వు" అన్నాను రోషంగా.

"అయామ్ సారీ మిస్టర్ ఖయ్యాం! ప్రమాదం జరుగుతుందని ముందుగా నాకు తెలియదు. కారణం యేమిటో తెల్సా? షిప్ కదిలేటప్పుడు రెయిలింగ్స్ వద్ద నిలబడకూడదని షిప్పింగ్ గైడ్‌లో ఇన్‌స్ట్రిక్షన్ వుంటుంది. డెక్ వారగా నిలబడి తదేకంగా ఎక్కువసేపు సముద్రంలోకి చూడకూడదు. కెరటాలకు హిప్నటిజం వంటి శక్తి వుంటుంది. మన మనోబలాన్ని క్రమంగా ఆ శక్తి ఓవర్ టేక్ చేస్తుంది. మెదడు మతి తప్పుతుంది. ఆ పరిస్థితుల్లో మనకు తెలియకుండానే సముద్రంలో పడిపోతాం. అలాగే జరిగివుండాలి జానీకి."

కాప్టెన్ మాటలు విస్తుపోతూ విన్నాను.

అతనితో యింకేం మాట్లాడాలనిపించలేదు. సిగరెట్టు ముట్టించి తడిబట్టలు మార్చుకోవడాన్కి గదివేపు నడిచాను. అప్పటివరకు గంభీరముద్ర దాల్చిన శన్యోరా నన్ను ఫాలో అయింది.

* * *

"మేజర్! మేజర్!"

ఎవరో తట్టి లేపినట్లయి ఉలిక్కిపడి లేచాను.

శనో్యరా!
అప్పుడే తెల్లవారింది.

సూర్యుని వెచ్చని కిరణాలు గుండ్రంగా వున్న అద్దపు కిటికీగుండా లోపలికి ప్రసరిస్తున్నాయి.

బద్ధకంగా కళ్ళు నులుముకున్నాను.

"సలీమా! షిప్ దిగేవర్కూ నా పేరు ఖయ్యాం" అన్నాను చిన్నస్వరంతో మందలింపుగా. "సరే! విషయ మేమిటి?"

"అయామ్ సారీ!" అంటూ తలుపువేపు చూపించింది శనో్యరా.

"మిస్టర్ ఖయ్యాం! ఏవిఁ టాలశ్యం. దయచేసి వెంటనే బయటికి రండి" కాప్టెన్ స్వరం అధికారయుతంగా వినబడింది బయటినుంచి.

పిలుపులో ఆ కరుకుదనం నాలో భయం రేపింది.

"ఏం జరిగిం దసలు?" అడిగాను నెమ్మదిగా శనో్యరాని.

"తెలియదు. మూడోసారి అతను పిలవడం. మన విషయం బయల్పడిందేమోనని అనుమానంగా వుంది."

ఒంటినిండా కప్పుకున్న దుప్పటి చటుక్కున తొలగించాను.

బెడ్డింగ్ లోపల తలభాగంలో రహస్యంగా వున్న అరలోంచి పిస్టల్ తీసి నైట్ డ్రెస్ పైజమా మొలలో దాచాను.

"వెయిటె మినిట్ కాప్టెన్. కమింగ్" అన్నాను శనో్యరాకి సైగ చేస్తూ.

పైజమామీదికి నిండుగా షర్ట్ లాక్కున్నాను.

శనోర్యా తలుపులు తీసింది.

కాప్టెన్ గుమ్మం అవతల కాలయముడిలా నిలబడి వున్నాడు. అతని చేతిలో పిస్తోలు నిగనిగ మెరుస్తోంది. సూటిగా గురిపెట్టబడి వుంది నావేపు.

"మేజర్ భయంకర్ అలియాస్ ఖయ్యాం" అన్నాడు కాప్టెన్ వికృతంగా నవ్వుతూ.

నా గుండె ఝల్లుమంది. ఎలా తెల్సింది నా పేరు అతనికి!

షిప్‌లో ఇండియన్ సి. ఐ. డీ. లున్నారా?

నేను బెడ్ రాక్ మీంచి కదల్లేదు.

"కాప్టెన్! పొద్దున్నే యింకా దంతధావనమైనా కాకుండా ఏమిటా నాటు జోకులు?" కరుగ్గా అన్నాను, బెదురుపాటును కప్పి పుచ్చుకుంటూ.

"నీ హాస్యం కట్టిపెట్టు మేజర్ భయంకర్! నీ వివరాలన్నీ రేడియోలో మార్నింగ్ వార్తల్లో వచ్చాయి. నీ రూపమంతా వర్ణించబడింది. నీ మేకప్ బాగానే కుదిరింది. కానీ, నీకు యుద్ధంలో కుడి మోచేతికి గుండుదెబ్బ తగిలింది. అప్పట్నుంచీ నీ చేయి కొంచెం వంకరగా పెట్టి నడుస్తావ్. రేడియోలో చెప్పిన ఈ క్లూయే నిన్ను పట్టియిచ్చింది.

నిన్ను ఏ దేశంలో పోలీసుల కప్పచెప్పినా మీ దేశం రెండులక్షల రూపాయలకి చెక్కు యిస్తోంది బహుమతిగా. నేషనల్ క్రిమినల్స్ ప్రయాణీకుల మధ్య వుండటం ప్రమాదకరం. అందాక మిమ్మల్ని ఏదో గదిలో బంధించాలి. సో ప్లీజ్ కమాట్ బోత్ ఆఫ్ యూ" అన్నాడు కాప్టెన్ కరుగ్గా.

"కమాన్ శనోర్యరా" అసలు పేరుతోనే పిల్చాను ఆమెను.

ఇద్దరం ముందుకి నడిచాము.

సన్నని పాసేజ్‌లో నడుస్తున్నాం.

శనోర్యరాని కవర్ చేస్తూ వెనుక నడుస్తున్నాడు కాప్టెన్.

స్టోర్‌రూమ్ ముందుకి వచ్చాం.

ఏదో చప్పుడయింది...

గిరుక్కున వెనుదిరిగాను.

కాప్టెన్ చేతిలో పిస్టల్ ఎగిరి కిందపడింది.

"వెల్ జానీ!" అన్నాను సంతోషం పట్టలేక.

కిందపడిన పిస్తోలు శనోర్యరా అందుకోవడం, దాన్ని కాప్టెన్‌కు గురిపెట్టడం క్షణాల్లో జరిగిపోయింది.

జానీ మూగ కుర్రాడు. అతను మాట్లాడలేడు.

తల ఎగరేసి గర్వంగా నా దగ్గరగా వచ్చి నిల్చున్నాడు.

నేను చేసిన సహాయాన్కి ప్రతిసహాయం చేసాడు!

కాప్టెన్ బిక్కముఖంతో శనోర్యరా చేతిలోని పిస్తోలు వైపు చూస్తూ వుండిపోయాడు.

అంతలో బిలబిలమంటూ, నావీ దుస్తులు ధరించిన నౌక 'క్రూ' మనుషులు కొందరు వచ్చేసారు!

"వెల్ జంటిల్మెన్! ఎక్కడివా రక్కడే ఆగిపోండి. కదిలే మీ కాప్టన్ బుర్ర రెండుగా విడిపోతుంది. ఇప్పుడు షిప్ నా ఆధీనంలో నడుస్తూంది. పోర్ట్ సుడాన్‌కి ఐదు మైళ్ళ దూరంలో మేము దిగిపోతాం. అప్పటిదాకా మీ కాప్టెన్ మా బందీ" బొడ్డులోంచి పిస్తోలు తీస్తూ అన్నాను.

"ప్రయాణీకుల కెలాంటి ఆపదా, యిబ్బందీ రాదు. ఇంతకన్నా ఎక్కువ విషయాలు మీ కక్కరలేదు. సో ప్లీజ్ గెట్ బాక్ ఆల్ ఆఫ్ యూ!" అరిచాను పిస్తోలు ఆడిస్తూ.

క్రూ మనుషులు కొందరు క్రోధంగానూ, కొందరు భయంగాను చూస్తూ వెళ్ళిపోయారు.

అయిదునిమిషాల్లో కాప్టెన్‌ని స్టోర్ రూంలో బంధించేను.

అతన్ని నేనూ, శనోర్యరా వంతులవారీగా కాపలా వుండడాన్కి నిశ్చయించాము.

* * *

కాప్టెన్ బందీ అయి రెండురోజులయింది.

షిప్‌లో కార్యక్రమాలన్నీ నా ఆధ్వర్యంలో యాంత్రికంగా సాగిపోతున్నాయి. క్రూ మనుషులు రుసరుసలాడుతూ పనులు చేస్తున్నారు. వాళ్ళు యెప్పటికైనా నన్ను దెబ్బతీసి, నాపై ప్రతీకారం తీర్చుకోడానికి ప్రయత్నిస్తున్నారని గ్రహించాను!

ఎవరైనా వైర్‌లెస్‌ద్వారా మా ఉనికి బయట పెట్టొచ్చు!

అందుకే వైర్‌లెస్ రూంకి అరడజను తాళం కప్పలు వేసి, తాళంచెవులు సముద్రంలోకి విసిరేసాను.

ఇంకో పదిరోజులు ఏ అడ్డంకూ లేకుండా షిప్ ప్రయాణించాలి. కాలకృత్యాలకోసం మాత్రం, కాప్టెన్‌కి తాత్కాలిక స్వేచ్ఛనిస్తున్నాం, నేనూ, శనోర్యరా పిస్తోళ్ళతో కవర్ చేస్తూ.

ప్రయాణీకులద్వారా నా కెలాంటి సమస్యా యింత వరకూ ఎదురవ్వలేదు.

(సశేషం)

# సప్లిమెంట్ పోటీ - 27

165, 166, 167, 168, 169 — అంకెలను తీసుకొని మీకు నచ్చిన వరుసక్రమంలో, ఈ క్రింది గళ్ళను పూరించండి. మీ జవాబులను ఒక పోస్టుకార్డుసైజు తెల్ల కాగితంపై వ్రాసి, దానితో 75 పైసల స్టాంపులు జతపరిచి, ఈ నెల 30 వ తేదీలోగా మాకు చేరేటట్లు పంపండి.

| | | | | |
|---|---|---|---|---|
| | | | | |

మా ఆఫీసులో సీలు చేసిన జవాబుతో సరిపోలిన జవాబుకు ఏడాదిపాటు 'సప్లిమెంట్' ఉచితంగా పంపుతాం. ఫలితాలు ఫిబ్రవరి' 77 నెల మాసపత్రికలో చూడండి.

## ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంటు" ముఖచిత్రాలు పరిశీలించండి. రెండింటికి సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలోగాని, వ్రాసి, ఈ నెల 10 వ తేదీ లోపు మాకు చేరేట్లు పంపండి. 'హోమ్ డెలివరీ' సభ్యులు తమ సభ్యత్వము నెంబరు వ్రాస్తేచాలు. సభ్యులు కానివారు తమవ్యాఖ్యలతో 30 పై.లు స్టాంపులుపంపాలి.

మాకు నచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రూ. 20 లు నగదు బహుమతి పంపుతాము.

## మీరే ఎన్నుకోండి ?

ఈ "సప్లిమెంటు"లో మీకు బాగా నచ్చిన నవల పేరును ఒక పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల10 వ తేదీ లోపు మాకు పంపండి. హోమ్ డెలివరీ సభ్యులు తమ నెంబరు తప్పక వ్రాయాలి. ఇతరులు తమ జవాబుతో ఈ కూపన్ కత్తిరించి పంపాలి. ఉత్తమ నవలకు రూ. 116 లు బహుమతి ఇవ్వబడుతుంది. *

## మతిభ్రమణం?

మరణశయ్యమీదున్న భర్త, భార్యా బిడ్డలతో—

"లక్ష్మీ! నా స్నేహితుడు రామం నాకు రెండొందల రూపాయలు బాకీ ఉన్నాడు. ఎదురింటి సుబ్బారావు వంద రూపాయలివ్వాలి. అలాగే...."

"చూశావా? మీ అదృష్టంకొద్ది మీ నాన్నగారికింకా మతి స్థిరంగా ఉండగానే ఈ బాకీల సంగతి తెలిపింది మనకు!" మధ్యలో అంది భార్య పిల్లల్తో.

"నన్ను పూర్తిగా చెప్పనీయవేమే....? మన ప్రక్కింటి రామనాథంగారి దగ్గర నెల్లాళ్ళ క్రితం ఐదొందలు తీసుకున్నాను. అవి యింతవరకు తీర్చనే...."

అతడి మాటలు పూర్తిగాకముందే అంది భార్య—

"అయ్యో! మీ నాన్నగార్కి అప్పుడే మతిస్థిరం తప్పిందర్రోయ్...." శోకాలు మొదలుపెట్టింది ఆ మహాఇల్లాలు.

## దైవానికి అర్పితం?

"నేను వారాంతంలో ఒక నిర్జన ప్రదేశానికి వెళ్ళి ఒక వృత్తం గీస్తాను. తరువాత ఆ వారంలో సంపాదించిన

డబ్బును పై కెగురవేస్తాను. ఆ వృత్తంలో పడ్డ డబ్బు మాత్రం తీసుకుని. బయటపడ్డ ధనాన్ని పైవాని కంకితం చేస్తాను," అన్నాడొకతను.

"మరి నేనుకూడా అంతే? వారంలో సంపాదించిన డబ్బంతా తీసుకొని పై కెగురవేస్తాను. దైవం స్వీకరించగా మిగిలిన కిందపడ్డ ధనాన్ని మాత్రమే నేను తీసుకుంటాను," అన్నాడు లోభి.

—కోనె హరిబాబు, ఏలూరు.

## "భక్త కన్నప్ప"

నీరసంగా నడుస్తున్నాడు కన్నప్ప. అతని ఆలోచనలు పరి పరి విధాల పోతున్నాయ్.

సాయంత్రం ఆరు గంటలు కావస్తోంది. కడుపులో ఆత్మరాముడు మొర్రో అంటున్నాడు. కాళ్ళు లేవలేకపోతున్నాయ్. జేబులో చేయిపెట్టి చూశాడు 20 పైసల బంగారు బిళ్ల చేతికి తగిలింది. ఎదురుగా కనబడుతున్న "హోటల్ ప్రశాంతి" వైపు నడువబోయాడు.

అంతలో భుజంపైన ఎవరివో చేతులు పడటంతో వెనక్కి తిరిగి చూశాడు. పైజామా లాల్చీవేసుకున్న పిక్కి అతను. "ఏమిటి?" అన్నట్లు చూశాడు విసుగ్గా.

"నేను బతక కన్నప్ప...."

అంటూ అతను ఇంకా ఏదో చెప్పబోతుండగానే మధ్యలో అందుకున్నాడు కన్నప్ప.

"నీవు బతక్కపోతే ఎవడికి కావాలి? వెళ్ళి ఏట్లో దూకి చావు!" అని కన్నప్ప కోపంగా హోటల్ లోకి వెళ్ళిపోయాడు.

సిక్కు ఆశ్చర్యంతో నోరు తెరిచాడు. 'భక్త కన్నప్ప' సినిమా ఏ టాకీసులో ఆడుతుందో తెలుసుకుందామంటే. ఇతను ఇట్లా వాగుతున్నాడేమిటి? తెలుగు సరిగా రాని ఆ సిక్కు తెల్లబోతూ.

—ఆర్. జీవన్, పెంటాకలాన్.

## యావజ్జీవ ఖైదు!

"జడ్జిగారు నాకు మరణశిక్ష విధిస్తారని భయంగా ఉంది. మీరు ఎంతైనా శ్రమపడి నాకు యావజ్జీవ శిక్ష పడేలా చూడాలి," అన్నాడు హంతకుడు తన లాయరుతో.

నాలుగురోజుల తరువాత యావజ్జీవ ఖైదుగా శిక్ష విధించారు, జడ్జిగారు.

"యావజ్జీవ ఖైదు పడేట్లు చేశారు. చాలా థ్యాంక్స్." అన్నాడు ఖైదీ, లాయరుతో.

"నీ కేసులో తలదూర్చి చాలా శ్రమపడ్డాను. అసలు జడ్జిగారు, కేసు తికమకగా ఉందని కొట్టివేస్తానన్నారు. నువ్వు కోరావుగదా-అని జడ్జిగారిని ప్రతిమాలి నీకు యావజ్జీవ ఖైదీగా శిక్ష పడేట్లు చేశాను," అన్నాడు లాయరు ఉసూరుమంటూ.

—ఎమ్. డి. బాబ్జీ, రాజమండ్రి.

## పరిచయం?

"మిమ్మల్నెక్కడో చూసినట్లుంది."

"బహుశ సెంట్రల్ జైల్లో చూసి ఉంటారు."

"అయితే ను....వ్....నువ్....వు...."

"భయపడకండి నేను జైలర్‌ని."

—బి. వి. యస్. రత్నాకరరావు, కాకినాడ.

## తప్పిపోయిన వ్యక్తి?

రామం: ఏమిట్రా! ఇందాకట్నుంచి భూతద్దంతో న్యూస్ పేపర్లోకి అలా చూసేస్తున్నావు? ఏమిటి విశేషం?

సోమం: ఏం లేదు. పేపర్లో "తప్పిపోయిన వ్యక్తి" గురించి వేసిన ఫోటోలో గుర్తులు సరిగా తెలియకుండా వుంటేనూ.... —ఎం. సురేంద్రనాథ్, విజయవాడ.

## క్విజ్ మాస్టరు?

"అనగనగా మూడు కోతులున్నాయట. ఒక తండ్రికోతి, ఒత తల్లికోతి, రెండు పిల్లకోతులు....ఓ సాయంకాలం లైనుగా రోడ్డు దాటుతున్నాయట. ట్రాఫిక్ పోలీస్‌కి ముచ్చటేసింది. వాటి డిసిప్లిన్ చూసి, పలకరింపుగా అడిగాడు ముందున్న తండ్రికోతిని "మీరెందరని" "నలుగురం" అని అందట.

అదే ప్రశ్న ఆ వెనక ఉన్న తల్లికోతిని అడిగాను.

"నా ముందు ఒకరు. నా వెనక ఇద్దరు అందట తెలివిగా ఆ కోతి.

మరీ సరదా వేసింది పోలీసుకు ఆ తర్వాత ఉన్న పిల్ల కోతిని అడిగాడు "నీముందు ఎందరు. వెనక ఎందరు"అని. "నా ముందు ఠ్ముగ్గురు. నా వెనక ఒకరే." అని చెప్పింది.

"ఏమిటిలా చెప్తుందని" కొంచెం ఆశ్చర్యపోయి ఆఖర్న ఉన్న దాన్ని అడిగాడట మళ్ళీ ఆ ప్రశ్న. "నా ముందు ముగ్గురు నా వెనక ఎవరూ లేరు" అని చెప్పింది....ఇప్పుడు ప్రశ్న మూడో కోతి ఎందుకలా జవాబు చెప్పింది?" అని

అందరికేపి గర్వంగా చూశాడు క్విజ్ పిచ్చి సుబ్బారావు.

"వాళ్ళమ్మ ప్రెగ్నెంట్ ఏమో" అంది సునీత....

"కాదు" అన్నాడు సుబ్బారావు.

"ఆఁ తెలిసింది. పోలీసును కూడా లెక్కబెట్టింది కాబోలు'' విశ్వనాథం జోక్ వేసినట్టు నవ్వాడు.

"నో థింక్ ఇట్ ఓవర్"

విశ్వప్రయత్నం చేస్తున్నట్టు మొహాలు పెట్టారు అందరూ.

రెండు నిమిషాలు గడిచాయి. "లాభం లేదు మీరెవరూ చెప్పలేరు. వినండి.... "అంటూ చెప్పాడు సుబ్బారావు "మూడో కోతి పిల్ల కదా. అంకెలు సరిగా రావు. ఒకటి మూడు" అని లెక్కబెట్టింది.

అరుణ పళ్ళిగ్గా ఉడుక్కుంది. "ఇదేం క్విజ్ బాబూ దానికి అంకెలు రావని ముందు చెప్పనేలేదు." నిరసనగా అంది.

"పోనీ అంకెలు వచ్చనే అనుకుందాం. అయినా అది కోతి. అందులోను పిల్లచేష్టలు. ఛైల్డ్ సైకాలజీ." సమర్థించుకున్నాడు సుబ్బారావు. "ఇంకో క్విజ్ మెదడుకు అసలైన మేత. ఓన్లీ స్మార్ట్ పీపుల్ కెన్ ఆన్సర్ దిస్."

"మేము స్మార్ట్‌కాదు." రాజేశ్వరి. అరుణ, గుర్నాధం ప్రకటించేసారు. అయినా సుబ్బారావు వదిలేట్టు లేడు. సుజాతకి కోపం పీక్ వేల్యూంకి చేరుకొంది.

"నేనే ఓ కారు డ్రైవరుని అనుకోండి...."

"ఊఁ" మొహమాటంగా వింటున్నారు కొందరు సుబ్బారావు క్విజ్‌ని,

"కారు వైజాగ్‌లో బయలుదేరింది. గంటకి నలభై మైళ్ళ స్పీడుతో రెండు గంటలు ప్రయాణం చేసి రైట్

టర్న్ తీసుకొంది. తర్వాత ఇరవై మైళ్ళ స్పీడుతో నూట నలభై మైళ్ళు వెళ్ళింది. ఓ అరగంట రెస్ట్ తర్వాత పాతిక మైళ్ళ స్పీడుతో నలభై ఐదు నిమిషాలు ప్రయాణం చేసింది. తర్వాత కుడిప్రక్కకు తిరిగి పదిహేను మైళ్లు వెళ్ళగానే ఇంజన్ ట్రబులిచ్చి ఆగిపోయింది. జాగ్రత్తగా ఫాలో అయారు కదూ....నౌ రెడీఫర్ ది క్వశ్చన్ డ్రైవర్ వయస్సెంత?"

అందరూ తెల్లబోయారు. "అన్యాయం ఇది ఇర్రిలవెంట్ క్వశ్చన్" అరుణ అబ్జక్షన్ లేవదీసింది.

"యూజ్ యువర్ బ్రైన్ మెడమ్...." సుబ్బారావు నవ్వుతూ అన్నాడు. కమల గుసగుసలాడింది సుజాతతో. "ఇది వరకెక్కడో చదివాను దీన్ని ఆఁ డ్రైవర్ తనే అన్నాడు కదా."

. "అవునవును నాకూ గుర్తొచ్చింది ఉండు నే చెప్తాను జవాబు." వారించింది సుజాత "హియర్ హియర్ నే చెప్తాను అన్సర్." అరచినంతపని చేసింది.

"గుడ్" ఇటు చూసాడు సుబ్బారావు.

"కారు డ్రైవర్ మీరే అని చెప్పారు కదా. మీ వయస్సు ఇరవై నాలుగేళ్ళు మరీ మీరు జనాల్ని తెలివి తక్కువ వాళ్ళ క్రింద కట్టేస్తున్నారేమిటి అంది" సుజాత విజయగర్వంతో.

"చెప్పేసారే యువార్ రియల్లీస్మార్ట్...." నవ్వాడు సుబ్బారావు.

"అవునూ నా వయస్సు సరిగ్గా ఇరవై నాలుగేళ్ళే అని ఎలా చెప్పగలరు." అడిగాడు చమత్కారంగా.

"మరేంలేదు. నాకో మావయ్య ఉన్నాడు. ఆయనెప్పుడూ సందు దొరికితే చాలు ఇలాటి క్విజ్‌లే వేస్తుంటాడు. ఫుల్

క్రాక్ (Full crack) లెండి. ఆయన వయస్సు సరిగ్గా నలభై ఎనిమిదేళ్ళు...."

సుబ్బారావు మొహం ఇంతైంది!!!

—చింతా జగన్నాధరావు, విశాఖపట్నం.

## రిక్షా కావాలా?

"రిక్షా కావాలా బాబూ?" అడిగాడు ఒక రిక్షావాడు ఒక త్రాగుబోతును.

"ఆఁ! కావాలి దిగు" అని, ఆ రిక్షావాడు దిగిన తరువాత తనే ఆ రిక్షా ఎక్కి త్రొక్కుకుంటూ వెళ్ళిపోబోయాడు ఆ త్రాగుబోతు.

"అదేమిటి బాబూ?" అని ఆశ్చర్యంగా అడిగాడు.

"నువ్వేకదురా దొంగనాయాలా రిక్షా కావాలా అని అడిగావు. మళ్ళీ ఇదేం గొడవరా వెధవా?" అన్నాడా త్రాగుబోతు. —సిహెచ్. సుధాకర్, విజయవాడ-3.

## "లైన్లో ఉండండి"

ఇంటి నుంచి ఆఫీసుకి ఫోన్ చేసి హెడ్‌క్లర్క్‌తో మాట్లాడుతున్నాడు ఆఫీసర్.

అంతలో బయట ఎవరో పిలవడంతో, "లైన్లో ఉండండి" అని రిసీవర్ ప్రక్కనపెట్టి, ఎవరొచ్చారో చూడ్డానికి వెళ్లాడు.

తిరిగి వచ్చి ఫోన్ ఎత్తితే, అవతలివైపు ఫోన్ పెట్టేయబడి వుంది. హెడ్‌క్లర్కు మీద కోపం వచ్చి, కారేసుకొని నేరుగా ఆఫీసు కొచ్చాడు చీవాట్లు పెట్టాలని.

తీరా వచ్చి చూస్తే హెడ్‌క్లర్కు మొదలుకొని, ప్యూన్ వరకూ అందరూ లైన్లో నిల్చొనున్నారు.

—నర్లా శ్యామ్‌ప్రసాద్, గూడూరు.



